# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 12 హైదరాబాద్ 101 డిసెంబర్ 2009 పేజీలు : 60 రు. 10

- ఫోకస్ : పాతికేళ్ల తర్వాత భోపాల్
- ఎవరి 'అంతర్గత భద్రత' ?
- రానున్న పారిశ్రామిక బానిసత్వం
- ఉపాధి హామీ పథకం
- కళింగాంధ్ర పై విద్యుత్ దాడి
- మణిపూర్‌లో ఏం జరుగుతోంది?
- మార్క్సిజం - పరిశోధనా పద్ధతి

# వీక్షణం రచయితల సమావేశానికి ఆహ్వానం !

తేది : డిసెంబర్ 13, 2009 ఆదివారం
సమయం : ఉదయం 10 గంటల నుంచి భోజన విరామం దాకా
స్థలం : ప్రెస్ క్లబ్, ఈనాడు ఎదురుగా, సోమాజిగూడ, హైదరాబాద్.

పాఠకుల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొంటూ ఏడు సంవత్సరాలుగా నిరంతరాయంగా సాగుతున్న వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు బలం చేకూరుస్తున్నది మీ వంటి రచయితల రచనలే. ఇప్పటికి వెలువడిన వంద సంచికలలో వీక్షణం 1200 వ్యాసాలు, రచనలు ప్రచురించింది. ఆరువందల మందికి పైగా రచయితలు ఈ కృషిలో పాలుపంచుకున్నారు. అందులో కనీసం రెండు వందలమంది వీక్షణం ద్వారానే మొదటిసారిగా సామాజిక, రాజకీయార్థిక విశ్లేషణ ప్రారంభించారు. వీక్షణం రచయితల జాబితా ఎంత విస్తృతమయినదంటే, ఆ జాబితాలో లేని తెలుగు సామాజిక శాస్త్రవేత్తలు, మేధావులు, వ్యాఖ్యాతలు అతి తక్కువమంది. ఇలా వీక్షణం పురోగతికి, తెలుగు సమాజంలో అత్యవసరమైన భావజాల కృషికి మీరు చేస్తున్న దోహదానికి ధన్యవాదాలు.

ఐనా సాధించవలసింది ఎంతో ఉంది. మరెన్నో రంగాలమీద రచనలు, చర్చలు, విశ్లేషణలు, అనువాదాలు జరగవలసే ఉన్నాయి. తెలుగు సమాజం తెలుసుకోవలసిన, చర్చించవలసిన విషయాలు, ప్రపంచానికి చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఆ కృషికంతటికీ వేదిక కల్పించవలసిన బాధ్యత వీక్షణం పైన కూడ ఉంది. ఆ బాధ్యత నెరవేర్చడానికి మరింతమంది రచయితలు కావాలి. అనువాదకులు కావాలి. ఇతోధికమైన సలహాలు, సూచనలు కావాలి.

అందువల్ల రచయితలతోనూ, రచనలు చేయదలచుకున్నవారితోనూ నిరంతర సంభాషణ జరుపుతూ ఉండాలని, రచయితల మధ్య సంభాషణకు వేదిక కల్పించాలనీ వీక్షణం సంపాదకవర్గం భావిస్తోంది. ఆ దిశగా, గతంలో జరిగిన సమావేశాలకు కొనసాగింపుగా, వీక్షణం రచయితల సమావేశాన్ని డిసెంబర్ 13, 2009 ఆదివారం జరపదలిచాం. వీక్షణంకు రాసినవారూ, రాయదలచుకున్నవారూ అందరూ ఆహ్వానితులే. మీరు తప్పనిసరిగా ఈ సమావేశంలో పాల్గొనాలని, మీ విలువైన అభిప్రాయాలను పంచుకుని, వీక్షణం అభివృద్ధికి తోడ్పడాలని మా కోరిక.

**వివరాలకు** : కార్యాలయం – 040 6684 3495
(ఉదయం 10.00 నుంచి సాయంత్రం 6.00 గంటల వరకు)

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

# వీక్షణం 101

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2009
సంపుటి : 7
సంచిక : 12

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ





**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా



**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com



డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


## సంపాదకీయం

# మనను పాలిస్తున్నది ఖనిజ దొంగల ముఠా

క్రమం తప్పకుండా జరిగే ఎన్నికల తంతును చూపించి ఈ దేశంలో ప్రజాస్వామ్యం ఉన్నదనీ, తాము ఎన్నుకున్న ప్రతినిధులద్వారా ప్రజలు తమను తాము పాలించుకుంటున్నారనీ అరవై సంవత్సరాలుగా ఒక అమాయక నమ్మకం ప్రచారమవుతోంది. అది పచ్చి అబద్ధమని ఇవాళ మధు కోడాలూ, గాలి జనార్దనరెడ్డిలూ నిరూపిస్తున్నారు. ఆ ఇద్దరి పేర్లు బయట పడ్డాయి గాని బహుశా ఇంకా బయటపడని వారు దేశవ్యాప్తంగా కొన్ని వందలమందయినా ఉంటారు. ఆ ఇద్దరిలో ఒకరు ఒక సంపన్నమైన రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేశారు. మరొకరు మరొక సంపన్న రాష్ట్రంలో మంత్రిగా పనిచేస్తూ, ఆ రాష్ట్ర ముఖ్యమంత్రినే శాసించగల స్థితిలో ఉన్నారు. ఈ రెండో వ్యక్తికి మన రాష్ట్రపు గత ముఖ్యమంత్రి కుమారుడితో ఎంత సన్నిహిత సంబంధాలున్నాయో ఆయనే పత్రికా సమావేశంలో చెప్పారు. ఆయన నడుపుతున్న కంపెనీలో వాటాదార్లకు, పైసా కూడ పెట్టుబడి పెట్టకుండానే, 'అనుమతులు సంపాదించి పెట్టినందుకు' యాభై శాతం వాటా ఇచ్చారు. ఆ గత ముఖ్యమంత్రి కుటుంబం కూడ గనుల తవ్వకాల ద్వారానే సంపన్నులయ్యారు. అంటే అనుమతులు ఇచ్చే స్థానంలో ఉన్నవారు, అనుమతులు పుచ్చుకునే స్థానంలో ఉన్నవారు, అనుమతులు ఇప్పించే స్థానంలో ఉన్నవారు – వీళ్లూ ఇవాళ మనను పాలిస్తున్నది. వాళ్లకు అనుమతులు ఇవ్వడం కోసమే మన రాజ్యం, మన పాలన నడుస్తున్నాయి. నిన్నటివరకూ ఒక 'అనుమతి పుచ్చుకునే కంపెనీ' యాజమాన్యంలో ఉన్న చిదంబరం ఇవాళ అనుమతి ఇచ్చే మంత్రి అయ్యారు. ఆ అనుమతులు సవ్యమయినవా కాదా తేల్చవలసిన సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఆ కంపెనీలో తనకు వాటాలున్నాయని చెపుతున్నారు. ఇదీ మన రాజ్యం. దొంగల రాజ్యం. దొంగలు దొంగలు కలిసి ఊళ్లు, అనుమతులు పంచుకునే రాజ్యం. ఇంతకూ ఇంత ముఖ్యమైన అనుమతులు దేనికి? ఈ దేశ సంపదను తమ సొంతం చేసుకోవడానికి. లేదా ఆ సంపదను సరిహద్దుల ఆవలికి తరలించి లాభాలు దండుకోవడానికి. ఆ సంపద భూమి మీద ఉన్నది, భూమిలో నిక్షిప్తమై ఉన్నది. కనుక ఆ భూమిని కబళించాలి. ప్రత్యేక ఆర్థిక మండలాలుగా ప్రకటించి ఆక్రమించాలి. ఆ భూమిపై ఉన్నవారిని అక్కడినుంచి తొలగించాలి. ఆ భూమిమీద తమ తాతముత్తాతలనుంచీ నివసిస్తున్నామనీ, అది తమ వారసత్వ సంపద అనీ, అందువల్ల దాన్ని వదిలి వెళ్లబోమనీ మొండికి వేసేవాళ్ల మీదికి సాయుధ బలగాలను తరలించాలి. వాళ్లను మట్టుబెట్టి అయినా సరే ఆ భూమిని కబ్జా చేయాలి. ఇక అలా ఆక్రమించిన భూమి కన్నా ముఖ్యమైనవి ఆ భూమిలో ఉన్న ఖనిజాలు. బొగ్గు, ఇనుము, మాంగనీస్, బరైటీస్, బాక్సైట్, గ్రానైట్, డొలమైట్, వగైరా – అది ఏ ఖనిజమైనా కావచ్చు. అది బహుళజాతి సంస్థల పరిశ్రమలకు ముడిసరుకు. ఆ పరిశ్రమలు నిరంతరం నడవడానికి, సరుకులు తయారుచేసి లాభాలు సంపాదించడానికి ఆ ముడిసరుకుల నిరాటంకమైన సరఫరా కావాలి. మనరాష్ట్రంలోనే కిరండుల్ – విశాఖపట్నం రైలుమార్గం మీద, సింగరేణి గనుల ప్రాంతపు రైలు మార్గం మీద, ఓబుళాపురం నుంచి అటు బళ్లారికీ, ఇటు కృష్ణపట్నానికీ వెళ్ళే మార్గాల మీద ఒక్కరోజు చూడండి. ఎన్నివేల, లక్షల టన్నుల ఖనిజ సంపద తరలిపోతున్నదో కనబడుతుంది. వేల కోట్ల రూపాయల ఖరీదు చేసే ఆ ఖనిజాన్ని బహుళజాతి సంస్థలకు, దేశదేశాల సంపన్నులకు చేరవేసేందుకు పెద్ద యంత్రాంగం తయారయి ఉంది. ఆ యంత్రాంగంలో వ్యాపారులు, అధికారులు, రాజకీయ నాయకులు కలిసే ఉన్నారు. గతంలో ఈ మూడు వర్గాలు వేరువేరుగా ఉండేవేమోగాని, ఇప్పుడు త్రిమూర్తులు ఏకమై మాజీ అధికారులు కంపెనీలు నడుపుతుంటే, ఆ కంపెనీల యజమానులు రాజకీయ నాయకులై పాలనను, ప్రజాసంపద దోపిడీని, ప్రజల మీద దౌర్జన్యాన్ని కలగలిపారు. ఆ నేర సామ్రాజ్యాధిపతుల కోసమే విధానాలు, చట్టాలు, నిబంధనలు, రక్షణవ్యవస్థలు రూపొందుతున్నాయి. దేశ సంపదలో ప్రధాన భాగమైన ఖనిజవనరుల అన్వేషణ, వెలికితీత, వ్యాపారం పూర్తిగా ప్రభుత్వ రంగంలోనే ఉండాలనే పాత విలువలను రద్దుచేసి, జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థనూ, రాష్ట్రాల ఖనిజాభివృద్ధి సంస్థలనూ దివాళా ఎత్తించి, మన సంపదనంతా వారి సొంత ఖజానాగా మార్చుకోవడం ఎప్పుడో జరిగింది. ఆ ప్రైవేటు యజమానులే ఇవాళ ప్రభుత్వాధినేతలుగా, గనుల మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా ఉన్నారు గనుక ఇవాళ గనులను మళ్లీ ప్రభుత్వ రంగంలోకి తీసుకురావాలనే మాటకు కూడ ఉపయోగం లేదు. ప్రభుత్వ రంగంలోనైనా, ప్రైవేటు రంగంలోనైనా ఖనిజ నిలువల తవ్వకాన్ని పూర్తిగా ఆపివేసి, ఖనిజ విధానాన్ని బహిరంగంగా, ప్రజల భాగస్వామ్యంతో సమీక్షించాలని అడగవలసి ఉంది. ఇంతకాలంగా ఇష్టారాజ్యంగా గనులు తవ్వుకుపోతూ వ్యాపారులు, రాజకీయనాయకులు, అధికారులు సంగ్రహించిన లక్షల కోట్ల రూపాయల సంపద అంతా మోసంతో, అక్రమంగా పోగుపడినదే గనుక దాన్నంతా స్వాధీనం చేసుకుని ప్రజలపరం చేయాలని అడగవలసి ఉంది. ప్రభుత్వాలను నడుపుతున్నదే వాళ్లు గనుక ఈ డిమాండ్లను వాళ్లు ఎంతమాత్రం అంగీకరించరు. ఈ డిమాండ్లమీద విశాల ఉద్యమాన్ని నిర్మించడం, గనుల దొంగలను గద్దెలమీది నుంచి దించడం, వాళ్ల ఆస్తులను స్వాధీనం చేసుకోవడం ఇవాళ ప్రజల ముందర ఉన్న కర్తవ్యాలు.

వీ

# పెరుగుతున్న శతకోటీశ్వరులు

దేశంలో పేదరికం విజృంభిస్తుండగా, నానాటికీ గ్రామాలలో జీవనం దుర్భరమై లక్షలాది మంది పట్టణాలకు వలస వస్తూ ఉపాధిలేక అల్లాడుతుండగా, వేలాది మంది ఆత్మహత్యలు చేసుకుంటుండగా, మరొకవైపు మాత్రం శతకోటీశ్వరుల సంఖ్య పెరిగిపోతున్నది. అంతర్జాతీయంగా కోటీశ్వరుల జాబితా తయారు చేసే ఫోర్బ్స్ అనే పత్రిక తాజా సంచికలో భారతదేశంలో డాలర్ శత కోటీశ్వరులు (డాలర్ బిలియనీర్. అంటే వందకోట్ల డాలర్ల ఆస్తి ఉన్న సంపన్నులు. అంటే దాదాపుగా ఐదువేల కోట్ల రూపాయల ఆస్తిపరులు) పెరిగిపోతున్నారనీ, అలాంటి వారు గత సంవత్సరం 27 మంది ఉండగా, ఈ సంవత్సరం 52 మంది అయ్యారనీ ఆ పత్రిక రాసింది. భారతదేశంలోని సంపన్నులలో మొదటి 100 మంది ఆస్తి 276 బిలియన్ డాలర్లు (13 లక్షల కోట్ల రూపాయలు) గా ఉన్నదని కూడ ఆ పత్రిక రాసింది. ఇలా ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతున్న సంపన్నుల ఆస్తిని కూడ కలిపి లెక్కలు వేసే ప్రభుత్వం జాతీయాదాయం పెరిగిపోయిందనీ, పెరుగుదల రేటు అద్భుతంగా ఉన్నదనీ నమ్మబలుకుతుంది. అలా పెరిగిపోయిన జాతీయ సంపదను జనాభాతో భాగించి, తలసరి ఆదాయం లెక్కలు కట్టి, సగటు మనిషి ఆదాయం ఎంతగా పెరిగిపోయిందో చూడండి అంటుంది. 1992 లో ఎనిమిదివేల రూపాయలుగా ఉన్న తలసరి ఆదాయం 2009 నాటికి ముప్పై ఎనిమిది వేలకు పెరిగిందని గొప్పలు చెప్పుకుంటోంది. కాని, ఈ గాలిబుడగ అసలు స్వభావాన్ని గుర్తించాలంటే, ఈ వందమంది సంపన్నుల ఆస్తిని పక్కనపెట్టి లెక్కవేస్తే జాతీయ సంపద హఠాత్తుగా 25 శాతం తగ్గిపోతుంది. అంటే తలసరి ఆదాయం ఒక్కసారిగా నాల్గింట మూడు వంతులకు పడిపోతుంది. అంటే మన ప్రజల మధ్య అంతరాలు నానాటికీ పెరిగి పోతున్నాయన్నమాట. సంపన్నులు మరింతగా సంపన్నులు అవుతున్నారనీ, పేదలు మరింతగా పేదలు అవుతున్నారనీ గణాంకాల ద్వారా కూడ స్పష్టమవుతున్నదన్నమాట. ఆ సంపద ఎన్ని అక్రమ మార్గాల ద్వారా పోగుపడిందనే విషయం కూడ పక్కనపెట్టినా, అసలు మన రాజ్యాంగంలో ప్రకటించుకున్న ఆదర్శాలు అరవై సంవత్సరాల తర్వాత కనీసంగా కూడ నెరవేరలేదని స్పష్టమవుతుంది. ప్రవేశికలో చెప్పుకున్న ఆర్థిక, సామాజిక సమానత్వం గాని, ఆదేశిక సూత్రాలలో చెప్పుకున్న సంపద సమాన పంపిణీ, సంపద కేంద్రీకరణపై ఆంక్షలు అనే కనీస సూత్రాలను గాని మన పాలకులు అమలు చేయలేదని ఈ శతకోటీశ్వరుల జాబితా మరొకసారి తెలియజెపుతోంది. భారతదేశం వెలిగిపోతోందనే అబద్ధాన్ని ప్రపంచం ముందర ప్రకటించడానికి, ఈ దేశ ప్రజలను, ముఖ్యంగా మధ్యతరగతిని మాయ చేయడానికి ఇటువంటి మిరుమిట్లు గొలిపే వార్తలు వెలువడుతుంటాయి. ఇటువంటి మాయమాటలను జాగ్రత్తగా పరిశీలించి, కనబడే వెలుగులవెనుక చీకట్లను అర్థం చేసుకోవలసి ఉంది. అసలవి వెలుగులేనా విశ్లేషించవలసి ఉంది. ఇంత సంపద పిడికెడు మంది దగ్గర పోగుపడుతుంటే, కోట్లాదిమంది దారిద్ర్యంలో, అనారోగ్యంలో, అవిద్యలో, అసౌకర్యంలో ఎందుకు బతకవలసి వస్తున్నదో ఆలోచించవలసి ఉంది. ఈ దేశ ప్రజల నెత్తుటితో, చెమటతో నిర్మాణమవుతున్న ఈ సంపద సంపూర్ణంగా ఆ ప్రజల చేతుల్లోకి రావలసిఉందనే వాస్తవాన్ని అనుక్షణం ప్రకటించవలసి ఉంది.

# ముజిబుర్ రహమాన్ హంతకులకు శిక్ష

బంగ్లాదేశ్ మాజీ ప్రధానమంత్రి ముజిబుర్ రహమాన్ ను హత్య చేసిన హంతకులకు ఎట్టకేలకు ముప్పైనాలుగు సంవత్సరాల తర్వాత మరణశిక్ష ఖరారయింది. మరణశిక్ష న్యాయాన్యాయాల చర్చ ఎలా ఉన్నా, బంగ్లాదేశ్ చరిత్ర పునరావలోకనానికి ఇది ఒక అవకాశం. పొరుగుదేశాల పాలకుల కుతంత్రాలవల్ల, తమ పాలకుల అస్తవ్యస్త విధానాలవల్ల ఒక చిన్న దేశం తన నలభై సంవత్సరాల జీవితంలో ఎన్ని ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చిందో బంగ్లాదేశ్ తెలియజెపుతుంది. బంగబంధుగా, బంగ్లాదేశ్ జాతిపితగా పేరు తెచ్చుకున్న షేక్ ముజిబుర్ రహమాన్ ప్రత్యేక దేశాన్ని ఏర్పరచి, స్థాపక అధ్యక్షుడై, ప్రధానమంత్రి అయి, నిండా నాలుగు సంవత్సరాలు గడవకముందే కుటుంబ సభ్యులందరితో సహా హత్య చేయబడ్డాడు. ఏ ఆకాంక్షలతో పాకిస్తాన్ నుంచి తూర్పు పాకిస్తాన్ విడిపోయి స్వతంత్ర దేశమయిందో ఆ ఆకాంక్షలు నెరవేరకపోగా, దేశం హత్యలకూ, సైనిక కుట్రలకూ, మరింత పేదరికానికీ, వెనుకబాటుతనానికీ, మత ఛాందసవాదానికీ నిలయమయింది. ప్రజల న్యాయమైన ఆకాంక్షలన్నిటినీ పాలకవర్గాలు వక్రీకరించాయి. ప్రజల పోరాటాలను వంచించాయి. ఆ వక్రీకరణ, వంచన దేశాన్ని అల్లకల్లోలం చేశాయి. బ్రిటిష్ వలసవాదులు భారతదేశం వదిలివెళ్తూ సాగించిన కుట్రలో భాగంగా రెండువేలమైళ్ల దూరంలో విడివిడిగా ఉన్న రెండు భూభాగాలు కలిసి మతప్రాతిపదిక మీద పాకిస్తాన్ ఏర్పడింది. ఆ రెండు ముక్కలలోనూ ప్రజల మత విశ్వాసాలు ఒకటే కావచ్చుగాని, భాషలు వేరు, సంస్కృతులు వేరు, అనుబంధాలు వేరు. అందువల్లనే తూర్పు పాకిస్తాన్ తనను తాను పాకిస్తాన్ లో అంతర్భాగాన్నని ఎన్నడూ అనుకోలేదు. తనను తాను తూర్పు బెంగాల్‌గా మాత్రమే పిలుచుకుంది. రెండు ప్రాంతాలలో భిన్న రాజకీయ సంస్కృతులు సాగాయి. తూర్పు పాకిస్తాన్ బెంగాలీలు తమ పట్ల కొనసాగుతున్న వివక్షను ప్రతిఘటించారు. అటువంటి భిన్న రాజకీయ సంస్కృతులు కాశ్మీర్ లోనో, ఈశాన్య ప్రాంతంలోనో వ్యక్తమయితే బలప్రయోగం ద్వారా, కుట్రలద్వారా అణచివేసిన భారత పాలకవర్గాలు, తూర్పు పాకిస్తాన్ లోని అసంతృప్తికి మాత్రం ఆజ్యం పోశాయి. పొరుగుదేశాన్ని బలహీన పరచడానికి 'శత్రువుకు శత్రువు మిత్రుడు' అనే చాణక్యనీతిని అవలంబించి, తూర్పు పాకిస్తాన్ ప్రజా ఉద్యమానికి ఆర్థిక, సైనిక, నైతిక సహాయం అందించాయి. తమ పాలనలోని ప్రజాఉద్యమాలను నెత్తురుటేర్లలో ముంచినవారే పొరుగుదేశంలోని ప్రజాఉద్యమానికి సహకరించడం గుర్తించవలసిన వైరుధ్యం. మరొకవైపు పాకిస్తాన్ పాలకులు, ముఖ్యంగా సైనిక పాలకులు, తూర్పు పాకిస్తాన్ మీద అమలుచేసిన దమననీతి వల్ల అక్కడ ప్రజాఉద్యమం విస్తృతమయింది. ఆ ఉద్యమమే ముజిబుర్ రహమాన్‌ను బంగబంధుగా మార్చింది. ఎన్నికలు, కుతంత్రాలు, ఎన్నికల ఫలితాలను పాకిస్తాన్ పాలకులు ఆమోదించకపోవడం, ముజిబ్ నిర్బంధం, విచారణ, జైలుశిక్ష అన్నీ సాగి, చివరికి ముజిబ్ నాయకత్వంలోని అవామీలీగ్ సాయుధ గెరిల్లా పోరాటానికి దిగింది. ఇందిరాగాంధీ భారతసైన్యాన్ని అక్కడి సాయుధపోరాటకారులకు అండగా పంపించింది. అలా ఆవిర్భవించిన బంగ్లాదేశ్ సోషలిజం, లౌకిక ప్రజాస్వామ్యం స్థాపిస్తానని వాగ్దానం చేసింది గాని అతిత్వరలోనే ఏకపార్టీ నియతృత్వంగా మారిపోయింది. అలా పొరుగుదేశపు స్వార్థం వల్ల దిగుమతి అయిన స్వాతంత్ర్యం సహజంగానే ఎక్కువ కాలం నిలవలేదు. ముజిబ్ పాలన నాలుగు సంవత్సరాలలోనే తీవ్రమైన అసంతృప్తిని ఎదుర్కోవలసి వచ్చింది. ఆ అసంతృప్తి నేపథ్యంలో ముజిబ్ హత్య జరిగింది. ఆ హంతకులకు ఇవాళ పడిన మరణశిక్ష గురించి చర్చించడమంటే 'దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాయి, జాతులు విముక్తిని కోరుతున్నాయి' అనే వాస్తవికతలో దాగి ఉన్న సంక్లిష్టతను అర్థం చేసుకోవడం కావాలి. వీ

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : ఇరవై అయిదేళ్ల భోపాల్ దురంతం - బహుళజాతి సంస్థలపై పోరాటం

భోపాల్‌లో బహుళజాతి సంస్థల దుర్మార్గం అతి నగ్నంగా బయటపడినప్పటికీ భారత పాలకులు దానినుంచి ఎటువంటి పాఠాలు నేర్చుకోలేదు సరిగదా, మరింతగా బహుళజాతి సంస్థలకు దాసోహమయ్యే స్థితికి దిగజారారు. ఇవాళ దేశంలో బహుళజాతి సంస్థల దురాగతాలను అడ్డుకునే పాలక విధానం ఏదీ లేని స్థితిలో ఉన్నాయి. సామ్రాజ్యవాద లాభాపేక్షా రక్తదాహానికి బలి అయిపోయిన వేలాదిమంది భోపాల్ వాసుల స్మృతిలో, అలా విస్తరిస్తున్న భోపాల్‌ల గురించి, కార్బైడ్‌ల గురించి, వాటికి అవకాశమిస్తున్న పాలక విధానాల గురించి మాట్లాడుకోవలసి ఉంది.


| | | |
|---|---|---|
| ✦ వ్యవసాయంపై కార్పొరేట్ ప్రభావం | - జి.వి. రామాంజనేయులు | 22 |
| ✦ ఎం.ఎన్.సి.ల సేవే ప్రభుత్వ ధ్యేయం | - వై. రామచంద్రం | 24 |
| ✦ భోపాల్ దుర్ఘటన - నేర్వని గుణపాఠాలు | - అరిబండి ప్రసాద్‌రావు | 26 |
| ✦ భోపాల్ దురంతం - ఓ మాయని మచ్చ | - కె. విజయ్‌కుమార్ | 28 |
| ✦ బహుళజాతి కంపెనీలు - వ్యవసాయ రంగం | - కె.ఆర్.చౌదరి | 30 |
| ✦ ఇప్పుడు వెయ్యి భోపాల్‌లు, లక్ష కార్బైడ్‌లు | - ఎన్. వేణుగోపాల్ | 33 |
| ✦ ఉగ్రవాదమే సామ్రాజ్యవాద స్వభావం | - పి. సంజీవమ్మ | 36 |

| | | | |
|---|---|---|---|
| ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు | | | 6 |
| ❖ పాఠకుల వీక్షణం | | | 7 |
| ❖ ప్రాంతీయం | | | 8 |
| ❖ *వర్తమానం* | అంతర్గత భద్రతకు ఎవరు ముప్పు? | - కె.వి. కూర్మనాథ్ | 9 |
| ❖ *వర్తమానం* | ఈ యుద్ధం ఎవరి కోసం? | - రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్ | 11 |
| ❖ *విధానవిమర్శ* | ఉపాధి హామీ పథకం ఎవరికి? | - వి. హనుమంతరావు | 13 |
| ❖ *ఆర్థికరంగం* | జి.ఎస్.టి. గమ్యం ఎంతో దూరం | - తడకమళ్ల వివేక్ | 15 |
| ❖ *అభివృద్ధి - చర్చ* | పారిశ్రామిక బానిసత్వం రాబోతున్నదా? | - పులుగుజ్జు సురేష్ | 17 |
| ❖ *వర్తమానం* | మణిపూర్‌లో ఏం జరుగుతోంది? | - సి. రాజశేఖర్ | 19 |
| ❖ *విధానవిమర్శ* | కళింగాంధ్రకు విద్యుత్ విపత్తు | - సమత | 21 |
| ❖ *విలువలు - వ్యక్తిత్వం* | ఉరితాళ్లను ప్రశ్నించిన వ్యక్తి | - జి. లచ్చయ్య | 38 |
| ❖ ఆర్థిక సంక్షోభం | ముంచుకొస్తున్న మహామాంద్యం | - అరవింద్ | 41 |
| ❖ *శాస్త్రవిజ్ఞానం* | జీవపరిణామం లక్షణాలు | - డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 45 |
| ❖ సినిమా - సాహిత్యం | రెండు సినిమాలు - ఒక నవల | - పి.వి. రమణ | 48 |
| ❖ నేర్చుకుందాం | మార్క్సిజం - పరిశోధనా పద్ధతి | - డానియెల్ లిటిల్ | 50 |
| ❖ దేశీయం | | | 53 |
| ❖ అంతర్దేశీయం | | | 54 |
| ❖ వీక్షణం - 2009 విషయ సూచిక | | | 55 |
| ❖ అసహజ మరణాల సూచి | | - రాంకి, వై. రామచంద్రం | 58 |


'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028












- **దాచిన చరిత్ర –** కోవెన (డా. అంబేద్కర్ ఇంటర్నేషనల్ మిషన్ అవార్డు గ్రహీత) – 32 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : కె.వి. నరసింహం (కోవెన) బ్రాంచ్ మేనేజర్ (రిటైర్డ్), ఎస్.బి.ఐ., 7-141, మిట్టపాళెం వీధి, గూడూరు, నెల్లూరు– 524 101
- **ఐదేండ్ల కాంగ్రెస్ పాలన – విద్రోహం – విధ్వంసం** – తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ – 127 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: ఎం. కోదండరామ్, అధ్యక్షులు, తెలంగాణ విద్యావంతుల వేదిక, 12-13-578, నాగార్జున నగర్, తార్నాక, సికింద్రాబాద్ – 500 017; సెల్ : 98483 87001; అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **ఇండియా గేట్** – ఎ. కృష్ణారావు – ఎమెస్కో – 352 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు : ఎమెస్కో బుక్స్, సూర్యారావు పేట, విజయవాడ – 520 002, ఫోన్ : 0866 – 2436643, 98499 92890; దోమలగూడ, హైదరాబాద్ – 500 029, ఫోన్ : 040 – 23264092, ఫ్యాక్స్ : 040 – 23264028; ఇమెయిల్:emescobooks@yahoo.com; www.emescobooks.com
- **కథావలోకనం** – విమర్శ వ్యాసాలు – కె.పి. అశోక్ కుమార్ – పాలపిట్ట బుక్స్ – 140 పేజీలు, 1/8 డెమీ, రు. 50
- **ఒబామా** – స్ఫూర్తిదాయక విజయగాథ – గుడిపాటి – పాలపిట్ట బుక్స్ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 50

  పై రెండు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; ఇమెయిల్:palapittabooks@gmail.com
- **మన కొడవటిగంటి –** శ్రీశ్రీ వ్యాసాలూ, కామెంట్సూ, కాంప్లిమెంట్సూ – శ్రీశ్రీ సాహిత్య నిధి ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520 004; ఫోన్ : 0866-6617375, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 98485 04649, 92462 77375; ఇమెయిల్: srisri_sahityanidhi@yahoo.com
- **పట్నమొచ్చిన పల్లె** – బతుకు కథల లేఖా నవలిక – భూపాల్ – వెన్నెల ప్రచురణలు – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: భూపాల్, 2-2-985, అంబర్‌పేట్, హైదరాబాద్ – 500 013, సెల్: 98662 04260; విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు
- **భారతదేశంపై మార్క్స్, ఎంగెల్స్, లెనిన్** – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 74 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5-85-4/బి, పండరీపురం, 1వ లేను, గుంటూరు – 522 022, సెల్ : 99853 77760; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్స్
- **స్పాట్ సిగ్నేచర్స్** – తెలుగు ఉపన్యాసకుల కవిత్వం – ప్రధాన సంపాదకులు : డా. నాళేశ్వరం శంకరం – డిగ్రీ స్పాట్ వాల్యుయేషన్ సెంటర్ ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : డా. నాళేశ్వరం శంకరం, 16-11-774/1, శారదా అపార్ట్‌మెంట్, ముసారాంబాగ్, హైదరాబాద్ – 500 036, ఫోన్ : 040 2454 2019
- **ఇతిహాసానికి కొత్త కోణాలు – తెలుగింటి పురాతన నాణేలు** – డా. దేమె రాజారెడ్డి, డా. గోపరాజు నారాయణరావు – రామయ్య విద్యాపీఠం – 135 పేజీలు, 1/8 డెమీ, రు.70, ప్రతులకు: రామయ్య విద్యాపీఠం, జూలూరు గౌరీశంకర్, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో











వీక్షణం నవంబర్ 09 సంచికతో వంద సంచికలు పూర్తి చేసుకొన్న మీకు నా శుభాకాంక్షలు. వర్తమాన సమకాలీన రాజకీయాంశాలపై తనదైన రీతిలో స్పందిస్తూ యువతరానికి దిక్సూచిలా వీక్షణం నిలుస్తుంది. అలాగే మీకు వీలుంటే తదుపరి సంచికలో విద్యకు కూడా స్థానాన్ని ఇవ్వగలరు. ప్రస్తుత సంచిక బాలగోపాల్‌కు అంకితం చేయడం, పౌర, మానవ హక్కుల కోసం జనంలోంచి మరో బాలగోపాల్‌ను వెతకడంలో భాగమే అని మా తలంపు. ఇది నిరాటకంగా కొనసాగాలని ఆశిస్తూ...

**– పి. మధూకర్**
సూర్యాపేట, నల్లగొండ జిల్లా

ప్రస్తుతం మార్కెట్‌లో వస్తున్న దిన, వార, పక్ష పత్రికలు అందమైన రంగులతో పాఠకుల మనసును దోసుకోవాలని రకరకాల ప్రయత్నాలు చేస్తున్నాయి. కాని నాకు, 'వీక్షణం' రాజకీయ, ఆర్థిక, సామాజిక పత్రిక నిజంగా పాఠకుని మనస్సు దోచుకునే పత్రికగా వస్తోంది. ఇందులో ప్రతి వ్యాసం పూర్తి పాఠంగా ప్రచురిస్తున్నారు. మిగిలిన పత్రికలు కొంత వ్యాసం ఒక వారంలో వేస్తే మిగిలిన సగం మరో వారంలో ప్రచురిస్తారు. దీంతో నేటి ఆధునిక యుగంలో ఒక వారంలో చదివిన వ్యాసాన్ని మరోవారం చదవలేక అసంతృప్తితో ఉంటున్నారు పాఠకులు. అందుకు భిన్నంగా రచయిత, లేదా వ్యాసకర్త తాను ఒక అంశం పై రాసిన పూర్తి పాఠాన్ని ప్రచురిస్తున్న ఏకైక పత్రిక వీక్షణంగా చెప్పుకోవచ్చు. పాఠకునిగా నాకు నచ్చిన రెండు అంశాలున్నాయి. ఒకటి, వీక్షణం చదివిన పాఠకుల ప్రతిస్పందన రాస్తే ఉత్తరాలు పూర్తి పాఠంగా ప్రచురించడం. రెండవది, తమ ప్రాంత సమస్యలపై వస్తున్న వాటికి ప్రాధాన్యతను ఇచ్చి ప్రచురించడంలో వీక్షణం పాఠకుల పక్షాన ఉందనీ, వారి అభిప్రాయాలను గౌరవిస్తోందనీ చెప్పడానికి నిదర్శనం. 94వ సంచికలో ప్రచురించిన అన్ని వ్యాసాలు చదవగలిగినవిగా ఉన్నాయి. ఒక్క వ్యాసం చదివితే అందులో మరో అంశం మర్చిపోనిదిగా ఉంది. పూర్తి పాఠంను ప్రతి వ్యాసంలో పాఠకుడు చదువుకునే విధంగా వీక్షణం పత్రిక ఉంది.

**– ఆస శ్రీరాములు**
సికిందరాబాద్

నూరవ సంచిక ఫోకస్ ' ప్రజా జీవన స్థితిగతులు – రావలసిన మార్పులు' ఒక అవసరాన్ని తీరుస్తుంది. ఒక ఖాళీని పూరిస్తుంది. నూటికి 80 మంది రోజుకి 20 రూపాయలకన్నా తక్కువతో బతుకుతున్నారని సర్వేలు చెబుతున్నాయి. అలాంటివారెలా రోజులు గడుపుతున్నారో గణాంకాలు చెప్పవు. చాలామందికి వాళ్ల గురించి తెలియదు. చెప్పినా కొందరు నమ్మరు. పనులు లేని వాళ్ళు లేరనీ, పనిచేసేవాళ్లు దొరకటం లేదని అంటుంటారు. కూలీలు కూడా వందల్లో సంపాయిస్తున్నారంటారు. వాళ్లకి అట్టడుగు ప్రజల సాధక బధకాలు తెలుసుకునే అవకాశం కల్పించింది వీక్షణం. రకరకాల పనులు చెసుకునే వాళ్లు చెప్పినవి సేకరించారు. ఎవరేమాటల్లో చెప్పారో అలానే వాళ్లు రాశారు. ఇంత మంచి కొత్త శీర్షిక వున్న నూరవ సంచిక విశేషంగా ఆకట్టుకుంటుంది.

**– ఇ.ఎస్. బ్రహ్మచారి**
ఒంగోలు

నవంబర్ 09 సంచికతో వంద సంచికలు పూర్తి చేసుకొన్నందుకు వీక్షణంకు అభినందనలు. ఈ సంచికలో 'ప్రాజెక్టులు – రాజకీయ ప్రయోజనాలు' పేరుతో వచ్చిన నాగోబా గారి వ్యాసం బాగుంది. ఎన్నో కొత్త కోణాలను, నీటి ప్రాజెక్టుల వెనుక ఉన్న రాజకీయాలను బయటపెట్టింది. దీనిని బట్టి రాష్ట్రంలోని నీటి ప్రాజెక్టులలో ఏయే కారణాల వల్ల ఏయే మార్పులు చేపట్టారో, ఎవరెవరి ప్రయోజనాలు వాటి వెనుక దాగి ఉన్నాయో అధ్యయనం చేస్తే విషయాలు బయటపడతాయి. సాంకేతిక అధికారుల పనుల్లోకి కూడా దానికి సంబంధించిన జ్ఞానం లేని రాజకీయ నాయకులు చొరబడితే ఎలాంటి ప్రమాదాలు సంభవిస్తాయో ఇటీవల రాష్ట్రంలో సంభవించిన వరదల సందర్భంగా బయటపడింది.

**– డి. రామారావు**
రామచంద్రపురం, తూర్పు గోదావరి జిల్లా

వీక్షణం వందో సంచికను సామాన్యుల అభిప్రాయాలతో తేవడం చాలా బాగుంది. వివిధ రంగాలలో పనిచేస్తూ అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్న కార్మికులు, స్త్రీల అభిప్రాయాలు తీసుకు రావడం ముదావహం.

**– టి. ప్రభాకర్**
హైదరాబాద్

గుజరాత్ మారణకాండపై వచ్చిన 'రెండు సినిమాలు – ఒక నవల' ను పరిచయం చేస్తూ వస్తున్న సీరియల్ వ్యాసం బాగుంది. అయితే సినిమా కథా సారాంశాన్ని మాత్రమే పరిచయం చేసి విశ్లేషిస్తే బాగుండేదేమో.

**– బి. శేషు**
ఆదిలాబాద్

వీక్షణం నవంబర్ సంచికలో నేర్చుకుందాం శీర్షికన ప్రచురించిన కె. బాలగోపాల్ వ్యాసం 'చారిత్రక దృక్పథం' చాలా అవసరమైన వ్యాసం. చరిత్రను చూడాల్సిన పద్ధతి, అర్థం చేసుకోవాల్సిన పద్ధతికి సంబంధించి లోతైన దృష్టిని ఇస్తుంది. చరిత్రను అధ్యయనం చేసేవారికి, విద్యార్థులకు ఎంతో ఉపయోగ పడుతుంది. ఇంకా ఇలాంటి మంచి వ్యాసాలను మరిన్ని అందిస్తారని ఆశిస్తున్నాం.

**– ఎం. జగదీష్**
హైదరాబాద్

## ప్రజల ఆరోగ్యంతో చెలగాటం

రాష్ట్ర ప్రభుత్వం ఆరోగ్య శ్రీ పథకం ప్రవేశపెట్టాక యాంజియో ప్లాస్టి ద్వారా స్టెంట్లు అమర్చే శస్త్ర చికిత్సలు ఎక్కువగా జరుగుతుండడంతో వాటి విక్రయాలు జోరందుకున్నాయి. నాసికరం స్టెంట్లు, ఎక్కువ మార్జిన్ వచ్చే స్టెంట్లు ఉపయోగించి ఫార్మా కంపెనీలు లాభాలు చేసుకుంటు న్నాయి. ఇంప్లాంట్స్ ప్రమాణాలు, దుష్ఫలితాలు వస్తే ఎలాంటి చర్యలు చేపట్టాలనే అంశాలతో చట్టం చేస్తే, క్లినికల్ ట్రయల్స్ సక్రమంగా నిర్వహిస్తే నాణ్యతతో కూడిన సేవలు అందించడానికి వీలవుతుందని విశాఖలోని ఔషధ నియంత్రణ శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ రావిఉదయ్ భాస్కర్ సూచించారు.

## అవినీతికి హద్దేమిటి ?

భారీ నీటిపారుదల ప్రాజెక్టులలోని డిజైన్ విభాగంలో సీనియర్ అధికారి, శ్రీశైలం ప్రాజెక్ట్ స్పెషల్ డిజైన్స్ సర్కిల్‌లో డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ ఆకుల సూరిబాబు అక్రమ ఆస్తులపై అవినీతి నిరోధక శాఖ అధికారులు అక్టోబర్ 27న దాడులు నిర్వహించారు. అంతకు ముందు ఆయన ధవళేశ్వరం ప్రాజెక్ట్‌లోనూ డిజైన్‌ల విభాగంలో పనిచేశారు. డిజైన్లలో మార్పులు చేసి కోట్లాది రూపాయలు అక్రమంగా సంపాదిం చారు. ఆయనకు ప్లాట్‌లు, ఫ్లాట్‌లు, వెండి, బంగారం, డిపాజిట్‌లు, పాలసీలు, వాహనాలు ఇలా వివిధ రూపాల్లో ఉన్న ఆస్తుల విలువ 50 కోట్లు రూపాయల విలువ చేస్తాయని అధికారులు అంచనా వేశారు.

## జైల్ భరో..... జాగో... జగావో

హైదరాబాద్ 'ఫ్రీ జోన్' కాదంటూ రాజ్యాంగ సవరణ చేయాలనే డిమాండ్‌తో అక్టోబర్ 28న తెలంగాణ రాష్ట్ర సమితి నాయకత్వంలో తెలంగాణ ప్రాంతమంతటా జైల్ భరో కార్యక్రమాన్ని చేపట్టారు. ఉదయం నుంచే టిఆర్ఎస్ శ్రేణులు, తెలంగాణ వాదులు ఆర్‌డిఓ, కలెక్టర్, ఇతర ప్రభుత్వ కార్యాలయాల ముందు ధర్నాలు నిర్వహించారు. హైదరాబాద్ లోని ఇందిరా పార్క్ వద్ద ధర్నాచౌక్‌లో ధర్నా చేశారు. ఈ సందర్భంగా కాకతీయ విశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్సలర్ ప్రొ. జయశంకర్, మాజీ చీఫ్ ఇంజనీర్ ఆర్. విద్యాసాగర్ రావు, తెలంగాణ విద్యావంతుల వేదిక అధ్యక్షులు ఎం. కోదండరాం, టిఆర్ఎస్ అధ్యక్షులు కె. చంద్రశేఖర రావు ప్రసంగించారు. తెలంగాణ వ్యాప్తంగా నలభై వేల మంది అరెస్టు అయినట్లు తెలుస్తోంది. అలాగే నవంబర్ 1ని 'తెలంగాణ విద్రోహ దినం'గా పాటించి రచయితలూ, కవులూ, కళాకారులూ, మేధావులూ తమ నిరసనను తెలియజేశారు.

## రైతు, వ్యవసాయ రక్షణలకై ఉద్యమం

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం పట్టణంలోని ఎ.ఎస్.ఆర్. సాంస్కృతిక కేంద్రంలో నవంబర్ 8న అఖిల భారత కిసాన్ సభ 19వ రాష్ట్ర మహాసభలు ప్రారంభమై, మూడు రోజుల పాటు జరిగాయి. సంస్థ ప్రధాన కార్యదర్శి ప్రారంభోపన్యాసంలో మాట్లాడుతూ, రైతులు, వ్యవసాయ రక్షణ, ఆహార భద్రతలకై దేశవ్యాప్తంగా ఐక్య ఉద్యమం అవసరమని అభిప్రాయపడ్డారు. వ్యవసాయ రంగం నుంచి పేద రైతులను తొలగించేందుకు పాలకులు కుట్రపన్నుతున్నారని ఆరోపించారు. ఈ సభలో ఇంకా ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం, రాష్ట్ర రైతు కార్యాచరణ సమితి, కౌలు రైతుల సంఘం ఇంకా వివిధ రైతు సంఘాల ప్రతినిధులు, మేధావులు ఈ సభలో పాల్గొన్నారు.

## జూనియర్ డాక్టర్ల సమ్మె

జూనియర్ డాక్టర్ల స్టైఫండ్ పెంపు విషయంలో రాష్ట్ర ప్రభుత్వానికీ, జాయింట్ యాక్షన్ కమిటీకి మధ్య నవంబర్ 17న సయోధ్య కుదిరింది. స్టైఫండ్ 80 సాతం పెంపుకు, ప్రతి రెండేళ్లకోసారి 15 శాతం పెంపునకు ప్రభుత్వం ఆమోదించడంతో రెండు వారాలకు పైగా చేసిన సమ్మెను జూనియర్ డాక్టర్లు విరమించారు.

## హైదరాబాద్ కార్పొరేషన్ ఎన్నికలు

గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలు నవంబర్ 23న జరగనున్నాయి. 150 డివిజన్‌లు కలిగి ఉన్న గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌లో 59 లక్షల మంది ఓటర్లు ఉన్నారు. ఈ ఎన్నికలలో కాంగ్రెస్-150, టిడిపి-141, బిజెపి-137, లోక్‌సత్తా-126, పిఆర్‌పి-64, సిపిఎం-35, సిపిఐ-13, ఎంఐఎం-70, ఇతరులు-34 స్థానాలలో పోటీ చేస్తున్నారు. ఇండిపెండెంట్ అభ్యర్థులు 540 మంది బరిలో ఉన్నారు. ఎన్నికల ఫలితాలు నవంబర్ 26 వెలువడనున్నాయి. గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌గా ఏర్పడ్డాక జరుగుతున్న తొలి కార్పొరేషన్ ఎన్నికలు.

## గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా...

ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వెంటనే నిలిపివేయాలని డిమాండ్ చేస్తూ గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటీ ఆధ్వర్యంలో 45 ప్రజా సంఘాలు నవంబర్ 7న హైదరాబాద్‌లో ర్యాలీ, ధర్నా నిర్వహించాయి. రాంనగర్ చౌరస్తా నుంచి ర్యాలీ ప్రారంభమై, బాగ్‌లింగంపల్లి సుందరయ్య పార్క్ వరకూ సాగింది. అనంతరం జరిగిన ధర్నాలో పలువురు వక్తలు 'మావోయిస్టుల పై యుద్ధం పేరుతో ఖనిజ వనరులను దోచుకోవడానికి ఆదివాసులపై చేపడుతున్న ఈ దాడులను కేంద్ర ప్రభుత్వం వెంటనే ఆపివేయాలని' డిమాండ్ చేశారు.

## చూపు కోల్పోయారు...

నెల్లూరు బొల్లినేని ఆస్పత్రి శస్త్ర చికిత్సలతో 23 మంది చూపు కోల్పోయారు. చికిత్సకు వినియోగించిన రింగర్ ల్యాక్టేట్ తయారీ దారులు, జిల్లా కలెక్టర్, పోలీస్ సూపరింటెండెంట్, వైద్య ఆరోగ్య శాఖ అధికారి నవంబర్ 26న తన ముందు హాజరు కావాలని రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ ఆదేశించింది. శస్త్ర చికిత్సలో చూపు కోల్పోయిన బాధితుల ఉదంతాన్ని తనకు తానుగా విచారించిన కమిషన్ బాధితులకు యాభై వేల రూపాయలు నష్టపరిహారాన్ని చెల్లించాలని గతంలోనే సూచించింది. వీ

*దేశ భద్రతకూ, సార్వభౌమాధికారానికీ ముప్పు ప్రభుత్వ విధానాల్లో ఉందో, లేక మావోయిస్టుల ఉద్యమం వల్ల ఉందో ఆలోచించమంటున్నారు* **కె.వి. కూర్మనాథ్**

# అంతర్గత భద్రతకు ఎవరు ముప్పు?

**యు**ద్ధం మొదలైంది. 'ప్రజాస్వామ్యానికి పెను సవాలైన మావోయిస్టులను సమూలంగా నాశనం చేస్తామ'ని ప్రభుత్వం ప్రకటించింది. మావోయిస్టుల మీదా, ఆదివాసుల మీదా ఎందుకు ప్రభుత్వం దండెత్తుతుందో, ఏయే వనరుల స్వాధీనానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందో ఇప్పటికే అనేక వ్యాసాల్లో చాలామంది చెప్పారు.

గతంలో ఎన్నడూ లేని విధంగా ఇంత పెద్ద ఎత్తున కేంద్ర ప్రభుత్వం ఎందుకు రంగంలోకి దిగింది? మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయడానికి పథకాలు వెయ్యడం, రాష్ట్రాలకు ఆర్థిక సహాయం చెయ్యడం, అత్యాధునిక ఆయుధాలు సరఫరా చెయ్యడం, కేంద్ర బలగాలను పంపించడం చాలా సంవత్సరాల నుంచి జరుగుతున్నదే. కానీ ఇప్పుడు స్వయంగా కేంద్రమే ఎందుకు రంగంలోకి దిగింది? యుద్ధాన్ని ఎవరు ప్రేరేపిస్తున్నారు? వారికి అంత అవసరం ఎందుకొచ్చింది? వారింతకాలం ఎవరి ప్రయోజనాల కోసం, ఏయే విధానాలను అనుసరిస్తూ వచ్చారు? అన్న ప్రశ్నలు వేసుకుంటే ఆసక్తికర అంశాలు బయటపడతాయి.

గ్రీన్‌హంట్ గురించి ప్రభుత్వ రాజకీయ విధానాలను బలంగా మాట్లాడుతున్నది ప్రధానంగా ముగ్గురు – ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్, హోంమంత్రి పి. చిదంబరం, హోం శాఖ కార్యదర్శి జి.కె. పిళ్లై. (వీళ్లే కాక జాతీయ భద్రతా సలహాదారు ఎం.కె. నారాయణన్, ప్రణబ్ ముఖర్జీ, బుద్ధదేవ్ లాంటి వారున్నారు. కానీ వీళ్ల ముగ్గురి గురించి ముందు చూద్దాం.)

వీళ్లెవరు? మొదటి ఇద్దరూ కాంగ్రెస్ నాయకులు. మూడో వ్యక్తి 1972 బ్యాచ్‌కి చెందిన ఐఎఎస్ ఆఫీసర్. ఇంతే అనుకుంటే పొరపాటే. గత 30, 40 సంవత్సరాలుగా వీళ్లు చేస్తున్న పనులు గమనిస్తే మావోయిస్టు ఉద్యమంపై వీళ్లకెందుకంత అక్కసో, భయమో, సహించలేని తనమో అర్థమవుతుంది.

వీళ్లు ముగ్గురూ విడివిడిగా, కలిసి అమలు చేసిన విధానాలు చూస్తే చాలు వీళ్ల యుద్ధ ప్రయత్నం వెనుకనున్న అంతర్యం తెలుస్తుంది.

యుద్ధానికి అసలు కారణం మన్మోహన్ సింగ్ (సోనియాగాంధీ నాయకత్వంలో). ఈయన బయోడెటా ఒక్కసారి చదివితే చాలు ఈయన ఆత్మ ఎక్కడుందో తెలుస్తుంది. ప్రపంచబ్యాంక్, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ (ఐఎంఎఫ్), ఆసియా అభివృద్ధి బ్యాంక్ (ఎడిబి) లతో ఈయనకు చాలా అనుబంధం ఉంది. ఎంత అనుబంధమంటే – ఆయన వయసు 78 సంవత్సరాలయితే, అందులో సగానికి పైగా (45 సంవత్సరాలు) ఈ సంస్థలలో పనిచేశారు. పని చెయ్యడమంటే ఏదో జీవనోపాధికి పనిచెయ్యడం కాదు. ఆయా సంస్థలతో భారత ప్రభుత్వం జరిపిన అన్ని రకాల చర్చలకు, ఒప్పందాలకు ఈయనే నేతృత్వం వహించారు. 1972 నుంచి కొన్నేళ్లపాటు ఐఎంఎఫ్, అంతర్జాతీయ పునర్నిర్మాణ, అభివృద్ధి బ్యాంక్‌లో (ఐబిఆర్‌డి) సమావేశాలకు భారత ప్రభుత్వ ప్రతినిధి. 1976–80 సంవత్సరాలకు ఐఎంఎఫ్, ఎడిబిలకు భారత ప్రభుత్వానికి ఆయన ప్రత్యామ్నాయ గవర్నర్. 1991–95 మధ్య ఐఎంఎఫ్, ఐబిఆర్‌డి లకు భారత ప్రభుత్వం తరపున గవర్నర్.

ఆర్థిక మంత్రి అయ్యాక ఐఎంఎఫ్ చెప్పిన షరతులన్నిటినీ ఒప్పుకుని 25,000 కోట్ల రూపాయల అప్పు తీసుకొచ్చాడు. ఇందులో ప్రధానమైన షరతు, ఆర్థిక వ్యవస్థపై ఉన్న 'సంకెళ్ల'ను ఛేదించి ప్రపంచ మార్కెట్‌ను ఆహ్వానించడం. ప్రపంచబ్యాంక్, ఐఎంఎఫ్, ఎడిబి ల విధానాల రూపకల్పనలో పాలుపంచుకొన్న మన్మోహన్ 1991లో పి.వి. నరసింహారావు కేబినెట్‌లో ఆర్థికమంత్రి అయ్యారు. దేశీయ పరిశ్రమలను, ఆర్థికవ్యవస్థను విచ్ఛిన్నం చేసి, లక్షలాది మంది జీవనోపాధి కోల్పోడానికి కారణమైన సరళీకరణ విధానాలు ఆయన రూపొందించి, అమలు చేశారన్నది అందరికీ తెలిసిందే.

ఈ విధానాలని కొనసాగించడానికి ప్రధానమైన అడ్డంకి మావోయిస్టులు. శతాబ్దాల పాటు, ప్రభుత్వాల నిర్లక్ష్యానికి గురై, మావోయిస్టు ఉద్యమ ఫలితంగా స్వావలంబన దిశలో సాగుతున్న ఆదివాసుల పట్ల ప్రేమ కలగడానికి వాళ్ల కాళ్ల కింద ఉన్న గనులు. వాళ్లకి వెన్నుదన్నుగా ఉన్న మావోయిస్టుల పట్ల మన్మోహన్‌కు కోపం కలగడానికి కారణం ఇదే. 'తుపాకీ నీడన అభివృద్ధి అసాధ్యం' అంటాడీయన, ఆదివాసుల వెనుకబాటుకు మావోయిస్టులే కారణమని సూత్రీకరిస్తూ.

అక్కడ మావోయిస్టులు లేనపుడు ఎందుకు అభివృద్ధి జరగలేదని అడిగితే ఏమని జవాబిస్తాడు? పోనీ, మావోయిస్టుల ప్రభావం లేని ప్రాంతంలో ఎందుకు అభివృద్ధి జరగలేదని అడిగితే ఏమని సమాధానం ఇస్తాడు? ఈ వ్యాసం రాస్తున్న సమయానికి మన్మోహన్ అమెరికా ప్రత్యేక అతిథిగా అక్కడ పర్యటిస్తున్నాడు. గ్రీన్‌హంట్‌కు అమెరికా ఆశీర్వాదం తీసుకోవడం కోసమే కాదు, గనుల్లో పెట్టుబడులు పెట్టమని అక్కడి వ్యాపారవేత్తలను కోరడానికి కూడా.

ఇక 'గ్రీన్‌హంట్' యుద్ధానికి స్వయంగా నేతృత్వం వహిస్తున్న చిదంబరం చరిత్ర చాలా ఆసక్తికరమైంది. ఇతడు మన్మోహన్‌కు ప్రియశిష్యుడు. సరళీకరణ విధానాల అమలులో అతడికి సరైన వారసుడు. అంతేకాదు, మన్మోహన్ కంటే ఉత్సాహంగా ఆ విధానాలను అమలు పరిచినవాడు. మోసకారి. చాల బహుళజాతి సంస్థలకు న్యాయ సలహాదారు. స్టాక్ మార్కెట్ కుంభకోణంలో ప్రత్యక్ష సంబంధమున్న ఫెయిర్ గ్రోత్ ఫాక్స్ కంపెనీలో వాటాదారు. పన్నులు ఎగ్గొట్టిన కోటీశ్వరులకు దొడ్డి తోవ కల్పించి పన్నుల భారం లేకుండా చేసినవాడు. సామాన్య ప్రజల ఫోన్ల బిల్లుల్లో, సెలూన్ సర్వీసులు, లాండ్రీ సర్వీసులపై పదిశాతం సర్వీస్ పన్ను (ఇంత అన్యాయమైన పన్ను మరొకటి ఉండదు) విధించినవాడు. 1985 నుంచి ఇప్పటి వరకు చిదంబరం వాణిజ్య, ఆర్థిక, హోంశాఖల్లో ఏదో ఒక శాఖకు మంత్రిగా ఉన్నాడు. మూడు శాఖల లక్ష్యాలు ఎంత జమిలిగా కలిసి ఉన్నాయో, చిదంబరాన్ని ఈ శాఖలకు మార్చి మార్చి వెయ్యడాన్ని బట్టి అర్థమవుతుంది.

సరళీకృత ఆర్థిక విధానాలను, అవి తెచ్చిన అభివృద్ధి ఫలాలు రాజకీయ నాయకులు ఎలా అనుభవించారో ఎవరైనా కేస్ స్టడీ చెయ్యాలనుకుంటే చిదంబరం గురించి చదివితే సరిపోతుంది. అధికారంలో లేనపుడు కార్పొరేట్ కంపెనీల తరపున కోర్టుల్లో వాదించి, అధికారంలోకి వచ్చిన వెంటనే ఆయా కార్పొరేట్ వర్గాలకు అనుకూలమైన నిర్ణయాలు తీసుకుంటూ ఉండేవాడు. ప్రతికూల విధానాలేవైనా అప్పటికే ఉంటే వాటిని అమలు పరచకుండా చూసి తాత్సారం చేసేవాడు.

దీనికి ప్రధానంగా రెండు ఉదాహరణలు చెప్పవచ్చు. ఒకటి, ఎన్రాన్ ఉదంతం. మరొకటి వేదాంత ఉదాహరణ. అమెరికాకు చెందిన ఎన్రాన్ మహారాష్ట్రలో విద్యుత్ కేంద్రాన్ని పెడతామని ప్రతిపాదన చేసింది. (ఇది కూడా సరళీకృత విధానాలు మొదలయ్యాక అని గమనించాలి.) ప్రభుత్వం కేవలం అంగీకరించడమే కాదు, ఆ ప్రాజెక్టుకు కౌంటర్ గ్యారంటీ (ఎవరి దగ్గరైనా మనం అప్పు తీసుకుంటే ఏదో ఒకటి హామీగా చూపుతాం. కానీ కౌంటర్ గ్యారంటీ అంటే అప్పు ఇచ్చినవాడే హామీ ఇవ్వడం) అంటే ఏదైనా కారణంతో ఎన్రాన్‌కు నష్టం వాటిల్లితే ఆ కంపెనీకి ప్రభుత్వమే నష్టపరిహారం ఇవ్వడానికి ఒప్పుకుందన్నమాట. దీనికి సంబంధించి ఎన్రాన్‌కు న్యాయసలహాలు అందించినవాడు లాయర్ చిదంబరం. ఒకవేళ వివాదం తలెత్తితే ఏమేం చెయ్యాలో కంపెనీకి డ్రాఫ్ట్ తయారు చేసి ఇచ్చాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే ఎన్రాన్ ప్రపంచవ్యాప్తంగా చేసిన మోసాలు బయటకు రావడం, మహారాష్ట్ర ప్రాజెక్ట్ సంక్షోభంలో పడడం జరిగింది. సరిగ్గా ఇదే కాలంలో చిదంబరం మళ్లీ మంత్రి అయ్యాడు. ఒప్పందం ప్రకారం ఎన్రాన్‌కు నష్టపరిహారం చెల్లించాలి. కానీ అందుకు ప్రాజెక్ట్ కొంచెం ముందుకైనా వెళ్లాలి. అందుకోసం, ఎన్‌టిపిసి, ఎల్ఐసి వంటి ప్రభుత్వరంగ సంస్థలను ప్రభుత్వం బలవంతంగా రంగంలోకి తీసుకు వచ్చింది. ప్రాజెక్ట్ కోసం ఎన్రాన్ అంతర్జాతీయంగా తీసుకున్న అప్పులను ఈ సంస్థలు తీర్చాల్సి వచ్చింది. అధికారంలో లేనపుడు, అధికారంలోకి వచ్చాక, అన్ని కాలాల్లోనూ చిదంబరం గుండె కార్పొరేట్ రంగం కోసమే కొట్టుకుంటుంది.

ఇక రెండో ఉదాహరణ వేదాంత. అమెరికాకు చెందిన ఈ కంపెనీ తరపున బొంబాయి హైకోర్టులో 2003లో చిదంబరం వాదించేవాడు. ఆ కంపెనీ బోర్డులో ఆయన డైరక్టరు కూడా. వేదాంతకి స్టెరిలైట్ ఆప్టికల్ టెక్నాలజీస్ అనే అనుబంధ కంపెనీ ఉంది. ఈ కంపెనీలో తయారయ్యే అన్ని వస్తువులూ ఎగుమతి కోసమే (వందశాతం ఎక్స్‌పోర్ట్ ఓరియంటెడ్ కంపెనీ). ఇలాంటి కంపెనీలను ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక ప్రోత్సాహకాలనిస్తుంది. ఇట్లా రాయితీలను పొందిన స్టెరిలైట్ తను తయారు చేసిన వస్తువులను భారతదేశంలోనే అమ్మింది. దీనివల్ల ప్రభుత్వానికి 240 కోట్ల రూపాయల నష్టం కలిగింది. ఈ మొత్తాన్ని కట్టాలని అధికారులు కేసు పెడితే, పన్ను లేమీ కట్టాల్సిన అవసరం లేదని ముంబై హై కోర్టులో చిదంబరం, ఆయన భార్య వాదించారు. ఆ తర్వాత కంపెనీ అభ్యర్థన మేరకు కట్టాల్సిన మొత్తాన్ని రెండు వందల కోట్లకు తగ్గించింది. ఇది కూడా కట్టకుండా కోర్టుకు తీసుకువెళ్లింది. చిదంబరమే వాదించి స్టే ఆర్డర్ కూడా తెప్పించాడు.

ఇది జరిగిన కొన్నాళ్లకు కాంగ్రెస్ అధికారంలోకి రావడం, చిదంబరం ఆర్థికమంత్రి కావడం జరిగింది. స్టెరిలైట్ కేసు సంగతి ఏమయ్యిందయ్యా అని అడిగితే 'వివాదం కోర్టులో ఉంది కాబట్టి మాట్లాడను' అని సమాధానమిచ్చాడు.

కేసును ప్రత్యేక రెవెన్యూ బెంచ్‌కి తరలించేట్టు, ఎగుమతి నిబంధనలను ఉల్లంఘించినందుకు ఫైన్‌ను రాబట్టేందుకు ఆర్థిక మంత్రిగా చర్యలు తీసుకోవచ్చు. కానీ తీసుకోలేదు. ఎందుకంటే, డైరెక్టరుగా ఏటా 35 లక్షల రూపాయల వేతనం, లాయర్‌గా వెలుగులోకి రాని మొత్తాన్ని తీసుకున్న చిదంబరం, వేదాంతను ఎందుకు శిక్షిస్తాడు? మావోయిస్టుల ప్రాబల్యాన్ని తొలగించి ఛత్తీస్‌గడ్, జార్ఖండ్, బీహార్, ఒరిస్సాల్లోని అపారమైన ఖనిజ నిక్షేపాలను వేదాంతకు బహుమతిగా ఇవ్వడానికి గ్రీన్‌హంట్ మొదలుపెట్టాడు.

ఇంకా చిదంబరం సచ్ఛీలత గురించి మరొక ఉదాహరణ. ఫెయిర్ గ్రోత్ అనే ఆర్థిక సర్వీసుల కంపెనీలో చిదంబరానికి, ఆయన కుటుంబ సభ్యులకు వాటాలున్నాయి. సరళీకృత ఆర్థిక విధానాలు అమలై దేశంలోని చిన్న మదుపర్లలో ఆశలు రేకెత్తించి కార్పొరేట్లు, అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు లక్షల కోట్ల రూపాయలు మూటకట్టుకుంటున్న రోజులవి. నరసింహారావు ప్రధానమంత్రి. మన్మోహన్ ఆర్థిక మంత్రి. చిదంబరం వాణిజ్యశాఖ సహాయ మంత్రి. హర్షద్‌మెహతా స్టాక్‌మార్కెట్లను ముంచి వేలకోట్ల రూపాయలను తిన్నాడు. ఈ కుంభకోణంతో సంబంధం ఉన్న ఫెయిర్ గ్రోత్ అన్న సంస్థలో చిదంబరానికి, ఆయన కుటుంబానికి షేర్లుండేవి. ప్రభుత్వంలో కీలక స్థానంలో ఉన్న చిదంబరానికి కుంభకోణానికి సంబంధించిన ఉప్పు ముందే అందిందని, అనువైన సమయంలో షేర్లు అమ్మడంతో బాగా లాభపడ్డాడని పెద్ద పెట్టున ఆరోపణలొచ్చాయి. ఆ తర్వాత ఏదో పెద్ద నిజాయితీ పరుడిలాగా మంత్రి పదవికి రాజీనామా చేసాడు. ఆ సందర్భంలో ఆయన మీద ఆరోపణలు ఏ స్థాయిలో వచ్చాయంటే, ప్రధాని ఆ రాజీనామాను వెంటనే ఆమోదించాల్సి వచ్చింది. ఆ తర్వాత మూడేళ్లకే మళ్లీ ఆర్థికమంత్రి అయ్యాడు!

చిదంబరం ఊసరవెల్లి కంటే త్వరితంగా, నేర్పుతో రంగులు మార్చగలడు. కాంగ్రెస్‌లో ఉన్నా, తమిళ మానిలా కాంగ్రెస్‌లో ఉన్నా,

*(మిగతా 40వ పేజీలో...)*

*తరతరాలుగా తీవ్రమైన దోపిడీకి, పీడనకు, అణచివేతకు గురైన ప్రజలపై, ఆదివాసులపై ప్రభుత్వం చేపడుతున్న యుద్ధాన్ని వెంటనే నిలిపివేయాలని* **రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్** *డిమాండ్ చేస్తోంది*

# ఈ యుద్ధం ఎవరి కోసం?

అమెరికా మాజీ అధ్యక్షుడు జార్జ్ డబ్ల్యు బుష్ 11 సెప్టెంబర్ 2001 దాడి తర్వాత 'ఉగ్రవాదం పై యుద్ధం' పేరుతో ఇరాక్, అఫ్ఘానిస్తాన్‌ల పై దాడులకు పాల్పడ్డాడు. దాడుల వెనుక అసలు ఉద్దేశం అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు నెరవేర్చడమే. చమురు, సహజ వాయువులు, ప్రకృతి వనరులు కొల్లగొట్టడానికి ఉద్దేశించినదే అన్న విషయం మనకు తెలిసిందే. మన దేశ ప్రధాని మన్మోహన్ సింగ్ కూడా 26 నవంబర్ 2009న తీవ్రవాదం పై యుద్ధం ప్రకటించారు. పి. చిదంబరం కూడా అమెరికా ఆదేశాల మేరకు మిలిటరీ దాడికి పూనుకో బోతున్నట్లు ప్రకటించారు. ఈసారి చేపట్టబోతున్న యుద్ధం, 'ప్రజల పై యుద్ధం'. దేశంలోనే అత్యధికంగా దోపిడీకి, పీడనకు గురైన ప్రజల మీద ఈ యుద్ధాన్ని చేపట్టబోతున్నారు. ఈ యుద్ధం మన దేశ సహజ వనరులను, ఖనిజ వనరులను విదేశీ కంపెనీలు పెద్ద ఎత్తున కొల్లగొట్టడానికి, లూటీ చేయడానికి మార్గం సుగమం చేసే ఉద్దేశంతో వస్తున్నదే. బహిరంగంగా ప్రకటిస్తున్న లక్ష్యం మాత్రం 'మావోయిస్టు ప్రాబల్యం' కలిగిన ఈ ప్రాంతంలో భారత ప్రభుత్వ సార్వభౌమాధికారాన్ని పునఃప్రతిష్ఠించడానికని ప్రభుత్వం చెబుతోంది. ప్రజలపై ఈ యుద్ధ తీర్మానం వెనుక ఉన్న అసలు సూత్రధారి ప్రధాని మన్మోహన్ సింగ్. ఆయన క్రియాశీల రాజకీయాల్లోకి రాకముందు అమెరికన్ సామ్రాజ్య వాదుల కనుసన్నల్లో నడిచే ప్రపంచ బ్యాంక్‌లో ఆర్థికవేత్తగా పనిచేశారు.

యు.పి.ఎ. ప్రభుత్వంలో ఆర్థికమంత్రిగా పదవీబాధ్యతలు చేపట్టక ముందు పి. చిదంబరం గనుల తవ్వకాలు చేపట్టే బ్రిటిష్ కార్పొరేట్ కంపెనీ 'వేదాంత'లో బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్‌లో ఒకరిగా ఉన్నారు. అంతే కాకుండా చాలా చెడ్డపేరు తెచ్చుకున్న, అందరికీ తెలిసిన విద్యుత్ కార్పొరేషన్ కంపెనీ 'ఎన్‌రాన్'కు న్యాయవాదిగా కూడా ఉన్నారు. విదేశీ పెట్టుబడులను దేశంలోకి తేవడంలోనూ, అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని నిలబెట్టడంలోనూ మన్మోహన్‌సింగ్, పి.చిదంబరం ఇద్దరూ అతి ముఖ్యులు. 18 జూన్ 2006న పార్లమెంట్‌ను ఉద్దేశించి చేసిన ఒక ప్రకటనలో మన్మోహన్ సింగ్ 'దేశంలోని సంపన్న ఖనిజ వనరులున్న ప్రాంతాలలో వామపక్ష తీవ్రవాదం పెచ్చరిల్లడం, విస్తరించడం వలన విదేశీ పెట్టుబడులు రావడానికి కావలిసిన వాతావరణం దెబ్బ తింటోంద'ని పేర్కొన్నారు. ప్రజల పై ప్రకటించిన ఈ యుద్ధ ఫలాలను సామ్రాజ్యవాద దేశాలకు, ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదులకు అప్పగించడమే అసలు లక్ష్యం.

అమెరికన్ ప్రభుత్వం ఏ విధంగానైతే ఇరాక్‌ను దురాక్రమించ డానికి 1.5 లక్షల మంది సైనికులను, అఫ్ఘానిస్తాన్‌ను ఆక్రమించడానికి ఒక లక్ష మంది సైనికులను పంపిందో, అదే విధంగా మన ప్రభుత్వం లక్ష మంది బలగాలను దేశంలోని మధ్య, తూర్పు ప్రాంతాలకు తరలిస్తోంది. తేడా ఏమిటంటే, ఇక్కడ లక్ష్యంగా చేసుకొన్నది తన సొంత ప్రజలనే. వీటి వెనుక ఉన్న లక్ష్యాలు ఒకటే.

తన దేశంలోనే కొంత భూభాగానికి పరాయి నేలలాగా సైన్యాలను పంపి ప్రభుత్వం ఆక్రమణకు పాల్పడుతోంది. భారత సైన్యాలు, వాయు సైన్యంతో పాటు వేలాది మంది పోలీసులు, సిఆర్‌పిఎఫ్, ఐటిబిపి, ఐఆర్‌బి, స్పెషల్ టాస్క్‌ఫోర్స్, రాష్ట్రీయ రైఫిల్స్ మొదలయిన బలగాలను పూర్తిస్థాయి యుద్ధాన్ని చేపట్టడానికి పంపుతోంది. హోం శాఖ, రక్షణ శాఖల అత్యున్నతస్థాయి అధికారుల పర్యవేక్షణలో ఈ యుద్ధం చేపడుతోంది. ప్రజలను ఎదుర్కోవడానికి భారత సైన్యాధిపతుల ఆధ్వర్యం లో అటవీ యుద్ధ తంత్రాల్లో తర్ఫీదు కోసం ప్రభుత్వం ఛత్తీస్‌ఘడ్‌లో శిక్షణా కేంద్రాలను నడుపుతోంది. ప్రజలపై చేపడుతున్న ఈ దాడికి భారత సైన్యంలో సరిహద్దులు రక్షించడానికి వినియోగించే రాష్ట్రీయ రైఫిల్స్, ఐటిబిపి, బిఎస్‌ఎఫ్ వంటి దళాలను ప్రభుత్వం వినియోగిస్తోంది. యుద్ధం కోసం 'గరుడ్' వంటి ప్రత్యేక హెలికాప్టర్‌ల వినియోగానికి వాయుసేన అనుమతి కోరింది. ఈ యుద్ధం కోసం 7,300 కోట్ల రూపాయలకు పైగా ప్రజాధనాన్ని ప్రభుత్వం కేటాయిస్తోంది.

ప్రభుత్వం అమెరికన్ శాటిలైట్‌ల ద్వారా నిఘా సహకారాన్ని పొందడానికి రంగం సిద్ధం చేసుకుంది. హోంశాఖ కార్యదర్శి చెప్పిన 'సేనల సంయుక్త చర్యల ప్రయోగం' పేరుతో ఇటీవల లాల్‌ఘడ్‌లో కూడా బోర్‌పెలియా, కాంతాపహాడీ, రామ్‌ఘర్ పరిసర ప్రాంతాలను గుర్తించడానికి ప్రభుత్వం అమెరికన్ శాటిలైట్ సహకారాన్ని పొందింది. ఈ క్రమంలోనే హోం మంత్రి పి. చిదంబరం సెప్టెంబర్ 2009లో అమెరికాలో నాలుగు రోజులు పర్యటించారు. అక్కడి నుంచి తిరిగి రాగానే బస్తర్ ప్రాంత ఉత్తర, దక్షిణ, తూర్పు ప్రాంతాలలో 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' ప్రారంభించారు. ఈ ఆపరేషన్‌లో 19మంది ఆదివాసులను దారుణంగా హత్యచేశారు. గమనించాల్సిన అంశం ఏమిటంటే, అమెరికన్ భద్రతా వ్యవస్థకు చెందిన పలు బృందాలు ఛత్తీస్‌ఘడ్‌లో చేపడుతున్న యుద్ధ సన్నాహాలను రహస్యంగా వచ్చి సందర్శించాయి. వాయువ్య పాకిస్తాన్, అఫ్ఘానిస్తాన్‌లలో సామ్రాజ్యవాద యుద్ధానికి నాయకత్వం వహిస్తున్న మిలిటరీ అధికారులతో భారత ప్రభుత్వం నిత్యం సంప్రదింపులు జరుపుతోంది.

ప్రత్యేకించి 2001 తరువాత దేశంలోని అన్ని రాష్ట్రాలు విదేశీ పెట్టుబడిని, దళారీ బడా పారిశ్రామికవేత్తలను తమ తమ రాష్ట్రాలకు ఆహ్వానించడానికి విపరీతంగా పోటీ పడడమే కాదు, పెద్ద ఎత్తున సాగిల పడుతున్నాయి. వందలాది ఒప్పందాలపై, అవగాహనా పత్రాలపై సంతకాలు చేశాయి. ఒక్క జార్ఖండ్‌లోనే గత తొమ్మిదేళ్లలో వందకు పైగా ఇటువంటి అవగాహనా పత్రాలపై సంతకాలయ్యాయి. మైనింగ్ ప్రాజెక్టులు, స్టీల్, అల్యూమినియం కర్మాగారాలు, విద్యుచ్ఛక్తి కర్మాగారాలు, డ్యాంలు వంటి ప్రాజెక్టులు చేపట్టడానికి ఈ ఒప్పందాలు జరిగాయి. ఒప్పందాలు చేసుకున్న వాటిలో మిత్తల్, జిందాల్, టాటా, రియో టింటో, ఇంకా ఇతర విదేశీ సంస్థలు, భారత బడా పారిశ్రామికవేత్తలు ఉన్నారు.

ఒరిస్సాలో కూడా వెలికితీయని అపార ఖనిజ సంపదపై వేదాంత, పోస్కో, టాటా, హిండాల్‌కో, జిందాల్, మిత్తల్ వంటి కంపెనీలు కన్ను వేశాయి. మైనింగ్ రంగంలో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకై ఛత్తీస్‌ఘడ్‌లోని బిజెపి ప్రభుత్వం ఇప్పటికే టాటా, ఎస్సార్, రియో టింటో ఇంకా అలాంటి పెద్ద కార్పొరేట్ సంస్థలతో ఒప్పంద పత్రాలపై సంతకాలు చేసింది. సెప్టెంబర్ 2009 నాటికే జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా కేవలం ఈ మూడు రాష్ట్రాల్లోనే రు.8,73,896 కోట్ల విలువ చేసే ప్రాజెక్టుల పెట్టుబడులకు ఒప్పందాలు జరిగిపోయాయి. భూములు, అడవులు, నీళ్లపై ఆధారపడి బతికే రైతాంగం, ముఖ్యంగా ఆదివాసులు ఈ కార్పొరేట్ దోపిడీకి తమ వనరులు ఇవ్వడానికి తిరస్కరించారు. తమంతట తామే ఈ భారీ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా, ఐక్యంగా ఎదురు తిరిగారు. దోపిడీ పాలకవర్గాలకు వ్యతిరేకంగా పీడిత ప్రజల విముక్తి కోసం విప్లవ లక్ష్యంతో పోరాడుతున్న మావోయిస్టులు కూడా ఈ ప్రజా వ్యతిరేక ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ప్రతిఘటనా పోరాటాలు చేపట్టారు. కార్పొరేట్ కంపెనీలతో చేసుకున్న అవగాహనా పత్రాలను, ఒప్పందాలను రద్దు చేసుకోవాలనే డిమాండ్‌తో పోరాటాలు నిర్మించారు.

ఒప్పందాలపై సంతకాలు చేసుకొని, అవగాహనా పత్రాలు రాసుకున్న వెంటనే ప్రభుత్వం ప్రజలపై భీకర దాడిని తీవ్రతరం చేసింది. రాజ్య ఉగ్రవాదానికి ఆదివాసులే లక్ష్యం అయిపోయారు. సల్వాజుడుం వంటి ప్రైవేట్ ముఠాల బలప్రయోగంతో వందలాది మంది ఆదివాసులు చనిపోయారు. స్త్రీలు మానభంగాలకు, కోలుకోలేని దెబ్బలకు గురయ్యారు. ఈ ముఠాలు వేలాది గృహాలను తగులబెట్టాయి. ఏడు వందలకు పైగా గ్రామాల ప్రజలు విస్థాపనకు గురయ్యారు. ఈ ముఠాలు పిల్లల తలకాయలను కూడా తెగ్గోసాయి. చనిపోయిన ఆదివాసుల శరీర భాగాలను కోసివేయడం, తాడుకు కట్టి వేలాడదీయడం వంటి పనులు చేశారు. రాజ్య నిర్బంధంలో భాగంగా స్త్రీలను మానభంగాలకు గురిచేయడం ఒక అణచివేత రూపంగా ఎంచుకున్నారు. మూడు లక్షలకు పైగా ఆదివాసులను గ్రామాల నుండి తరిమివేయడమే గాకుండా వారిలో యాభై వేల మందిని సల్వాజుడుం క్యాంపుల్లో నిర్బంధించారు. ఇటువంటి పోలీసు క్యాంపులకు ఆర్థిక సహకారాన్ని మొదటగా ఎస్సార్ కంపెనీ అందించింది. జార్ఖండ్ రాష్ట్రంలోని సింగ్‌భూం ప్రాంతంలో కూడా ప్రభుత్వం కార్పొరేట్ పెట్టుబడిదారులతో అధిక సంఖ్యలో ఒప్పందాలు రాసుకోవడమే కాకుండా, ప్రజల పై క్రూర నిర్బంధాన్ని అమలు చేస్తోంది. నాగరిక్ సురక్షా సమితి, త్రితీయ ప్రస్తుతి కమిటీ వంటి ప్రైవేట్ ముఠాలు ఇక్కడ పనిచేస్తున్నాయి. ఈ ముఠాలే బాలుమట్ ప్రాంతంలో అభిజిత్ గ్రూప్ ఆఫ్ కంపెనీస్ కు చెందిన పవర్ ప్లాంట్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలపై అణచివేతకు పాల్పడ్డాయి. ప్రజా పోరాటాలను అణచివేయడానికి ఒరిస్సాలో కూడా కార్పొరేట్ కంపెనీల కిరాయి రౌడీలను పోలిన 'శాంతిసేన'ను ఏర్పాటు చేశారు. తమ నేల కోసం, ప్రకృతి వనరుల కోసం, హక్కుల కోసం ప్రతిఘటిస్తున్న ప్రజలు పోలీసులు, ప్రైవేట్ సేనలు ఉమ్మడిగా చేపట్టిన దాడులను ఎదిరించి నిలబడ్డాయి.

నేల, అడవి, నీళ్లు, ఖనిజ వనరులపై తమదే హక్కని శాసనాల పేరుతోనో, సైన్యాల బలప్రయోగంతోనో ప్రజలను బేదఖల్ చేయాలనే ప్రయత్నానికి వ్యతిరేకంగా, భూస్వామ్య వలస శక్తులకు వ్యతిరేకంగా ఆదివాసుల పోరాటం అనాదిగా కొనసాగుతూనే ఉంది. బ్రిటిష్ వలస వాదులు ఏనాడైతే అటవీ చట్టం అమలు చేసి ఆదివాసుల హక్కులను అణచివేశారో ఆనాడే వాళ్ల మహత్తర తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. ఇప్పటి జార్ఖండ్ ప్రాంతంలో బిర్సా ముండా నాయకత్వంలో తిరుగుబాటు, బస్తర్ ప్రాంతంలో గుండధర్ నాయకత్వంలో భూంకాల్ విరోధ్ తిరుగుబాటు, ఒరిస్సాలో ఘుమేశ్వర్ తిరుగుబాటు ఇవన్నీ కూడా నేలపై, అడవిపై హక్కుల కోసం ఆదివాసులు చేసిన కొన్ని తిరుగుబాట్లు. నక్సల్బరీ పోరాటం కూడా పీడిత ప్రజలు భూస్వామ్యాన్ని తోసివేసి భూమిపై తమ హక్కుల కోసం చేసిన విప్లవ తిరుగుబాటే. ఈ దేశ చరిత్రను చూస్తే పీడిత ప్రజలు, అందునా ఆదివాసులు రాజీలేని, అలుపెరగని పోరాటాలు చేస్తునే ఉన్నారు.

ఇవ్వాల్టికీ విప్లవ స్ఫూర్తితో ప్రజలు అభివృద్ధి నిరోధక పాలకుల ఫాసిస్ట్ దాడులకు వ్యతిరేకంగా ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్‌లలో అటువంటి పోరాట వారసత్వాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ఇవ్వాళ్టి గ్రీన్‌హంట్ కావచ్చు, ఆపరేషన్ సిద్ధార్థ్, సల్వాజుడుం, హర్మద్ వాహిని, రణవీర్ సేన, సన్‌లైట్ సేన, సి-60, బ్లాక్ హండ్రెడ్స్, సేంద్ర, గ్రేహౌండ్స్, సిఆర్‌పిఎఫ్, కోబ్రాల వరకు పేర్లు ఏవైనా, వారు అమలు చేస్తున్న నిర్బంధానికి, అణచివేతకు వ్యతిరేకంగా పోరాడుతూనే ఉన్నారు. భూస్వామ్య, దళారీ, బడా బూర్జువా సామ్రాజ్యవాద శక్తులు ఉమ్మడిగా అమలు చేస్తున్న అణచివేతకు మళ్లీ ఒకసారి ధీటైన జవాబు ఇవ్వడానికి, ఎదుర్కోవడానికి నిలుచున్నారు.

మధ్య, తూర్పు భారత ప్రజలపై చేపడుతున్న ఈ యుద్ధాన్ని భారత ప్రభుత్వం వెంటనే నిలిపివేయాలి. బేషరతుగా సైన్యాలను ఈ ప్రాంతాల నుండి ఉపసంహరించాలి. ఇక్కడి ప్రకృతి వనరుల యథేచ్ఛ దోపిడీకి అనుమతిస్తూ బహుళజాతి సంస్థలతో, దేశంలోని బడా కార్పొరేషన్‌లతో చేసుకున్న అన్ని రకాల ఒప్పందాలను, అవగాహనా పత్రాలను రద్దు చేసుకోవాలి. ప్రాజెక్టుల కోసం బలవంతంగా ప్రజల నుంచి స్వాధీనం చేసుకున్న భూములను ప్రజలకు ఇచ్చేయాలి. ప్రజల నిజమైన హక్కులను గౌరవించాలి. లేకుంటే తమ న్యాయమైన హక్కుల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న ఈ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజలు పెద్ద ఎత్తున పోరాడుతారు. తమ వనరులపై అధికారం కోసం జీవితం, బతుకుదెరువు, నిజమైన సార్వభౌమాధికారాల కోసం అంతిమ పోరుకు సిద్ధమవుతారు. భగత్‌సింగ్ తదితర వేలాది మంది విప్లవకారులు కన్న కలలు నిజమయ్యే దాకా, నిజమైన ప్రజల ప్రజాస్వామ్య భారతం నెలకొనే దాకా ఈ పోరాటం ఆగదు.

*(తెలుగు సేత : **డి.వి. రామకృష్ణారావు**)*

*ప్రభుత్వం గతంలో చేపట్టిన అనేక పథకాలకు భిన్నంగా వచ్చిన ఉపాధి హామీ పథకం కూడా అమలులో, ఆచరణలో ఏ విధంగా నీరుగారిపోతోందో వివరిస్తున్నారు* **వి. హనుమంతరావు**

# ఉపాధి హామీ పథకం ఎవరికి?

ఎంత మంచి పథకమైనా దానిని ఎలా భ్రష్టు పట్టించవచ్చునో మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలును చూసి నేర్చుకోవచ్చు. చెప్పేది ఒకటి, చేసేదొకటి. ప్రకటనను ఆచరణను ఆమడ దూరాన ఉంచడం ఎలాగో మన ప్రభుత్వాలకు తెలిసినంతగా మరెవరికి తెలియదు. చట్టం అమలు పరచడానికి నియమ నిబంధనలను ఎంత పకడ్బందీగా రూపొందించినా, వాటి నుంచి ఎలా తప్పించుకోవచ్చునో మన ప్రభుత్వ యంత్రాంగం దగ్గరే పాఠాలు నేర్చుకోవచ్చు. అసలు చట్టం రూపొందించడంలోనే లొసుగులను ప్రవేశపెట్టడంతో ప్రభుత్వాధికారులదే అందె వేసిన చెయ్యి. అసలు విషయం ఏమిటంటే, ముందు గత కొద్ది నెలల్లో పత్రికల్లో శీర్షికలు చూడండి –

– వంద రోజుల పని వట్టిదే; పది శాతానికే పని; హామీలేని ఉపాధి; ఉపాధి హామీలో కోటి రూపాయల కుంభకోణం; ఉపాధి హామీ వట్టివేనా?; ఉపాధి హామీ – హుష్ కాకి; ఆదాయం లేకుండా 34 నెలలు; ఉపాధి హామీని భ్రష్టు పట్టించే పథకం; ఉపాధి పథకం – పంచాయితీలు; ఉపాధి పథకం కింద జీతాలు, హక్కులు; ఉపాధి పథకం ఆడిట్ – బిల్లా రా చూపిన మార్గం; ఉపాధి పథకం – సామాజిక రాజకీయ ఫలితాలు; ఉపాధి పథకం – నవీకరణ; ఎన్.ఆర్.ఇ.జి.ఇ. ప్రయోజనం అపారం, అయినా అలక్ష్యం;

ఈ హెడ్డింగులు చదివితేనే ఇది నూరు రోజుల ఉపాధి హామీ గురించిన విషయం అని చెప్పకనే చెబుతుంది. ఈ పథకమే కాదు, ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఫలానా పథకం ఫలితాలు ఉద్దేశించిన వారికి పూర్తిగా అందాయని, వారి సమస్యలు తొలిగాయని, వారి పేదరికం తొలిగిపోయిందని చెప్పడం కష్టం.

ఒక పత్రిక చెప్పినట్లు ఈ పథకం ప్రయోజనం అపారం, లక్ష్యాలు అమోఘం. ఉపాధి కల్పన, ఉత్పత్తికి తోడ్పడే నిలిచే అభివృద్ధి చిట్టా తిరగేస్తే ఇలాంటి పథకాలు కోకొల్లలు. వాటి వైఫల్యాలు కోకొల్లలు. ఇందిరాగాంధీ హయాంలో 15 సూత్రాల పథకం, గరీబీ హఠావో అంటూ పిలుపిచ్చింది. 35 సంవత్సరాల తర్వాత చూస్తే గరీబులను లేపేయడమే జరుగుతోంది. వై.ఎస్.ఆర్. ప్రకటించిన పలు పథకాల ఫలితాలు పూర్తిగా ప్రజలకు అంది ఉంటే శాసనసభలో 150 సీట్లే కాదు, ఆయన కలగన్నట్లు 230 సీట్లు వచ్చి ఉండేవి కదా.

ఈ పథకం ప్రధాన లక్ష్యాలు రెండు – 1) ఉపాధి కల్పన; 2) నిలిచే ఉత్పాదనకు తోడ్పడే ఆస్తుల కల్పన. ఈ పథకం గురించి పత్రికల్లో వస్తున్న వార్తల్లో ఏ ఒక్క వార్తయినా ఫలానా ఆస్తులు సృష్టించబడ్డాయని చదివారా? చదివి ఉండరు. ఎందుచేతనంటే నోట్లో నాలుక లేని నిరుపేదలను ఎలా మోసం చేసి వందలు వేల రూపాయలు నొక్కేద్దామా అనే ధ్యాసే గాని ఆ స్థాయిలో అధికారులకు మరో ఆలోచనకు తీరికేది? సమాచార హక్కు చట్టం కింద ఒక సమాచారం కోరగా, వచ్చిన జవాబు ప్రకారం రోజు కూలీ 80 రూపాయల నుంచి 100 రూపాయలకు పెంచడం గురించి 'ఆర్థిక మంత్రిత్వ శాఖ నూరు రూపాయలకు పెంచాలని కమిటీ అయితే కాని నూరు రూపాయలు ఇస్తానని' చెప్పలేదని, అలాగే ప్రధానమంత్రి కార్యాలయం ప్రతినిధి ఒకరు మాట్లాడుతూ 'కూలీ పెంచాలని కేంద్ర ప్రభుత్వం విల్ (డబ్ల్యుఐఎల్ఎల్) మాత్రమే ఆర్థికమంత్రి ప్రకటన ఉద్దేశం' అని, 'పార్లమెంట్‌లో నూరు రూపాయలకు పెంచుతామని ప్రకటన ఆచరణలో రాష్ట్రాలు కోరితే పరిశీలిస్తాం' అనే స్థాయికి దిగజారడం ప్రభుత్వ చిత్తశుద్ధిని ప్రశ్నార్థకం చేస్తుంది.

ఆర్థిక మంత్రిత్వశాఖలో ఖర్చుల విభాగం ప్రతినిధి 'కూలీ పెంపుదల విషయంలో ఆర్థిక, న్యాయ సంబంధించిన విషయాలను పరిశీలించాల'ని అన్నారు. కాని కార్పొరేట్లకు మూడు లక్షల కోట్ల మేరకు మినహాయింపులు, సబ్సిడీల పేర లాభం చేకూర్చడానికి ఆర్థిక, న్యాయ శాఖ సంబంధించిన విషయాలు అడ్డురావు. ఇదెవరి ప్రభుత్వం అనుకున్నారు?

ఈ పథకాల కింద చేసే పనులు ఎంత చేస్తే, పని చేస్తే ఎంత కూలీ రేటు ఇవ్వాలి అని ప్రభుత్వ నియమ నిబంధనలున్నాయి. గట్టి నేల తవ్వకం, లూజ్ సాయిల్ తవ్వకాల్లో రేట్లు రకరకాలుగా ఉంటాయి. కూలీ గట్టి నేల తవ్వడానికి ఎక్కువ శ్రమ, ఎక్కువ కాలం పని చేయాలని. పై నియమ నిబంధనల ప్రకారం అయితే గట్టి నేల తవ్వడానికి పడిన శ్రమకు సరైన హామీ దక్కదు. పని గంటలను కూడా మొదట ఏడు గంటలన్నారు. తర్వాత తొమ్మిదికి పెంచారు. 12 గంటల వరకూ పెంచవచ్చునన్నారు. చేసిన పని కొలతల విషయంలో 'లిబరల్'గా ఉండాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎన్నికల ముందు అధికారులకు సూచించిందంటే, ఈ కొలతలు కఠినంగా ఉన్నాయని ప్రభుత్వమే అంగీకరించినట్లయింది. పురుషులు, స్త్రీలు చేసే పని అని వివక్ష కూడా చోటు చేసుకొంది. చేసిన పనికి కూలీ చెల్లించడంలో విపరీత జాప్యం చేసిన సందర్భాలు చాలా ఉన్నాయి. ఇచ్చిన కూలీని బ్యాంకులో జమ చేస్తారు. కాని బ్యాంకింగ్ వ్యవస్థ పలుచనవుతున్న నేపథ్యం గుర్తులో

ఉంచుకుంటే కూలి డబ్బులు వసూలు చేసుకోవడానికి తిరగడంలో పని రోజులు తక్కువవుతాయి. ఉపాధి లేమిని అవకాశంగా తీసుకొని ప్రభుత్వం కూలీలను కట్టు బానిసల్లా చూస్తుందని, ఈ పథకం ఆచరణ తీరును పరిశీలించడానికి కేంద్రం ఏర్పాటు చేసిన దేశీ స్థాయిలో కమిటీ సభ్యుడైన ప్రొఫెసర్ జీన్ డ్రీజ్ ఇది ఉపాధి గ్యారంటీ పథకమా, వెట్టి చాకిరీనా? అని ప్రశ్నించాడంటే ఈ పథకం అమలు ఎంత హీనస్థితిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

ప్రభుత్వం అశేష అభివృద్ధి కార్యక్రమాలను అమలు పరుస్తోంది. డ్రైయినేజ్, వాననీరు కాపాడుకోవడం, నీటిపారుదల ప్రాజెక్టులు, వరద నివారణ, వాటర్ షెడ్ పథకాలు, కాల్వల తవ్వకం, అడవుల్లో పనులు లాంటివన్నీ కాంట్రాక్టర్లకు అప్పగించే కన్నా, ఆ పనుల్లో కూలీలను నియమించవచ్చు. ఏదో తాత్కాలికంగా ఉపాధి కల్పించాలని ఏవేవో పనులు చేయించే బదులు ఆస్తుల కల్పనకు తోడ్పడే పనులు చేయించడం సరైన పద్ధతి అవుతుంది.

మాంద్యం సంక్షోభాలనెదుర్కొనేందుకు కార్పొరేట్లకు ఉద్దీపన పథకాలు ప్రవేశపెట్టడం, అమలుపర్చడం, ఆర్థిక పరిస్థితులు పుంజుకొన్నా ఇంకా ఈ పథకాలను కనొసాగించాలని నిర్ణయించడంలో చూపుతున్న శ్రద్ధ నూరు రోజుల ఉపాధి పథకం అమలులో మృగ్యం. ఉదాహరణకు అర్జున్‌సేన్ కేంద్రానికి ఇచ్చిన నివేదికలో (రోజుకు సగటున అసంఘటిత కార్మికుల సంపాదన ఇరవై రూపాయలు మాత్రమేనని సంచలనాత్మక ప్రకటన చేసింది ఈయన కమిటీయే) ఈ పథకం కింద చత్తీస్‌ఘడ్‌లో ఒక శాతం, బీహార్‌లో రెండు శాతం, యుపి లో నాలుగు శాతం, జార్ఖండ్‌లో తొమ్మిది శాతం, మధ్యప్రదేశ్‌లో 19 శాతం మాత్రమే 2008లో నూరు రూపాయల పథకం కింద లబ్ది పొందారని, ఆరు ఉత్తరాది రాష్ట్రాలలో జరిపిన అధ్యయనంలో తేలిందని చెప్పారు. ఉపాధి పథకం అమలులోకి వచ్చి నాలుగేళ్లు దాటినా కేంద్రం తగిన నియమ నిబంధనలను రూపొందించి పార్లమెంట్ ఆమోదం పొందకపోవడం, సీనియర్ అధికారులు వారి వారి శాఖలో పనుల్లో మునిగి ఉండి ఈ పథకం అమలుకు శ్రద్ధ చూపించకపోవడం జరుగుతుందని, ఈ పథకం సవ్యంగా అమలు పరచాలంటే ఇపుడున్న పాలనా వ్యవస్థ స్థానే ఒక ప్రత్యేక బోర్డును ఏర్పాటు చేయాలనే సలహా సముచితంగా ఉంది.

ఇటువంటి అనుత్సాహకర నేపథ్యంలో రాజస్థాన్‌లోని భిల్వారా ఒక ప్రోత్సాహకర ఉదంతంగా నిలిచింది. దానికి ప్రధాన కారణం ప్రజా ప్రతినిధులు, ప్రభుత్వాధికారులు కలిసి పనిచేయడం. సామాజిక సేవకులు, రైతు ప్రతినిధులు, ఉపాధ్యాయులు, కార్మికులు అంతా అరుణ్ రాయ్ లాంటివారితో కలిసి ఈ పథకం పని తీరును అధ్యయనం చేశారు. వీరంతా 125 గ్రూపులుగా ఏర్పడి కాలి నడకన 375 పంచాయితీ గ్రామాలను సందర్శించి ఈ పనికి సంబంధించిన ఫైల్సు, ఎకౌంట్లు, రసీదులు వగైరా తనిఖీ చేసారు. కార్మికుల నుంచి అనేక ఫిర్యాదులందుకొన్నారు. చెల్లింపులు చేయాల్సిన పోస్టాఫీసులు చెల్లించకుండా నిలుపుదల చేస్తున్న సందర్భాలు, ఈ నిధులను మింగేసిన సర్పంచ్‌లు అందరినీ ప్రశ్నించారు. ఈ విచారణలో ఒక నయా పైసా తీసుకోలేదు. సందర్శించిన గ్రామాల్లోని ప్రజల ఇళ్లలో భోంచేశారు. వారిచ్చిన నినాదాలు చూడండి. 'నాకు వెండి బంగారాలక్కర్లేదు. కారూ వద్దు, బంగళాలూ వద్దు. లిమ్కా, పెప్సీకోలా అసలే వద్దు. నాకు కావాలిసింది గింజలు, చదువు, విద్య, ఖర్చు చేసామంటున్న సొమ్ముకు రసీదుల ఫొటో కాపీలు.' విశేషమేమంటే ఆ జిల్లా కలెక్టర్ ఈ పథకం ఉన్నతాధికారి నిరారుగా నిలబడి, నిర్భీతితో పథకాన్ని అమలు పరచడం. ఇంకా విశేషమేమంటే ఆ రాష్ట్ర పంచాయితీరాజ్ మంత్రి ప్రజా వేదికలో అయిదు గంటల సేపు కూర్చొని ఫిర్యాదులు వినడం, భిల్వారా పార్లమెంటరీ నియోజక వర్గం నుంచి ఎన్నికైన గ్రామీణ శాఖాభివృద్ధి శాఖ మంత్రి కూర్చొని సోషల్ ఆడిట్ మీద జరిగిన చర్చలో పాల్గొనడం. అయితే, రూపాయకు బొమ్మ బొరుసూ ఉన్నట్లే ఇంతవరకు మీరు చదివిన దంతా బొమ్మ; బొరుసు కథ వినండి. సోషల్ ఆడిట్‌కు వెళ్లినవారిని ఝలావర్ గ్రామాధికారులు చితగ్గొట్టారు. పంచాయితీ అధికారుల నుంచి రికార్డులను బలవంతంగా లాక్కోవాల్సి వచ్చింది. పౌరవేదిక మీద గ్రామాధికారులు, ఆడిటర్ల మధ్య మాటల యుద్ధాలు జరిగాయి. పని చేసేవారికిచ్చే జాబ్‌కార్డులు వారి వద్ద లేవు. పంచాయితీ ఉద్యోగుల వద్ద ఉన్నాయి. ఆ కారణంగా, కార్మికులు వారికి రావాల్సిన కూలీని రాబట్టుకోలేకపోయారు. అధికారులు, దొంగ మస్టర్‌రోల్స్ సృష్టించారు. కార్మికులను నియమించకుండా యంత్రాలను పయోగించడం జరిగింది. ఇన్ని జరిగినా కూడా ప్రభుత్వోద్యోగులు సహకరించడం వల్ల ఈ వ్యవస్థ వేళ్లూనుకోవడం గమనించదగిన విజయం. ఢిల్లీ నుంచి వస్తున్న వార్తలు, ఆంగ్ల పత్రికల్లో వస్తున్న వ్యాసాలలో ఆంధ్రప్రదేశ్‌లో ఈ పథకం బాగా పని చేస్తుందని, సోషల్ ఆడిట్ విజయవంతంగా జరుగుతోందనే అభిప్రాయం కలుగుతోంది. వీ

**వచ్చే సంచికలలో...**

- ❖ ఫోకస్ - జనవరి 2010 : చదవవలసిన పుస్తకాలు
- ❖ ఫోకస్ - ఫిబ్రవరి 2010 : ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ఎవరి బొక్కసాలకు?
- ❖ తెలంగాణ - కాంగ్రెస్ మోసాల చరిత్ర - ఎం. రాఘవాచారి
- ❖ తిరోగమన దిశలో నేటి ప్రజా జీవనం - విద్యాభూషణ్
- ❖ అక్షరాన్నీ అమ్ముకుంటున్న మీడియా - మాడభూషి శ్రీధర్
- ❖ కడప జిల్లాకు వైఎస్ పేరు అనుచితం - ప్రజా సంఘాల పిటిషన్

*అభ్యంతరాలను పరిశీలించి, సందేహాలను నివృత్తి చేసి, అధికార వాణిజ్య వర్గాలకు సరైన శిక్షణ, అవగాహనలు కలిగిస్తే గాని పరోక్ష పన్నుల విధానం అమలు సజావుగా జరగదంటున్నారు* **తడకమళ్ల వివేక్**

# జి.ఎస్.టి. గమ్యం ఎంతో దూరం

ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న పరోక్ష పన్నుల విధానంపై 'మొదటి చర్చా పత్రాన్ని' నవంబర్ 10న రాష్ట్ర ఆర్థికమంత్రుల సాధికారక కమిటీ విడుదల చేయడం ద్వారా వాణిజ్య, పారిశ్రామిక వర్గాలో ఇంతకాలం ఉన్న ఉత్కంఠకు తెరదించినట్లైంది. దీన్ని 'మొదటి చర్చా పత్రం'గా పేర్కొనడం గమనించదగ్గ విషయం. మొదటిసారిగా గూడ్స్ అండ్ సర్వీస్ టాక్స్ (జి.ఎస్.టి.) ఏ విధంగా ఉండబోతుంది అనే అంశంపై సంబంధితవర్గాల వారికి, పౌరులకు కొంత సమాచారం అందుబాటులోకి రావడం అహ్వానించదగ్గ పరిణామం. అయితే ఈ పత్రంలోని అంశాలు కేవలం సాధికారిక కమిటీ చేసిన కసరత్తు ఫలితమేనని, దీనిని ప్రభుత్వ విధానంగా భావించకూడదని కేంద్ర ప్రభుత్వం మాటగా, కేంద్ర రెవెన్యూ కార్యదర్శి నవంబర్ 11న హైదరాబాద్‌లో ఫ్యాప్సి (ఎఫ్.ఎ.పి.సి.సి.ఐ.) సమావేశంలో అన్నారు. ఏది ఏమైనప్పటికి ఈ చర్చా పత్రాన్ని పరోక్ష పన్నుల విధానంలో రాబోతున్న కీలకమైన సంస్కరణలకు నాంది ప్రస్తావనగా పేర్కొనవచ్చును.

చర్చాపత్రంలోని అంశాలను పరిశీలించినట్లైతే జి.ఎస్.టి. విధానంలో వ్యాట్ సూత్రాలననుసరించి వస్తువులు, సేవలను ఒకే గొడుగు కిందికి తీసుకొచ్చే ప్రక్రియగా కనిపిస్తుంది. అయితే ప్రస్తుతం అమలులో ఉన్న కేంద్ర సెన్‌వ్యాట్ (సి.ఇ.ఎన్.వి.ఎ.టి.) విధానంలో మాత్రమే వ్యాట్ సూత్రాలకు అనుగుణంగా వస్తువులపై కాని సేవలపైకాని చెల్లించిన పన్నులకు మాత్రమే రిబేట్ వర్తించే విధానం అమలులో ఉంది. ఉదాహరణకు ఒక ఉత్పత్తిదారుడు వస్తువును ఉత్పత్తి చేస్తున్న క్రమంలో పన్ను చెల్లించిన సేవను ఉపయోగించినట్లైతే వస్తువుపై చెల్లించబోయే పన్నులోంచి సేవపై చెల్లించిన పన్నును రిబేట్‌గా పొందే అవకాశం ఉంది. కాని రాష్ట్రాలు అవలంబిస్తున్న వ్యాట్ విధానంలో ఈ రిబేట్ కేవలం వస్తువులపై చెల్లించిన పన్నుకే పరిమితం. ఇందుకు కారణం రాష్ట్రాలకు సేవలపై పన్ను విధించే అధికారం లేకపోవడమే. ఈ సమస్యను అధిగమించడానికి కొన్ని సేవలపై సేవా పన్నును విధించే అధికారాలు రాష్ట్రాలకు కల్పించవలసిన అవసరం ఈ పత్రంలో గుర్తించబడింది. ఇందుకోసం రాజ్యాంగ సవరణ అవసరమని కూడా చర్చా పత్రం గుర్తించింది. అయితే ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వాలు సేవలుగా భావింపబడే కొన్ని రంగాలపై పన్నులు విధిస్తున్నాయి. ఉదాహరణకు సినిమాలపై వినోదం పన్ను, హోటళ్లు, కార్పొరేట్ ఆసుపత్రులపై విలాసపన్ను విధిస్తున్నాయి. ఇవే కాకుండా కొన్ని ఇతర పన్నులు (ఉదాహరణకు గుర్రప్పందాలపై పన్ను) విధిస్తున్నాయి. జి.ఎస్.టి. విధానంలో ఇలాంటి వివిధరకాల పన్నులను విలీనం చేసి విస్తృతమైన పన్నుల విధానాన్ని ప్రవేశపెట్టబోతున్నట్టు తెలుస్తున్నది. వివిధ పన్నులను విలీనం చేయడానికి 'పన్ను మీద పన్ను భారం' తొలగించడం ముఖ్యమైన హేతువుగా ఆర్థిక నిపుణులు వివరణ ఇస్తున్నారు. అయితే చర్చా పత్రాల్లో 'కేంద్ర జి.ఎస్.టి', 'రాష్ట్ర జి.ఎస్.టి.' అనే ద్వంద్వ జి.ఎస్.టి. ఉంటుందని స్పష్టం చేశారు. ఇందుకు ప్రధాన కారణంగా కేంద్ర, రాష్ట్రాల మధ్య నెలకొని ఉన్న ఫెడరల్ సంబంధం అని పేర్కొంది. దీని కారణంగా కేంద్ర పరిధిలోకి వచ్చే సేవలు లేక ఉత్పత్తులపై విధింపబడిన పన్నులను పన్ను చెల్లింపుదారుడు రాష్ట్ర జి.ఎస్.టి. పైన కట్టే పన్నులోంచి మినహాయింపు కోరే అవకాశం లేదు. అదే విధంగా రాష్ట్ర జి.ఎస్.టి. పై కట్టే పన్నును, కేంద్ర జి.ఎస్.టి. లోంచి మినహాయించుకోవడానికి వీలు లేదు. ఈ కోణం నుంచి చూసినట్లైతే అతి ముఖ్యమైన 'పన్నుపై పన్ను భారం' తొలగింపు సమస్య పూర్తిగా తొలగనట్టే. ఫెడరల్ రాజ్యాంగ విధానంలో ఇది సాధ్యం కానిపని. ఈ కారణంగా జి.ఎస్.టి.లో నిర్ణయించబోయే పన్ను రేటు అతి కీలకంగా మారబోతుంది. నిపుణులు వెలిబుచ్చుతున్న అభిప్రాయాలను క్రోడీకరించినట్లైతే ఈ రేటు పదహారు లేక పద్దెనిమిది శాతం ఉండే సూచనలు కనిపిస్తున్నాయి. అయితే ఈ రేటుని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చెరిసగంగా విధించడమే నూతన జి.ఎస్.టి. విధానమని ఊహించవచ్చు. అంటే ఒక పన్ను చెల్లింపు దారుడు ఒక వ్యాపార లావాదేవి నిర్వహించినపుడు కేంద్ర జి.ఎస్.టి., రాష్ట్ర జి.ఎస్.టి.లను వినియోగదారుడి నుంచి రాబట్టవలసి ఉంటుంది. ఈ విధానం రెండు వ్యాపార సంస్థల మధ్యన జరిగే వాణిజ్య లావాదేవీల విషయంలో ఆహ్వానించదగినదైనప్పటికి వినియోగదారుడితో జరిపే లావాదేవీలపై కొంత ప్రతికూల ప్రభావాన్ని చూపే అవకాశం ఉంది. ఇందుకు ప్రధానంగా వినియోగదారుల ప్రతిస్పందన, పన్నులు చెల్లించే దృక్పథం కారణాలుగా చెప్పుకోవచ్చు.

వినియోగదారులు పదహారు లేక పద్దెనిమిది శాతం పన్నును భరింపరాని భారంగా భావించే అవకాశం ఉంది. అందువల్ల లావాదేవీలకు బిల్లులు ఇచ్చే సంఖ్య తగ్గిపోవడం, ఆ విధంగా అమ్మకాలు, సేవల విలువలను తగ్గించి చూపడం జరుగవచ్చు. ప్రస్తుతం అమలులో ఉన్న వ్యాట్ విధానంలో కూడా ఈ ధోరణి కనపడుతున్నది. జి.ఎస్.టి. కూడా వ్యాట్ సూత్రాలకనుగుణంగా విధించే పన్ను కాబట్టి ఈ ధోరణిని ఆ విధానంలో కూడా వ్యాపార వర్గాలు అవలంబించే అవకాశం ఉంది.

ఇప్పటి వరకు అందుబాటులో ఉన్న సమాచారం ప్రకారం

వస్తువులను నాలుగు జాబితాలుగా విభజించి, ఒక వస్తువుపై అన్ని రాష్ట్రాల్లో ఒకే పన్ను రేటును విధించబోతున్నట్టు తెలుస్తోంది. అదే విధంగా పన్ను మినహాయింపు జాబితాలో ఉండే వస్తువులు కూడా అన్ని రాష్ట్రాల అంగీకారంతో రూపొందించబడుతుందని తెలుస్తోంది. ఆహార ధాన్యాలు తక్కువ రేటు జాబితాలో ఉండే అవకాశం ఉంది. బంగారం, వెండిపై అతి తక్కువ ప్రత్యేక పన్ను ఉండబోతుంది. ఇంధనాలు (పెట్రోల్, డీజిల్ మొదలైనవి), మత్తుపానీయాలు జి.ఎస్.టి. పరిధి బైట ఉంటాయని చర్చా పత్రంలో పేర్కొనబడింది. అంటే ఈ వస్తువులను అమ్మకం లేక సేవలో ఏదైన రూపంలో వినియోగించినట్లైతే వ్యాట్ సూత్రం ప్రకారంగా పన్ను చెల్లింపుదారుడు రిబేట్ పొందే అవకాశం లేదు. ఈ కారణంగా వాణిజ్యవర్గాలు ఈ విధానంపై అభ్యంతరాలు వ్యక్తం చేస్తున్నాయి. ఇంధనాలను రవాణా సంబంధిత సేవలో వినియోగిస్తూ సేవా పన్నును చెల్లిస్తున్నందువల్ల జి.ఎస్.టి. పరిధిలోకి తీసుకురాకపోవడం అభ్యంతరానికి ముఖ్య కారణంగా కనబడుతున్నది. నాచురల్ గ్యాస్ విషయంలో ఇంకా ఎలాంటి నిర్ణయం తీసుకోలేదని అధికార వర్గాలు అంటున్నాయి. అలాగే మత్తు పదార్థాలు కేవలం సేవించడానికే కాకుండా ఔషధ, సౌందర్య సాధనాల ఉత్పత్తిలో కూడా విరివిగా ఉపయోగిస్తునందువల్ల జి.ఎస్.టి. పరిధిలోకి తీసుకు రావాలని ఒక వాదన బలంగా వినపడుతోంది. ఈ అంశంపై సాధికారిక కమిటీ దృష్టిసారించినట్టు అధికారవర్గాల ద్వారా తెలుస్తోంది.

ఈ చర్చా పత్రంలో అంతర్ రాష్ట్ర లావాదేవీలపై అవలంబించే పన్ను విధానంలో ఒక నూతన పోకడ ప్రస్ఫుటంగా కనబడుతోంది. ప్రస్తుతం ఉన్న సెంట్రల్ సేల్స్ ట్యాక్స్ చట్టం (సి.ఎస్.టి.) ప్రకారం అమ్మకపు ఒప్పందం ద్వారా సరకుల రవాణా ప్రారంభమయిన రాష్ట్రానికి పన్ను విధించే అధికారం ఉంది. ఈ సూత్రానికి భిన్నంగా జి.ఎస్.టి.లో వస్తువులు కాని, సేవలు కాని ఏ రాష్ట్రంలో వినియోగింపబడతాయో ఆ రాష్ట్రం మాత్రమే పన్ను విధించే అధికారాన్ని పొందుతుంది. అంటే 'ఆరిజిన్' సూత్రానికి భిన్నంగా 'డెస్టినేషన్' సూత్రం అమలులోకి వస్తుంది. ఈ సూత్రం పరోక్ష పన్నుల విధానంలో అతి మౌలికమైన, హేతుబద్ధమైన సూత్రం. పన్ను భారం వినియోగదారుడు మోయాలి అనేదే ఈ సూత్రం సారాంశం. సంస్కరణ దిశగా ఇది చాలా కీలకమైనదని భావించవచ్చు. అయితే ఈ విషయంలో రాష్ట్రాలు కొన్ని సందేహాలు వెలిబుచ్చినట్టు తెలుస్తోంది. ఇందుకు కారణం ఇప్పటి వరకు పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన రాష్ట్రాలు (ఉదాహరణకు తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాత్) ఆరిజిన్ సూత్రం ప్రకారంగా సి.ఎస్.టి. చట్టం కింద చెప్పుకోతగిన ఆదాయం పొందుతున్నాయి. రాబోయే డెస్టినేషన్ సూత్రం ప్రకారంగా వస్తువులు, సేవలు వినియోగింపబడే రాష్ట్రాలు మాత్రమే ఆదాయం పొందే అవకాశం ఉంది. ఇందుకు సమాధానంగా చర్చా పత్రంలో సి.ఎస్.టి. స్థానంలో ఐ.జి.ఎస్.టి. ప్రవేశ పెట్టబడుతుందని, దీని ప్రకారంగా ఎగుమతి చేస్తున్న రాష్ట్రానికి, దిగుమతి చేసుకున్న రాష్ట్రాలకు కేంద్ర ప్రభుత్వం స్థాపించబోయే వ్యవస్థ పన్ను చెల్లింపులోని వ్యత్యాసాన్ని భర్తీ చేస్తుందని పేర్కొన్నది. ఇందుకోసం ఆ కేంద్ర సంస్థ ఒక నిజాయితీ కలిగిన బ్రోకర్‌గా వ్యవహరిస్తుందని చర్చా పత్రం పేర్కొన్నది. దీనికి సంబంధించిన ప్రక్రియ వివరాలు చర్చా పత్రంలో స్థూలంగా ఉన్నాయి. ఈ విషయంపై ఉదహరణలతో కూడిన వివరణలు లభ్యమైతే తప్ప పన్ను చెల్లింపుదారులు కాని, పన్ను అధికారులు కాని అర్థం చేసుకొనే అవకాశం లేదు. చర్చా ప్రతాల్లో మాత్రం ఈ విధానానికి సంబంధించిన అనుకూల అంశాలను మాత్రమే క్లుప్తంగా పేర్కొని ముగించారు.

ఈ చర్చా పత్రంలో చిన్న వ్యాపార సంస్థలకు కొన్ని వెసులుబాట్లు కల్పిస్తున్నట్టు పేర్కొన్నారు. ప్రస్తుతం వ్యాట్ విధానంలో ఉన్న అయిదు లక్షల టర్నోవర్ పరిధిని 10 లక్షలకు పెంచుతున్నట్టు పేర్కొన్నారు. దీని ఫలితంగా 10 లక్షలలోపు టర్నోవర్ కలిగిన వ్యాపార సంస్థలు రిజిస్ట్రేషన్ చేసుకోనక్కరలేదు. పన్ను కూడా చెల్లించనవసరం లేదు. 50 లక్షల టర్నోవర్‌కు మించని వ్యాపార సంస్థలు కాంపోజిషన్ స్కీం ప్రకారంగా అర శాతం తగ్గకుండా పన్ను చెల్లించాల్సి ఉంటుంది. అయితే కేంద్ర జి.ఎస్.టి. విషయంలో ఈ సడలింపును 1.50 కోట్ల టర్నోవర్ కలిగిన వ్యాపార సంస్థలకు/ఉత్పత్తిదారులకు వర్తింప చేస్తున్నారు. దీని ఫలితంగా చిన్న, మధ్యతరగతి వ్యాపార సంస్థలకు/ఉత్పత్తిదారులకు పన్ను చెల్లింపుల నిర్వహణకయ్యే ఖర్చు, భారం తగ్గవచ్చు. కాని కేంద్ర జి.ఎస్.టి. పరిధి రిటేల్‌స్థాయి వరకు అమలులోకి వస్తున్న నేపథ్యంలో మినహాయింపు పరిధిలోని వ్యత్యాసం అమలుపరంగా కొంత గందరగోళానికి దారి తీసే అవకాశం ఉంది. కేంద్ర ప్రభుత్వ శాఖల ఆధిపత్యం రిటైల్ దశ వరకు విస్తరించడం రాష్ట్రాలకు రుచించడంలేదని తెలుస్తోంది. ఈ అంశంపై ఇంకా కొంత అధ్యయనం జరగవలసి ఉంది.

## ఎన్నో అవరోధాలు, సంశయాలు

దేశవ్యాప్తంగా పరోక్ష పన్ను విధానంలో రాబోయే సమూలమైన మార్పును ప్రజాస్వామిక పద్ధతిలో ప్రవేశపెట్టడం తప్పనిసరి. మొదటి చర్చా పత్రం జి.ఎస్.టి.లోని కొన్ని అంశాలని మాత్రమే ప్రస్తావించి ఎన్నో సంశయాలకు తెర లేపింది. ముఖ్యంగా పన్ను రేటు విషయం అందరి ఊహకే వదిలేసింది. ఈ నూతన విధానంలో కేంద్ర ప్రభుత్వం ఆధీనంలో పనిచేస్తున్న సెంట్రల్ ఎక్సైజ్, సర్వీసు ట్యాక్స్ శాఖ పరిధి రిటేల్ వ్యాపార సంస్థల వరకు కూడా వర్తిస్తుంది. అంటే రాబోయే కాలంలో కేవలం ఉత్పత్తిదారులే కాకుండా వాణిజ్య లావాదేవీలలోని వివిధ దశలలో లావాదేవీలు నిర్వహిస్తున్న సంస్థలు కేంద్ర, రాష్ట్ర పరోక్ష పన్నుల శాఖలకు జవాబుదారి కావలసి ఉంటుంది. ఆ కారణంగా పన్ను చెల్లింపు నిర్వహణ ఖర్చుల భారం పెరిగే అవకాశం ఉంది. ఈ సంస్కరణకు సంబంధించిన ప్రక్రియలన్నీ (ముసాయిదా చట్టం రూపకల్పన, అమలుకు సంబంధించిన రూల్స్, నియమ నిబంధనలు, ఫారంలు వగైరా) సాధికారిక కమిటీ, కేంద్ర ప్రభుత్వం అధీనంలోనే నడుస్తున్నాయి. ఈ ముసాయిదాలను రాష్ట్రాలకిచ్చి కేవలం అమలుకు సంబంధించిన కొన్ని చిన్న సవరణలతో ప్రవేశపెట్టే దిశగా ప్రయత్నాలు సాగుతున్నాయి. అందుకే రాష్ట్రాలలో సంబంధిత అధికారులకు గాని వాణిజ్య వర్గాలకు కాని రాబోయే నూతన విధానంపై త్వరగా అవగాహన ఏర్పడడానికి అవకాశం కలుగలేదు. రాబోయే రోజుల్లో కూడా వ్యాపార వాణిజ్య వర్గాలకు, రాష్ట్ర ప్రభుత్వం అధీనంలోని పన్నుల శాఖలకు అవగాహన కల్పించే బాధ్యత ఎక్కువగా కేంద్రప్రభుత్వ శాఖలకు ఉండబోతుంది. ఇదే కాకుండా జి.ఎస్.టి. విధానంలో వ్యాపార సంస్థల రిజిస్ట్రేషన్‌లు ఇన్‌కమ్‌ట్యాక్స్ శాఖచే జారీచేయబడిన పాన్‌కార్డ్ ఆధారంగా ఉంటుందని, కేంద్ర, రాష్ట్ర పరోక్ష పన్నుల శాఖల మధ్యన సమాచార మార్పిడి ఆధారంగా చట్టం అమలు, పన్ను ఎగవేత అరికట్టడం లాంటి

*మన రాష్ట్రంలో, దేశంలో అమలవుతున్న విధానాల కారణంగా తమ జీవితాలను, బతుకుదెరువును కోల్పోయి, నిర్వాసితులుగా మారుతున్న లక్షలాది మంది ప్రజల పరిస్థితిని వివరిస్తున్నారు* **పులుగుజ్జు సురేష్**

# పారిశ్రామిక బానిసత్వం రాబోతున్నదా?

అభివృద్ధి చేయడానికి రాజకీయాలలోకి వచ్చామని ప్రజా ప్రతినిధులందరూ పదే పదే చెబుతున్న మాట. అభివృద్ధి అంటే ఏమిటి? అభివృద్ధి ఎవరికోసం? జరుగుతున్న అభివృద్ధి ఏమిటి? అభివృద్ధి ప్రభావం ఎవరిపై పడుతున్నది? అనేది మనందరి ముందున్న ప్రశ్న. మనం 10వ పంచవర్ష ప్రణాళికలు పూర్తి చేసుకొని 11వ పంచవర్ష ప్రణాళిక చివరి అంకంలో ఉన్నాం. ఒక్కొక్క ప్రణాళికలో ఒక్కో అంశానికి ప్రభుత్వం ప్రాధాన్యత ఇచ్చింది. అయితే అరవై మూడేండ్లు నిండిన స్వతంత్ర భారతదేశంలో 'అభివృద్ధి'కొక కొత్త నిర్వచనం పుట్టుకొచ్చింది. 'అభివృద్ధి' అంటే విధ్వంసం, వినాశనం లేదా బహుళజాతి కంపెనీల ప్రయోజనంగా కనబడుతోంది. జరిగిన అభివృద్ధి ఎంతవరకు అని పరిశీలిస్తే అతిపెద్ద వ్యవసాయ దేశంలో దేశానికి వెన్నెముకైన రైతు, భూమిని తన తల్లి కంటే ఎక్కువగా 'భూమాత'గా ఆరాధించే రైతు, నీకు భూమి కావాలా ప్రాణం కావాలా అని అడిగితే, 'భూమే' కావాలి అనే రైతు – వ్యవసాయం అంటే విసుగుచెంది, ఈ భూమిని నమ్ముకుంటే నేను బతకలేను, ఏ కంపెనీ దగ్గర సెక్యూరిటీ గార్డుగానో, వాచ్‌మెన్‌గానో కాపలా ఉంటే గడచిపోతుంది. రెండు వేలో, మూడు వేలో ఒకటవ తేదీకల్లా జీతం వస్తుందనే స్థితికి మన అభివృద్ధి దిగజారింది. ఇంకొక అడుగు ముందుకేసి ఎనిమిది గంటల పనికోసం చేసిన పోరాటంలో రక్తం చిందించి, జైలు జీవితం గడిపి, ప్రాణాలర్పించి సాధించుకున్న 'కార్మికుల సంక్షేమ' హక్కులు, బహుళజాతి కంపెనీలకు పణంగా పెట్టి కంపెనీల్లో బానిసలుగా మార్చే స్థితికి మన అభివృద్ధి సంకేతాలు స్పష్టంగా కనబరుస్తున్నాయి.

ఇంకొంచెం నిశితంగా పరిశీలిస్తే మన సంస్కృతి పాశ్చాత్య సంస్కృతిగా మార్చుతుంటే, ఎవరయితే దేశాన్ని కొల్లగొట్టుకు పోతున్నారని, జాతియావత్తూ పోరాడి భారత గడ్డ నుండి వెళ్లగొట్టామో అదే గడ్డపైకి ఉపాధి కల్పన పేరుతోటి, ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) రూపంలో, స్వతంత్ర భారతదేశంలో పరాయి పాలకుల పెత్తనం ప్రారంభమై మరింత వేగంతో విస్తరించబోతోంది.

సంపద ఉన్న చోటల్లా బహుళజాతి కంపెనీల గద్దలు వాలి పోతున్నాయి. ప్రజలు తమ భూముల కోసం ఉద్యమిస్తే సైనిక చర్యలకు కూడా వెనుకాడకుండా, రక్తపుటేరులు పారించడానికి ప్రభుత్వాలు ఏవైనా సరే వెనుకాడడం లేదు. ఆంధ్రప్రదేశ్‌లోని గంగవరం, పశ్చిమ బెంగాల్ లోని నందిగ్రాం, సింగూరులు ఇందుకు నిలువెత్తు సాక్ష్యాలు.

రాష్ట్రంలో పెద్ద ఎత్తున జరుగుతున్న ఈ విధ్వంసం అభివృద్ధి, ఉపాధి పేరుతో జరుగుతుండడం వలన ప్రజల నుండి, బాధితుల నుండి ప్రతిఘటన రాకుండా ప్రభుత్వం జాగ్రత్త పడుతోంది. అరవై సంవత్సరాల పాలనలో ఇప్పటివరకు ఆరు కోట్ల మంది నిర్వాసితులు కాగా, ఇటువంటి అభివృద్ధి విధానాల వలన రాబోయే ఇరవై సంవత్సరాలలో దేశంలో 20 నుండి 40 కోట్ల మంది నిర్వాసితులవుతారని అంచనా. ఈ విషయాన్ని అన్ని వర్గాలవారు ఏకాభిప్రాయంతో అంగీకరిస్తున్నారు. మన రాష్ట్రంలో ఉన్న సంపదపైన బహుళజాతి కంపెనీల పాగ పడింది. ఈ కంపెనీల ప్రయోజనాల కోసం ప్రభుత్వాలు కొత్త కొత్త విధానాలు తీసుకొస్తూ, అవసరమైనప్పుడల్లా ఒక ఉత్తర్వు జారీ చేస్తున్నాయి. ఎక్కడబడితే అక్కడ భూ సేకరణ జరుగుతోంది. భూ సేకరణ విషయంలో

---

చర్యలు ఉంటాయని తెలుస్తోంది. ఇందుకోసం కేంద్ర ప్రభుత్వమే అందరికి ఉపయోగబడే కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ కూడా అందించుతున్నట్లు ప్రకటించింది. జి.ఎస్.టి.ని ఏప్రిల్ లేదా జూన్ 2010లో ప్రవేశ పెడుతున్నట్టు కేంద్ర ఆర్థిక మంత్రి అదే పనిగా ప్రకటిస్తున్నారు. అయితే ఒక కొత్త పన్నుల విధానాన్ని ప్రవేశ పెట్టడంలో సవాళ్లను ఇంత తక్కువ వ్యవధిలో అధిగమించడం అనుమానాస్పదం. అన్నిటికంటే ముందుగా కొన్ని రాష్ట్రాలు జి.ఎస్.టి. ప్రవేశపెట్టిన సందర్భంలో ఏర్పడిన రెవెన్యూ లోటు భర్తీ విషయంలో స్పష్టమైన హామీలు కోరుతున్నట్లు తెలుస్తోంది. ఈ అంశాన్ని 13వ ఆర్థిక సంఘానికి కేంద్ర ప్రభుత్వం నివేదించవలసి ఉంటుంది. రాష్ట్రాలకు సేవలపై పన్ను వేసే అధికారం రాజ్యాంగ సవరణ ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. ఇందుకు తగిన చర్యలు చేపట్టి ఏప్రిల్ 2010 లోపల పూర్తి చేయవలసి ఉంటుంది. అన్నిటికంటే మించి వాణిజ్య వర్గాలతో ప్రజాస్వామిక పద్ధతిలో అభిప్రాయసేకరణ జరుపవలసి ఉంది. అంతే కాకుండా అధికార, వాణిజ్య వర్గాలకు శిక్షణ, అవగాహన కార్యక్రమాలు చేపట్టవలసి ఉంటుంది. వీటన్నింటిని పరిగణనలోకి తీసుకుంటే జి.ఎస్.టి. ప్రవేశ పెట్టడానికి మిగిలిన సమయం అతితక్కువ అని చాలా స్పష్టంగా తెలుస్తోంది. రాష్ట్రంలో వ్యాట్ విధానాన్ని రూపొందించి, ప్రవేశ పెట్టడంలో రచయిత గడించిన అనుభవం దృష్ట్యా, జి.ఎస్.టి. కార్యరూపం దాల్చడానికి కేంద్రం నిర్ణయించుకున్న డెడ్‌లైన్ ప్రవాహానికి ఎదురీత లాంటిదనీ, అసాధ్యమనీ భావిస్తున్నారు. సంశయాలు నివృత్తి చేయకుండా అవగాహన కల్పించకుండా, నిర్ణయించిన తేదీకే జి.ఎస్.టి. ప్రవేశపెట్టితే ఆశించిన సత్ఫలితాలు రాకపోవచ్చు. అట్లా చేస్తే 'తాంబులాలిచ్చాను తన్నుకు చావండి' అన్నట్టు ఉంటుంది. వీ

ప్రభుత్వం చాలా ఉదారంగా ప్రవర్తిస్తోంది. బ్రిటిష్ పాలకులు తీసుకు వచ్చిన భూసేకరణ చట్టం 1894 ఇప్పటికీ అమలవుతోంది. ఆనాడు రోడ్లు, రైల్వే లైన్లు, విద్యుత్ స్తంభాలు, ప్రభుత్వ కార్యాలయాల ఏర్పాటును ప్రజా ప్రయోజనంగా భావించిన చట్టం అది. అదే చట్టాన్ని, అన్నిరకాల ప్రాజెక్టుల అమలుకు ఉపయోగించబడుతోంది. ఫలితంగా ప్రజలు జీవించే హక్కుకు, సంస్కృతి పరిరక్షణ హక్కుకు తీవ్రమైన ఇబ్బంది కలుగుతోంది. ఇటువంటి పద్ధతుల వలన అత్యధికంగా నష్టపోతున్నది ఆదివాసులు, దళితులు, రైతులు, సన్నకారు రైతులు, వ్యవసాయ కూలీలు, చిల్లర వ్యాపారులు అత్యధికం. ఏదైనా ప్రాజెక్టు నిర్మాణం చేసేటప్పుడు ఆ ప్రాజెక్టు కోసం అవసరమైన భూమిలో 75 శాతం కంపెనీ సేకరించుకుంటే మిగిలిన 25 శాతం ప్రభుత్వం సేకరించాలనే నిబంధన ఉంది. కాగా ప్రభుత్వమే పూర్తి బాధ్యత తమ భుజాలపై వేసుకుంటోంది. భూసేకరణ సమయంలో గ్రామాలలోని రైతులను భయభ్రాంతులకు గురిచేస్తోంది. వారిలో ఆందోళన కలిగేలా చేస్తోంది. సర్వేల మీద సర్వేలు చేస్తోంది. ప్రత్యేక కలెక్టరు ఆధ్వర్యంలో భూసేకరణ జరుగుతోంది. దళితులకిచ్చే భూములు ఫారం - డి పట్టాలు కావడం వలన వారి భూములకు రక్షణ ఉండడం లేదు. ఆ భూములన్నీ ప్రభుత్వం వారికి అవసరమైనపుడు ఎప్పుడైనా తీసుకునే అధికారం ఉంది. కాబట్టి ప్రభుత్వం ఇచ్చే తులమో, ఫలమో తీసుకొని ఊరు విడిచి పొమ్మని చెబుతారు. ప్రాజెక్టు నిర్మాణంలో నష్టపోతున్న వారందరికీ ఉపాధి కల్పిస్తామని చెబుతున్నారు.

గ్రామాలలో ఉండేది పామరులు, నిరక్షరాస్యులు కాబట్టి ఈ కంపెనీలలో స్థానికులకు అర్హత ఉండదని అనుభవం నేర్పిన పాఠం. హైదరాబాద్ నగరానికి సమీపాన శంషాబాద్ దగ్గర ఐదు వేల ఎకరాలలో ఏర్పాటు చేసిన రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయం వలన పదకొండు గ్రామాల ప్రజలు నిర్వాసితులయ్యారు. నిర్వాసితులైన వారిలో కొందరికి సెక్యూరిటీ గార్డు, చెత్త ఊడ్చే పనులు, నిర్మాణంలో కూలీ పనులు వంటివి లభించాయి. కాని బి.టెక్ పూర్తి చేసిన వారికి కూడా ఉద్యోగాలు లభించలేదు అనేది సత్యం. శంషాబాద్ ప్రాంతంలో గులాబీలు, ద్రాక్షపండ్లు, కూరగాయలు విపరీతంగా పండేవి. ఇవన్నీ హైదరాబాద్‌కి వచ్చేవి. హైదరాబాద్‌లో కూరగాయల ధరల పెరుగుదలకు ఇటువంటి ప్రాజెక్టులు ఒక ప్రధాన కారణం. హైదరాబాద్ నగరం చుట్టూ రంగారెడ్డి, నల్గొండ, మెదక్ జిల్లాల భూములు దాదాపు ఏదో ఒక కంపెనీ వశమయ్యాయి. నగరానికి సుమారు 60-80 కిలోమీటర్ల పరిధిలో వ్యవసాయం పూర్తిగా నాశనమయ్యింది. ఇటువంటి పరిస్థితే నెల్లూరు జిల్లాలోని కృష్ణపట్నం ఓడరేవుల్లో జరుగుతోంది. అక్కడ స్థానికులు చేసే మట్టి పనులు, రోజువారి కూలీ పనులు, డ్రైవర్లు వంటి వాటికి మించడంలేదు.

ఇదిలా ఉండగా ప్రత్యేక ఆర్థిక మండలాలు పారిశ్రామిక బానిసత్వాన్ని ప్రేరేపించబోతున్నాయి. అధిక గంటల పని చేయలేక పోరాడి సాధించుకున్న చికాగో మృతవీరుల త్యాగఫలాన్ని సెజ్‌లు అవమానపరుస్తున్నాయి. పెట్టుబడిదారులను ఆకర్షించడం కోసం కార్మికులకు ఎటువంటి నష్టం వాటిల్లినా, ప్రమాదకర వాతావరణం ఏర్పడినా పట్టించుకోవడం లేదు. సెజ్‌ల కోసం కార్మిక హక్కులను కాలరాయడానికి కూడా వెనుకాడడం లేదు. ఆ మార్గంలోనే వచ్చిన జి.ఒ.ఎం.ఎస్. నెం. 151, 2002లో వెలువడింది. ఈ జి.ఒ. ప్రకారం అనేక మినహాయింపులు కంపెనీలకు వచ్చాయి. కార్మికుల ఆరోగ్యం, భద్రత పరిరక్షణ ఫ్యాక్టరీ చట్టం నుండి మినహాయించారు. సెజ్‌లోని హోటళ్లు, సూపర్ బజార్లు, మాల్స్ వంటివి సంవత్సరం పొడవునా రోజంతా విరామం లేకుండా పనిచేయవచ్చును. ఓవర్ టైం పనికి అదనపు భత్యం చెల్లించేలా ఉంటే బలవంతంగానైనా పని చేయించు కోవచ్చును. కార్మిక సంఘాలు ఏర్పాటు నిషేధిస్తూ పారిశ్రామిక విధానం - 2000లో ప్రకటించారు. కార్మికులు తమ న్యాయమైన డిమాండ్ల సాధన కోసం చేసే పోరాటాలు, ధర్నాలు, ఉద్యమాలు చేయరాదు. కార్మిక సంఘాలు ఏర్పాటు చేసుకోకూడదు. ఇటువంటివి అనేక ప్రజా వ్యతిరేక చర్యలను ప్రభుత్వ సహకారంతో అమలవుతున్నాయి. నేడు వచ్చిన ఆర్థిక సంక్షోభం సాఫ్ట్‌వేర్ నిపుణులను కంపెనీల నుండి వెళ్లగొడితే, తమకు జరిగిన అన్యాయాన్ని అడిగే హక్కు కూడా లేకపోయింది.

సెజ్‌లు, భారీ ప్రాజెక్టుల నిర్మాణాలు సంప్రదాయ జీవనోపాధులు, చేతి వృత్తులను, సంస్కృతిని దెబ్బతీస్తున్నాయి. తమిళనాడులో కంచికి సమీపంలో ఉన్న శ్రీ పెరంబదూర్ దగ్గర నోకియా, మోటొరోలా, సాంసంగ్ మొదలైన కంపెనీలు ఏర్పడ్డాయి. కంచిపట్టు చీర అంటే తెలియని వారుండరు. ఈ కంపెనీలు చేనేత కార్మికులను ఆకర్షించాయి. అదే విధంగా ఆంధ్ర, తమిళనాడు సరిహద్దు ప్రాంతమైన తడ దగ్గర ఏర్పడిన సెజ్ తమిళనాడులోని ఆరని చేనేత పరిశ్రమను ప్రశ్నార్థకం చేసింది. కోస్టల్ కారిడార్‌ల పేరుతో అనేక చోట్ల భూ సేకరణ జరుగుతోంది. ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో ఓడరేవు నుంచి నిజాంపట్నం మధ్య అధికారికంగా 28 వేల ఎకరాల భూసేకరణ జరిగింది. వాన్‌పిక్ కంపెనీ వారు 800 మందికి శిక్షణ ఇచ్చి, ఉపాధి బూచి చూపిస్తోంది. ఈ ప్రాంతంలో లక్షలాది మంది మత్స్యకారులు, చేనేత కార్మికులు, ఇతర చేతి వృత్తిదారులు ఉన్నారు. వీరందరి బతుకులకు ఎసరు పెట్టింది. పోలేపల్లి సెజ్ గ్రీన్ ఇండస్ట్రియల్ పార్కుగా మొదలైంది. అంటే సెజ్ నుండి వెదజల్లే అత్యంత ప్రమాదకరమైన వ్యర్థ పదార్థాలు గ్రీన్ ఇండస్ట్రియల్ పేరుతో దాచిపెట్టే ప్రయత్నం జరుగుతోంది. ఇకపోతే జాతీయ రహదారులకు ఇరువైపుల చింతచెట్లు ఉండేవి. రాష్ట్రానికి చింతపండుకు కొదువ లేకుండా ఉండేది. జాతీయ రహదారుల నిర్మాణంలో చింతచెట్లన్నీ నరికివేయడం వలన చింతపండు కరవయింది. మలేషియా చింతపండును దిగుమతి చేసుకోవలసి వస్తోంది.

భూమిపై హక్కులు ప్రజలకు కావాలని ఒక పక్క పోరాటాలు జరుగుతుంటే, పరాయి దేశస్తులకు ఈ హక్కులు కట్టబెడుతున్నారు. కొత్తగా ఉపాధులు సృష్టించే మాట అటుంచి ఉన్న ఉపాధులు పోవడం ఖాయం. ఇప్పటికే వచ్చిన అనుభవాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. అంతకంటే ఎక్కువగా రాష్ట్రంలో విపరీతమైన కాలుష్యం, దాని ఫలితం పర్యావరణ వినాశనం జరుగుతోంది. మన భూమి సంపదల పైన పరాయి దేశస్తుల ఆధిపత్యం పెరుగుతోంది. సంస్కృతి, సంప్రదాయాలపై తీవ్రమైన ప్రభావం ఉంటోంది. అన్నిటికీ మించి యంగ్ ఇండియా కాస్తా నిరుద్యోగ ఇండియాగా మారిపోయే ప్రమాదం ఎంతో దూరంలో లేదు. అందుకనే భారత పౌరులందరు నాకెందుకులే అన్నట్టు కాకుండా అభివృద్ధి మాటున జరుగుతున్న విధ్వంసాన్ని ఎదుర్కోవడానికి సిద్ధపడాలి. వీ

ఒకవైపు జాతుల మధ్య వైరాలు, జాతుల స్వేచ్ఛాకాంక్ష, మరోవైపు సాయుధ బలగాల అణచివేతల మధ్య మండుతున్న మణిపూర్ స్థితిగతులను వివరిస్తున్నారు **సి. రాజశేఖర్**

# మణిపూర్‌లో ఏం జరుగుతోంది?

దేశంలోని దాదాపు అన్ని ప్రాంతాలలోనూ కొన్ని సంవత్సరాలుగా కాదు, దశాబ్దాలుగా సాయుధ బలగాలు మానవ హక్కుల ఉల్లంఘనకు పాల్పడుతూనే ఉన్నాయి. ప్రజల 'జీవించే హక్కు'ను సహితం కాలరాస్తున్నాయి. దీనికి 'ఎన్‌కౌంటర్లు' అన్న పేరు పెట్టి ఈ 'హత్యానేరా'ల నుంచి సాయుధ బలగాలను ప్రభుత్వం రక్షిస్తోంది. దీనికి మణిపూర్‌లో 23 జూలై 2009న జరిగిన 'బూటకపు ఎన్‌కౌంటర్' మరో సాక్ష్యం. ఆ రోజు మణిపూర్ రాజధాని ఇంఫాల్‌లోని రద్దీగా ఉన్న మార్కెట్‌లో పోలీసులు తనిఖీలు నిర్వహిస్తుండగా ఒక వ్యక్తి తప్పించుకు పారిపోయేందుకు పరుగులు తీశాడు. ఆ వ్యక్తిని గురిపెట్టి పోలీసులు కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో నలుగురు గాయపడగా, ఒక ఐదు నెలల గర్భిణీ స్త్రీ మరణించింది. మరణించినామెకు, గాయపడిన వారికి ఆ సంఘటనతో ఎటువంటి సంబంధమూ లేదు. ఈ సంఘటనకు బాధ్యుడుగా ఛోంగ్‌ఖాం సంజిత్ అనే యువకుడిని బలిపశువుని చేశారు.

సంఘటన జరిగిన సమయంలో సంజిత్ అక్కడికి దగ్గరలోని ఒక టెలిఫోన్ బూత్ దగ్గర ఉన్నాడు. అతన్ని సాయుధ బలగాలు నిమిషాల్లో చుట్టుముట్టాయి. మార్కెట్‌లోని రద్దీ ప్రాంతంలో, పోలీసులు సంజిత్‌ని పక్కనే ఉన్న మెడికల్ షాపులోకి ఈడ్చుకుపోయి, అతి సమీపం నుంచి తుపాకితో కాల్చి చంపారు. ఆ తరువాత అతని శరీరాన్ని ఈడ్చుకొచ్చి కాల్పుల్లో చనిపోయిన గర్భిణీ రబీనాదేవితో సహా ట్రక్కులో తీసుకుపోయారు.

ఈ సంఘటన జరిగినప్పుడు మణిపూర్ అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్నాయి. 'ఎన్‌కౌంటర్' వార్తను ముఖ్యమంత్రి ఓక్రం ఇబోబి సింగ్ 'వీర జవాను'ల గాథగా అసెంబ్లీలో సభ్యుల ముందు ఉంచారు. పోలీసులు తనిఖీ చేస్తున్నప్పుడు పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ (పిఎల్ఎ) సభ్యుడు తప్పించుకొనే ప్రయత్నంలో ఐదుగురు సామాన్యులపై తుపాకితో కాల్పులు జరిపాడనీ, అతన్ని కమాండోలు ధైర్యంగా ఎదుర్కొని ఎన్‌కౌంటర్‌లో చంపేశారని చెప్పారు. అతని వద్ద 9ఎంఎం పిస్టల్ లభ్యమైందని తెలిపారు. దీనికి ప్రతిపక్షాల నుంచి, ఇతర సభ్యుల నుంచి ఎటువంటి ప్రశ్నగానీ, ఆసక్తి గానీ వ్యక్తంకాలేదు. అందరూ తమ కార్యకలాపాల్లో మునిగిపోయారు.

మణిపూర్‌లో ఇది కొత్త కాదు. భయం గుప్పిట్లో ప్రజలు బతుకులు వెళ్లదీస్తున్నారు. ఈ సంవత్సరంలోనే 250 మందికి పైగా 'ఎన్‌కౌంటర్'లో మరణించారు. దీనిని ఎవ్వరూ ప్రశ్నించరు. ప్రజలకు ఇది మామూలైపోయింది.

ఈ సంఘటనను అక్కడే ఉన్న ఒక ఫొటోగ్రాఫర్ తన కెమెరాలో చిత్రించాడు. స్థానిక పత్రికలపై నమ్మకం లేక ఆ వ్యక్తి 'తెహెల్కా' మాగజైన్‌ను సంప్రదించాడు. ఈ ఉదంతాన్ని ఆ పత్రిక అచ్చువేయడంతో ఒక్కసారిగా మణిపూర్‌లోనే కాకుండా దేశమంతా, అంతర్జాతీయంగా ఈ వార్త సంచలనం సృష్టించింది.

ప్రజలు వీధుల్లోకి వచ్చి ఆందోళన చేశారు. దీనిపై న్యాయవిచారణ జరిపించాలనీ, ముఖ్యమంత్రి తక్షణమే రాజీనామా చేయాలనీ డిమాండ్ చేశారు. ఈ సందర్భంగా సాయుధ బలగాలకు, పౌరులకు ఘర్షణలు చోటు చేసుకున్నాయి. వయోబేధం లేకుండా ఆడా మగా అందరూ వీధుల్లోకి వచ్చి ఆందోళన చేశారు. సాయుధ బలగాలు ఈ ఆందోళనలను అతి క్రూరంగా అణచివేశాయి. ఎట్టకేలకు ఆగస్ట్ 5న ముఖ్యమంత్రి తన తప్పుని ఒప్పుకున్నారు. దీనిపై న్యాయ విచారణకు ఆదేశించారు.

సంజిత్ గతంలో పిఎల్ఎ సభ్యుడు. అతన్ని 2000లో పోలీసులు అరెస్ట్ చేసి తర్వాత విడిచిపెట్టారు. అతను 2006లోనే పిఎల్ఎ నుంచి ఆరోగ్య కారణాల రీత్యా బయటికి వచ్చి సాధారణ జీవితం గడుపుతున్నాడు. అతన్ని మళ్లీ 2007లో ఎన్ఎస్ఎ కింద అరెస్ట్ చేసి సంవత్సరం తర్వాత విడుదల చేశారు. అప్పటి నుంచి అతను కుటుంబంతో సహా తన స్వంత గ్రామంలో ఉంటూ, ఒక ప్రైవేట్ హాస్పిటల్‌లో అటెండర్‌గా పని చేస్తూ బతుకుతున్నాడు.

మణిపూర్‌లో 'జీవితం చాలా విలువలేనిది' అని సంజిత్ తల్లి వాపోయారు. చిన్నాన్న కోసం మందులు కొనడానికి వెళ్లిన తన కొడుకుని ఏ కారణం లేకుండా కాల్చి చంపారని ఆమె కన్నీళ్ల పర్యంతమయ్యారు. అతను పిఎల్ఎ తో సంబంధాలు తెగతెంపులు చేసుకున్నాడనీ, సాధారణమైన జీవితం గడుపుతున్నాడనీ ఆమె తెలిపారు.

మణిపూర్ భారతదేశానికి ఈశాన్య ప్రాంతంలో ఉంది. 1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక విలీనం కావడానికి ఇష్టపడలేదు. బ్రిటిష్ వాళ్లు వదిలి వెళ్లిన తర్వాత మణిపూర్ స్వతంత్ర రాజ్యాంగం ప్రకటించుకుని ఎన్నికలు నిర్వహించింది. రెండు సంవత్సరాల తర్వాత 1949లో మణిపూర్ మహారాజు భారతదేశంలో విలీనం కావడానికి అంగీకరించాడు. 1963లో కేంద్ర పాలిత ప్రాంతంగా, 1972లో రాష్ట్రంగా మణిపూర్ అవతరించింది.

రాష్ట్రంగా ఏర్పడకముందే 1964 నుంచి మణిపూర్‌లో

స్వాతంత్ర్యం కోసం యునైటెడ్ నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ (యుఎన్‌ఎల్‌ఎఫ్) ఉద్యమ సంస్థ ఏర్పడింది. 1970ల తర్వాత పిఎల్‌ఎ, పిఆర్‌ఇపిఎకె, కెసిపి, కెవైకెఎల్ వంటి సంస్థలు ఏర్పడ్డాయి.

అక్కడ జనాభా పరంగా అత్యధికంగా ఉన్న జాతి 'మీటి'ల చరిత్ర రెండువేల సంవత్సరాల పురాతనమైనది. మణిపూర్‌లో 57 శాతం పైగా మీటీలుగా పిలవబడే వైష్ణవ హిందువులు ఉన్నారు. ఇంకా నాగా, కుకి, మిజో, చిన్ జాతులవారు ఉన్నారు. నాగా, కుకిలలో అంతర్ జాతులు ఉన్నాయి. వీరు అత్యధికంగా క్రైస్తవులు. పంగాల్‌గా పిలవబడే ముస్లింలు జనాభాలో ఏడు శాతం ఉన్నారు. వీరు తౌబల్ ప్రాంతంలో నివసిస్తుంటారు. జనాభాలో అధికంగా ఉన్న మీటీలు తమను తాము అధికులుగా భావిస్తారు. తమ తమ జాతి ఆధిపత్యాల కోసం ప్రతి జాతి వేరు వేరు సంస్థలుగా ఏర్పడ్డాయి. మణిపూర్ రాష్ట్రం 25 లక్షల మంది జనాభాలో మొత్తంగా 40కి పైగా ఇలాంటి సంస్థలు ఉన్నాయి. ఇందులో కొన్ని కేంద్రంతో పోరాటం సాగిస్తుండగా, ఎక్కువగా అంతర్గత జాతి వైరాలు సాగుతున్నాయి. అభివృద్ధి పేరుతో కేంద్ర నిధులు రావడంతో, ఈ సంస్థలు తమ జాతి అభివృద్ధి కోసం కాకుండా, ఒకరిపై మరొకరి ఆధిపత్యం కోసం పోరాటాలు సాగిస్తున్నాయి.

ఈ జాతుల మధ్య వైరంతో మణిపూర్ ప్రజల కష్టాలు తీవ్రమయ్యాయి. కిడ్నాప్‌లు, బెదిరింపులు, మానభంగాలు, హత్యలు మొదలైన భయంకర పరిస్థితులు ఇక్కడ నెలకొని ఉన్నాయి. అటు భద్రతా దళాలు, ఇటు జాతుల మధ్య వైరాలతో ప్రజల జీవితాలు అతలాకుతలం అవుతున్నాయి. 1958లో ఆర్మ్‌డ్ ఫోర్సెస్ స్పెషల్ పవర్స్ ఆక్ట్ (ఎఎఫ్‌ఎస్‌పిఎ) ను రూపొందించారు. ఈ చట్టం ఆర్మీలోని జూనియర్ అధికారులూ, జవాన్ లూ ఎవరినైనా, ఎక్కడైనా అనుమానాస్పదంగా భావించినట్టయితే వారిని అరెస్ట్ చేయడానికి, విచారించడానికి, చంపేయడానికి అధికారం ఇచ్చింది. అనుమానితులను తనిఖీ చేయడానికి, వారి ఆస్తి ధ్వంసం చేయడానికి అధికారులకు అధికారం ఉంది. కేంద్ర ప్రభుత్వం అనుమతి లేకుండా ఏ ఆర్మీ అధికారినీ, జవాన్‌నూ ప్రశ్నించడానికి కానీ, శిక్షించడానికి కానీ వీల్లేదు.

ఈ చట్టంతో మణిపూర్‌లో సామాన్య ప్రజల పరిస్థితి ఘోరంగా తయారైంది. అప్పటి నుంచి ప్రతి సంవత్సరం ఒక్కొక్క జిల్లాని ఈ చట్టం పరిధిలోకి తెస్తూ వచ్చారు. 1980లకు మొత్తం మణిపూర్ రాష్ట్రం ఈ చట్టం పరిధిలోకి వచ్చింది. ఈ చట్టం అండతో సాయుధ బలగాలు ఎంతో విధ్వంసం సృష్టించాయి. వాటి అంచనా కట్టడం కూడా వీలు కాదు. రాష్ట్రంలో ఒక రకమైన స్తబ్దత ఏర్పడింది. అక్కడ మృత్యువు చాలా సులువుగా పలకరిస్తుంది.

ఈ చట్టం వల్ల ముప్ఫై సంవత్సరాలలో ఎంతో మంది యువతీ యువకులు ఈ ప్రాంతంలో కనబడకుండా పోయారు. లేదా చంపబడ్డారు. మానభంగాలకు గురయ్యారు. తీవ్రమైన చిత్రహింసల పాలయ్యారు. ఎన్నో మానవ హక్కుల నివేదికలు ఈ విషయాలను బహిర్గతపరిచినా సైనికులపై ఎటువంటి చర్యలూ లేవు.

2004లో మనోరమా దేవి అనే యువతిని ఆమె ఇంట్లో నుంచి బయటకు ఈడ్చుకొచ్చి సైనికులు తీసుకుపోయారు. ఆ మరుసటి రోజు ఆమె శవం లభించింది. ఆమెను అతి క్రూరంగా మానభంగం చేసి, హత్య చేశారు. ఈ సంఘటనతో మణిపూర్ ప్రజల్లో ఒక్కసారిగా ఆగ్రహం పెల్లుబికింది. ఎంతో మంది ఆడవాళ్లు అస్సాం రైఫిల్స్ హెడ్‌క్వార్టర్స్ ఎదురుగా నగ్నంగా ఆందోళనకు దిగారు. 'భారత సైనికులు మమ్మల్ని మానభంగం చేశారు' అన్న నినాదాలు రాసిన ప్లేకార్డులతో వారు ఆందోళన చేశారు. ఈ వార్త దేశంలో, విదేశాలలో సంచలనం సృష్టించింది. ఈ సంఘటనపై కేంద్ర ప్రభుత్వం జీవన్‌రెడ్డి కమిటీని నియమించింది. ఆ కమిటీ ఇచ్చిన నివేదికతో ఎఎఫ్‌ఎస్‌పిఎ చట్టం, సైనికులను ఇంఫాల్ జిల్లాల నుంచి తొలగించారు.

ఎఎఫ్‌ఎస్‌పిఎ తొలిగించిన తర్వాత గత ఐదు సంవత్సరాలుగా 'మణిపూర్ పోలీస్ కమాండోస్' (ఎంపిసి) రూపంలో నిర్బంధం తీవ్రతరమయ్యింది. కొత్తగా వచ్చిన కమాండోలు అదే దుర్మార్గం కొనసాగించారు. ఒకవైపు జాతుల మధ్య వైరాలతో, మరోవైపు కమాండోల దుర్మార్గాలతో ప్రజలు భయభ్రాంతులకు గురయ్యారు.

అక్కడి సైనిక అధికారుల మెదళ్లలో నిరంకుశత్వం నాటుకు పోయింది. ఏ సమస్యనైనా సానుకూలంగా స్పందించి పరిష్కరించేబదులు సాయుధంగా దానిని అణచివేయాలనే ధోరణిని అలవర్చుకున్నారు.

మణిపూర్‌లో మీడియా పాత్ర చాలా కుంచించుకుపోయింది. అక్కడి పరిస్థితులను బాహాటంగా ప్రచురించడానికి కూడా మీడియా సాహసించడం లేదు. సుజిత్ ఘటనను అక్కడి పత్రికలు ప్రచురించలేవన్న భయంతోనే ఆ చిత్రాలను తెహెల్కాకు అందజేశారు. సైనికులకూ, అక్కడి అంతర్గత పోరాట సంస్థలకూ ఒకరితో ఒకరికి సంబంధాలున్నాయి. ప్రతి ఒక్క రాజకీయ నాయకుడు, అధికారి, పోలీస్ ఏదో ఒక పోరాట సంస్థతో సంబంధాలు పెట్టుకుని కార్యకలాపాలు జరుపుతారు.

అక్కడ ఉన్న వేర్వేరు తెగలు వేటికవి అజ్ఞాత ఉద్యమ సంస్థలను ఏర్పాటు చేసుకొన్నాయి. ఎవరికి వారు విరాళాలు, నిధులు వివిధ ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థల నుంచి వసూలు చేసుకుంటారు. వారికి సొంత ఆర్థిక వ్యవహారాలు, మిలిటరీ, సాంస్కృతిక విభాగాలు ఉన్నాయి. అయితే వీటితో జరుగుతున్న ఇబ్బంది కన్న భారత ప్రభుత్వ జోక్యం, అణచివేతలు ప్రజలను ఎక్కువ ఇబ్బందులకు గురిచేస్తున్నాయి.

మణిపూర్ పరిస్థితిని వాస్తవంగా అంచనా వేయాలంటే అక్కడ రాజ్యం ఒక గందరగోళ స్థితిని సృష్టించింది. ఏదో ఒక స్థాయిలో మిలిటెంట్‌లకూ రాజకీయ నాయకులకూ మధ్య స్నేహం ఉంది. కమాండోలకూ, డబ్బు వసూలు చేసేవారికీ మధ్య ఐక్యత ఉంది. స్నేహితులే ఇన్‌ఫార్మర్‌లుగా, చట్టం అమలు చేసే వారు హంతకులుగా ఇలా, చాలా విచిత్రమైన, జమిలిగా కలగలసి సాగుతున్న సామాజిక చిత్రం మనకక్కడ కనబడుతుంది.

మణిపూర్‌లో సామాన్య ప్రజల పరిస్థితులు దిన దిన గండంగా ఉంది. ఎటు చూసినా అరాచకత్వం ప్రజలను భయకంపితులను చేస్తోంది. వారు తమ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని బతుకుతున్నారు. మణిపూర్‌లో సామాన్య పరిస్థితులు నెలకొనడానికి జాతి వైరుధ్యాలు రూపుమాపాలి. మొత్తంగా ఆయా జాతుల సమస్యలను సామరస్యంగా చర్చించి పరిష్కరించాలి. అప్పుడే అక్కడ సామాన్య జనజీవనం కొనసాగుతుంది. వీ

*ఉత్తరాంధ్రలో రాబోతున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల వలన ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కలగబోతున్న ముప్పును వివరిస్తున్నారు* **సమత**

# కళింగాంధ్రకు విద్యుత్ విపత్తు

అభివృద్ధి ముసుగులో విధ్వంసాన్ని సృష్టించడం మన పాలకులకు వెన్నతో పెట్టిన విద్య. అందుకోసం ఎలాంటి కుతంత్రానికైనా వెనుదీయరు. ఒకటికాదు, రెండుకాదు ఏకంగా ఐదు థర్మల్ విద్యుత్, ఒక అణు విద్యుత్ ప్రాజెక్టలను కళింగాంధ్ర ప్రాంతమైన శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో నెలకొల్పడానికి జోరుగా సన్నాహాలు జరుగుతున్నాయి. దేశంలోనే అత్యంత వెనుకబడిన కళింగాంధ్రకు అన్ని రాజకీయపక్షాల నేతలు విధ్వంసకరమైన ప్రాజెక్టలకు స్వాగతం పలుకుతుండడం అత్యంత విషాదం. ఈ పవర్ పంజా వెనుక బడానేతల స్వార్థం రెక్కలు సాగి రెపరెపలాడుతుంటే లక్షలాది మంది జనం బలి పశువులుగా మారనున్నారు. తరతరాలుగా నమ్ముకున్న భూమిని అధిక మొత్తాలు ఎరచూపిన పెట్టుబడిదారులకు త్యాగంచేసి నిర్వాసితులుగా మిగలనున్నారు. సముద్రంలో చేపల వేటే జీవనాధారంగా గల మత్స్యకారులు ఉపాధి పోయి వలసలకు సిద్ధమౌతున్నారు.

శ్రీకాకుళం జిల్లాలో సుదీర్ఘమైన తీర రేఖ 193 కిలోమీటర్ల పొడవునా విస్తరించి ఉంది. ఈ తీరప్రాంతంలో ఎత్తైన కొండలు లేకపోవడం, అంతా మైదాన ప్రాంతం కావడం, జల వనరులకు కొరత లేకపోవడం వల్ల పరిశ్రమల ఏర్పాటుకు ఈ నేల అనుకూలంగా ఉంటుంది. అదే విధంగా పారిశ్రామిక నగరమైన విశాఖపట్నం దగ్గరగా ఉండడం, మరోపక్క ఉత్తర దక్షిణ భారతదేశాలను కలిపే అయిదో నెంబరు జాతీయ రహదారి చెన్నై-హౌరా రైలు మార్గం అందుబాటులో ఉండడం వల్ల ఇప్పటికే ఎన్నో పరిశ్రమలు వెలిశాయి. రణస్థలం మండలంలో ఈ జాతీయ రహదారి పొడవునా పదమూడు బల్క్ డ్రగ్ రసాయనిక కర్మాగారాలు ఉన్నాయి. వీటినుంచి వెలువడే విష వాయువులు, వ్యర్థాల వలన నేటికి అరవై గ్రామాల ప్రజలు రోగాల బారినపడి బతుకు పోరాటం చేస్తున్నారు. ఈ పరిశ్రమల కాలుష్యాల వలన ప్రజలు దుర్భరస్థితులు అనుభవిస్తున్నప్పటికీ పట్టించుకోని పాలకులు తమ నైజాన్ని మరోసారి స్పష్టం చేస్తున్నారు.

రణస్థలం మండలం కొవ్వాడ మత్స్యలేశం గ్రామంలో అణు విద్యుత్తు కేంద్రం, సంతబమ్మాళి మండలం కాకరాపల్లి గ్రామంలో థర్మల్ విద్యుత్ కేంద్రం, ఇచ్ఛాపురం నియోజకవర్గ పరిధిలో నాలుగు థర్మల్ విద్యుత్ కేంద్రాలు నెలకొల్పడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. వీటిలో కాకరాపల్లి, రుషికుద్ధ ప్రాంతాలలో నిర్మిస్తున్న థర్మల్ విద్యుత్ కేంద్రాలు దేశంలోనే అతి పెద్దవి. సోంపేట సమీపంలోని రుషికుద్ధ బీల ప్రాంతంలో పన్నెండు వేల కోట్ల రూపాయల వ్యయంతో 2640 మెగావాట్ల విద్యుత్తును ఉత్పత్తి చేయడానికి, ప్రాజెక్ట్ నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి. నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీ (ఎన్.సి.సి.) ఈ ప్రాజెక్ట్ నిర్మాణంలో తలమునకలై ఉంది.

దీనికోసం 1890 ఎకరాల స్థలం అవసరమై ఉండగా ఇప్పటికే ప్రభుత్వం 1100 ఎకరాల భూమిని ఎన్.సి.సి.కి ధారాదత్తం చేసింది. మొత్తం నాలుగు దశలలో విద్యుత్ ప్రాజెక్ట్ నిర్మాణం ఇక్కడ జరగనుంది. సంతబమ్మాళి మండలం కాకరాపల్లి తంపర భూముల్లో 2460 మెగావాట్ల థర్మల్ విద్యుత్ కేంద్రం ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి. ఈస్ట్‌కోస్ట్ పవర్ ఎనర్జీ ప్రైవేట్ లిమిటెడ్ ఆధ్వర్యంలో జరుగుతున్న ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి ప్రభుత్వం 2450 ఎకరాల భూమిని అప్పగించింది. సుమారు ఇరవై గ్రామాల పరిధిలోని ఈ భూముల్లో ప్రాజెక్ట్ నిర్మాణం జరుగుతుండడంతో ఎంతోమంది రైతుల బతుకులు దగాకు గురి కానున్నాయి. పదకొండువేల కోట్ల రూపాయల అంచనా వ్యయంతో ఈ ప్రాజెక్ట్ రూపుదిద్దుకోనుంది.

అమెరికాతో కుదిరిన అణు ఒప్పందం ఫలితంగా ఈ జిల్లాలోని రణస్థలం మండలం కొవ్వాడ మత్స్యలేశంలో అణువిద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పనున్నారు. ఇందుకుగాను భూసేకరణ కోసం సర్వే కూడా జరిగిపోయింది. వెయ్యి మెగావాట్ల అణువిద్యుత్తును ఉత్పత్తి చేసే సామర్థ్యం గల ఈ ప్రాజెక్టను ఏర్పాటు చేయడానికి భారత ప్రభుత్వం అమెరికాకు చెందిన ఒక కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఈ అణువిద్యుత్ కేంద్రం ఏర్పాటుకు 23 గ్రామాల పరిధిలోని 19,679 ఎకరాల భూమి అవసరమవుతుందని అధికారులు అంచనాలు రూపొందించారు. సుమారు ఎనిమిది వేల ఇళ్లు ఖాళీ చేయించి ముప్ఫై వేల మందికి పైగా జనాభాను వేరే ప్రాంతాలకు తరలించాల్సి ఉంది. ప్రాజెక్ట్ నిర్మాణం జరిగే స్థలం నుండి పది కిలోమీటర్ల పరిధిలోనున్న గ్రామాలన్నింటిని ఖాళీ చేయించాల్సిందే.

కళింగాంధ్ర ప్రాంతంలో ప్రస్తుతం ఉన్న పరిశ్రమలతో పాటు కొత్తగా వస్తున్న విద్యుత్ ప్రాజెక్టల వలన లక్షలాది మంది ప్రజలు నిర్వాసితులు కానున్నారు. వందలాది గ్రామాలు ఖాళీకానున్నాయి. వేలాది ఎకరాలలో పచ్చని పంటపొలాలు కనుమరుగు కానున్నాయి. ఈ ప్రాజెక్టల నుంచి వచ్చే వాయు, జల కాలుష్యం వెదజల్లే విష పరిణామాలు అధికంగా ఉంటాయి. ప్రధానంగా భూగర్భ జలాలతోపాటు సముద్ర జలాలు కూడా కలుషితమవుతాయి. దీనివల్ల రకరకాల ప్రాణాంతక వ్యాధులు ప్రబలడంతో పాటు సముద్రంలో మత్స్య సంపద అంతరించి పోయి మత్స్యకారుల జీవితాలు మరింత దయనీయతలోకి వెళ్లిపోయే

వ్యవసాయంలో హరిత విప్లవంతో పాటు దిగుమతి అయిన పురుగుమందులు, రసాయనాల కంపెనీలు తీసుకువచ్చిన ప్రమాదాలను వివరించి, చేపట్టాల్సిన ప్రత్యామ్నాయాలను సూచిస్తున్నారు **జి.వి. రామాంజనేయులు**

# వ్యవసాయంపై కార్పొరేట్ ప్రభావం

డిసెంబర్ 3, ప్రపంచంలోనే అత్యంత తీవ్రమైన పారిశ్రామిక దుర్ఘటనగా గుర్తింపబడిన భోపాల్ గ్యాస్ సంఘటన జరిగి ఇరవై ఐదు సంవత్సరాలు గడిచాయి. ఈ ఇరవై ఐదు సంవత్సరాల కాలంలో వ్యవసాయరంగంలో జరిగిన, జరుగుతున్న పరిణామాలు, పారిశ్రామిక ఉత్పత్తుల విషయంలో ప్రభుత్వం అవలంబిస్తున్న విధానాలతో పరిశీలిస్తే ఈ సంఘటన నుంచి ప్రభుత్వం ఏమీ గుణపాఠం నేర్చుకోలేదని అర్థం అవుతుంది. భోపాల్ గ్యాస్ బాధితులకు ఇప్పటికీ న్యాయం జరగలేదు, దుర్ఘటనకు కారణమైన కంపెనీ యజమానికి శిక్షపడలేదు. యాజమాన్యం యూనియన్ కార్బైడ్ నుండి డౌ కెమికల్స్‌కి మారింది. పరిశ్రమ చెన్నై దగ్గరకు చేరింది. అదే ఉత్పత్తిని తయారు చేస్తూ వారు లాభాలు గడిస్తూనే ఉన్నారు. ఆ ఉత్పత్తిని, అటువంటి అనేక పురుగు మందులను వాడుతూ అటు రైతులూ, వాటి అవశేషాలతో వినియోగదారులూ నష్టపోతున్నారు. ఆ పరిశ్రమ దేశవ్యాప్తంగా ఉన్న అటువంటి అనేక పరిశ్రమల చుట్టూతా ఉన్న స్థలాలు కలుషితం అవుతూనే ఉన్నాయి. పరిశ్రమలో పనిచేసే కార్మికులు, చుట్టూ ఉండే ప్రజల ఆరోగ్యాలతో చెలగాటమాడుతూనే ఉన్నాయి.

హరిత విప్లవం పేరుతో, దేశ ఆహార భద్రత నినాదంతో దేశంలో పెద్ద ఎత్తున రసాయినిక వ్యవసాయాన్ని ప్రోత్సహించడం జరుగుతోంది. రసాయినాలు వాడడంతోటే దేశ ఆహార భద్రత సాధిస్తామని చెబుతోంది ప్రభుత్వం. దానికి వంత పాడుతున్న వ్యవసాయ పరిశోధనా సంస్థలు, ఆహార భద్రతకి అవసరం కాబట్టి ఇటువంటి రసాయినాల తయారీలో కాని, వాడకంలో కాని, వాడిన తర్వాత వాటి అవశేషాలతో కాని సమస్యలుంటే భరించాలనేది వీరి వాదన.

పురుగు మందుల తయారీ పరిశ్రమలు వెదజల్లే కాలుష్య పదార్థాల గురించి ప్రత్యేకంగా చర్చించుకోవాల్సిన పని లేదు. అయితే వాటి వినియోగంతో రైతుల జీవితాలు చిన్నాభిన్నం అవుతున్నాయి. పురుగుల

---

ప్రమాదం కనిపిస్తోంది. గత కొన్ని సంవత్సరాల నుంచి సైబీరియా ప్రాంతం నుండి వలస వచ్చే విదేశీ పక్షులు పెలికాన్, పెయింటెడ్ స్టార్క్ పక్షులు సంతబమ్మాళి మండలం కాకరాపల్లి తంపర భూముల్లోనే చేపలవేట సాగించి, టెక్కలి మండలం తేలినీలాపురం గ్రామంలో ప్రకృతి సహజసిద్ధమైన పక్షి సంరక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేసుకున్నాయి. అయితే ఈ థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ నిర్మాణం జరిగితే ఇవి అదృశ్యం కాక తప్పదు. పర్యావరణ సమతుల్యత కూడా మటుమాయం అవుతుంది.

ఉద్ధానం ప్రాంతంలో ఇప్పటికే మూత్రపిండాల వ్యాధులు వేలాది కుటుంబాలను జీవచ్ఛవాలుగా మార్చేస్తున్నాయి. ఈ తరుణంలో అదే ప్రాంతంలో నాలుగు వరకు థర్మల్ విద్యుత్ కేంద్రాలు నెలకొల్పుతుండడంతో వీరి జీవితాలు మరింత దారుణ పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుంది. ఈ విద్యుత్ ప్రాజెక్ట్‌ల ఏర్పాటువలన సమీప గ్రామాలలోని ప్రజలకు శ్వాస, ఊపిరితిత్తుల సంబంధిత వ్యాధులు, క్యాన్సర్ వంటి ప్రాణాంతక వ్యాధులు వ్యాపించే అవకాశాలు ఉన్నాయి. పవర్ ప్లాంటుల చుట్టూ ఐదు కిలోమీటర్ల పరిధి వరకు అధిక ఉష్ణోగ్రతలు నమోదు కానున్నాయి. థర్మల్ ప్రాజెక్ట్‌ల నుంచి వెలువడే బొగ్గుధూళి (యాష్) ని సక్రమమైన విధానంలో యాష్ పాండ్‌ల ద్వారా ఎప్పటికప్పుడు తడుపుతుండాలి. లేకుంటే ఈ ధూళి పైకి ఎగసి కొన్ని కిలోమీటర్ల మేర పంటలపై ముఖ్యంగా కొబ్బరి, వరి తదితర ప్రధాన పంటలపై మేటవేసి ఆ భూమి పనికిరాకుండా మార్చివేస్తుంది.

శ్రీకాకుళం జిల్లాలో ఐదు చోట్ల థర్మల్ విద్యుత్ కేంద్రాలు, ఒకచోట అణు విద్యుత్ కేంద్రం ఏర్పాటును నిరసిస్తూ గత కొన్ని నెలల నుంచి స్థానిక ప్రజలు తీవ్ర స్థాయిలో ఆందోళనలు కొనసాగిస్తున్నారు. ఇచ్ఛాపురం నియోజకవర్గ పరిధిలో ఏర్పాటవుతోన్న నాలుగు థర్మల్ విద్యుత్ కేంద్రాలతో పాటు కాకరాపల్లి వద్ద నిర్మాణమవుతున్న థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్, రణస్థలం కొవ్వాడలో నిర్మాణం కానున్న అణువిద్యుత్ కేంద్రం వల్ల నష్టపోనున్న ప్రజలు, ప్రజాసంఘాలు తమ ఉద్యమ సంస్థలు ఇప్పటికే ఎన్నోసార్లు ఆందోళన కార్యక్రమాలు నిర్వహించారు. బీల ప్రాంతంలో ఏర్పాటవుతోన్న థర్మల్ విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం ఊపందుకుంది. ప్రజలు పెద్దఎత్తున ఆందోళనలు చేపట్టడమే కాకుండా రైలురోకోలు, మంత్రులు ఇతర ప్రజాప్రతినిధులను ఘెరావ్ చేయడం వంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

థర్మల్ విద్యుత్, అణు విద్యుత్ ప్రాజెక్ట్‌లకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజల పక్షాన నిలవడానికి అధికార, ప్రతిపక్ష నేతలు విముఖత చూపుతుండడం అందరికీ విస్మయాన్ని కలిగిస్తోంది. ప్రజా వ్యతిరేక విధానాలను అవలంబించడంలో అధికార పక్షమైనా, ప్రతిపక్షమైనా ఒకేలాగా స్పందిస్తాయనడానికి ఈ ఉద్యమమే ఒక ఉదాహరణ. పారిశ్రామిక అభివృద్ధి ముసుగులో జనజీవన విధ్వంసానికి తెగబడిన పాలకుల ముసుగులను ఇప్పటికైనా తొలగించాల్సిన బాధ్యత ప్రజాస్వామ్యవాదులందరిపైనా ఉంది. వీ

తెగుళ్ల నివారణకు వాడే ఈ రసాయినాల వలన వాడుతున్న క్రమంలోనే అనేక మంది రైతులు, రైతు కూలీలు వీటి విష ప్రభావానికి లోనువుతున్నారు. మన రాష్ట్రంలో 2005లో చేపట్టిన ఒక అధ్యయనంలో అటు విష ప్రభావానికి గురై చనిపోతున్న వారి సంఖ్య ప్రతి పంట కాలంలోనూ ఐదు వందల వరకూ ఉండొచ్చని అంచనా. అలాగే ఈ పురుగు మందులు వాడిన తర్వాత అక్కడ పెరిగే పిల్లల పెరుగుదల పై ప్రభావం చూపుతోందని, పురుషుల, మహిళల పునరుత్పత్తి శక్తిపై ప్రభావం చూపుతోందని అనేక పరిశోధనలు తెలియజేసాయి. వీటికి తోడు ఈ రసాయినాల అవశేషాలు నీళ్లలోనూ, ఆహారంలోనూ కలిసి తీవ్రమైన సమస్యగా మారుతున్నాయి. 'కోలా'లలో అవశేషాలు, 'పచ్చళ్ల'లో అవశేషాలు మాత్రమే వార్తల్లోకి వచ్చాయి కానీ, పరీక్షలు చేస్తే మనం తాగే మంచినీరు నుంచి తినే అన్ని పదార్థాలలోనూ ఈ పురుగు మందుల అవశేషాలు అధికంగా ఉన్నాయి. నేడు క్యాన్సర్ వంటి రోగాలు అధికం కావడానికి ఈ అవశేషాలు ఒక ముఖ్య కారణం.

పర్యావరణ ప్రభావంతో పాటు, నేడు రైతుల ఆర్థిక పరిస్థితిపై ఈ పురుగు మందులు తీవ్రమైన ప్రభావం చూపిస్తున్నాయి. పంటకుపెట్టే పెట్టుబడి ఖర్చులో 25 నుంచి 65 శాతం వరకూ ఈ పురుగు మందుల ఖర్చులే. గత పది సంవత్సరాల కాలంలో పురుగు మందుల ధర సగటున 400 శాతం పెరిగింది. కొత్తగా వస్తున్న కొన్ని పురుగు మందుల ధరలు కిలోకి రు. 20,000 వరకూ ఉన్నాయి. పురుగు మందుల వినియోగం తగ్గించే ప్రయత్నాలు చేస్తున్నామని ప్రభుత్వాలు చెబుతున్నా నిజానికి చేస్తున్నది శూన్యం. గతంతో పోల్చుకుంటే ఇప్పుడీ తక్కువ మోతాదులో వాడే పురుగు మందులు రావడం వలన మొదట్లో వినియోగం తగ్గుతున్నట్లు కనిపించినా, ఇప్పుడు ఎక్కువైంది. మన రాష్ట్రంలో గత మూడేళ్ల కాలంలో పురుగుమందుల వినియోగం రెండింతలు అయిందంటే దాని ప్రభావం రైతులపై ఎంత ఉందో అర్థం చేసుకోవచ్చు.

రసాయినిక పురుగు మందులు వాడకుండా, స్థానిక వనరులతో ఇంట్లో తయారు చేసుకొని వాడే ఉత్పత్తులలో దిగబడులు ఏమాత్రం తగ్గకుండా, పురుగుల, తెగుళ్ల నియంత్రణ చేసుకోవచ్చని, ఇప్పటికీ అనేక గ్రామాల అనుభవాలు చెబుతున్నాయి. సుస్థిర వ్యవసాయ కేంద్రం ప్రారంభించిన పురుగు మందులు లేని వ్యవసాయం పద్ధతులు నేడు రాష్ట్రంలో ఐదు వేల గ్రామాలలో 14 లక్షల ఎకరాలలో రైతులు పాటిస్తున్నారు. ఇందులో అనేక గ్రామాలు అత్యధికంగా పురుగు మందులు వాడుతూ మానేసినవే. పత్తి, మిరపతో పాటు అనేక వాణిజ్య, ఆహార పంటలు ఈ పద్ధతులలో పండిస్తున్నారు. రాష్ట్రంలోని వ్యవసాయ విస్తీర్ణంలో పది శాతంతో ఈ పద్ధతులు అమలులో ఉన్నా అటు రాష్ట్ర వ్యవసాయశాఖ కానీ, ఇటు వ్యవసాయ విశ్వవిద్యాలయాలు కానీ వీటిపై దృష్టి పెట్టలేదు. కంపెనీల నుంచి నేరుగా వచ్చే నిధులు, లంచాలకు లొంగి పై అధికారులు, ఇది తప్ప ప్రత్యామ్నాయం లేదని నేర్చుకొని రైతులకి, అవే చెప్పి కింద అధికారులు అటు రైతుల జీవితాలతోనూ, ఇటు వినియోగదారుల జీవితాలతోనూ చెలగాటం ఆడుకొంటున్నారు.

సమస్య ఇక్కడితో ఆగలేదు. పురుగు మందుల పరిశ్రమతో పాటు ఇప్పుడు విత్తనాల కంపెనీలు, ముఖ్యంగా జన్యు మార్పిడి విత్తనాలు తయారు చేసే 'మాన్‌శాంటో' లాంటి కంపెనీలు 'రసాయనాల' గురించి చేసిన వాదననీ ఇప్పుడు జన్యుమార్పిడి పంటల గురించి చేస్తున్నాయి. అవి లేకపోతే ఆహార భద్రత లేదు అని చెపుతూ జన్యు మార్పిడి ఆహార పంటలు ప్రవేశపెట్టడానికి చూస్తున్నాయి. గత ఆరేడు సంవత్సరాలుగా ఆంధ్రప్రదేశ్, మిగిలిన రాష్ట్రాలలో బి.టి. పత్తి ప్రభావంతో నేలలు పాడవుతున్నాయనీ, పశువులు చనిపోతున్నాయనీ, పొలాల్లో పనిచేసే కార్మికులకు చర్మరోగాలు వస్తున్నాయని చెపుతున్నా, పరిశోధనలు తెలియజేస్తున్నా అటు పరిశ్రమలు, ఇటు ప్రభుత్వం పెడచెవిన పెడుతున్నాయి. ఇటువంటి సాంకేతిక పద్ధతులు అవసరం లేదా అన్నది నిర్ణయించకుండా, వాటి వలన జీవ భద్రతకు ఏర్పడే ముప్పు గురించి సరిగ్గా పరిశోధనలు చేసి తగిన జాగ్రత్తలు తీసుకోకుండా పరిశ్రమల ఒత్తిడికి లొంగిపోయి వీటిని విడుదల చేయడం వలన అటు రైతులు, ఇటు ప్రభుత్వాలు కూడా తీవ్రమైన ఇబ్బందులకు గురవుతున్నాయి. బి.టి. పత్తి విత్తనాల ధర నియంత్రణ కోసం రాష్ట్ర ప్రభుత్వం కోర్టుకు వెళ్లి పోరాటంచేసి, కొత్త చట్టం తీసుకురావాల్సిన పరిస్థితి వచ్చింది.

మారుతున్న ఆర్థిక విధానాలతో ఇప్పుడు ఆహార మార్కెట్‌పై పట్టు సాధించడానికి కార్పొరేట్ సంస్థలు ప్రయత్నం చేస్తున్నాయి. ఐటిసి, రిలయన్స్, హెరిటేజ్, ఆర్‌పిజి లాంటి సంస్థలు ఇప్పటికే ఆహార మార్కెట్‌లోకి ప్రవేశించాయి. అంతర్జాతీయ రిటైల్ చెయిన్ కూడా మన దేశంలోకి ప్రవేశించడానికి ప్రయత్నాలు చేస్తోంది. అయితే ఇవన్నీ ఇక్కడి మార్కెట్‌ను చేజిక్కించుకోవడానికంటే మార్కెట్ వ్యవస్థను ఏర్పాటు చేసుకొని, ఇక్కడ తక్కువ ధరకు పండించిన ఉత్పత్తులను బయట దేశాలలో, పర్యావరణ సమస్యపై అవగాహన పెరగడంతో అక్కడ అనుమతించని రసాయనాలను, జన్యుమార్పిడి పంటలను వాడుకొని వ్యాపారాలు పెంచుకోవడానికి జరుగుతున్న ప్రయత్నంగా మనం అర్థం చేసుకోవాలి. ఇది మన వ్యవసాయరంగంపైనా, మన రైతుల భవిష్యత్తు పైనా, వనరులపైనా మన హక్కులపైనా తీవ్ర ప్రభావం చూపిస్తుంది. ఇప్పటివరకూ ఉత్పాదకాల (ఇన్‌పుట్) వ్యాపారంలోనూ, ఉత్పత్తుల మార్కెటింగ్‌లోనూ ఉన్న కార్పొరేట్ సంస్థలు వ్యవసాయ ఉత్పత్తి (ప్రొడక్షన్) రంగంలోకి ప్రవేశించడానికి ప్రయత్నం చేస్తున్నాయి. రాష్ట్రవ్యాప్తంగా లక్షల ఎకరాలు అనేక పేర్లతో పెద్ద సంస్థలు, వ్యక్తులు కొనుక్కొని ఉన్నారు. ఇటువంటి వ్యవసాయాన్ని ప్రోత్సహించడానికి మన రాష్ట్ర ప్రభుత్వం 'సహకార వ్యవసాయం' పేరుతో పెద్ద కమతాల వ్యవసాయం ప్రారంభించడానికి ప్రయత్నం చేసింది.

ఇటువంటి ప్రయత్నాలను అడ్డుకొని, ప్రత్యామ్నాయ పద్ధతులను రైతుల వద్దకు తీసుకువెళ్లి వారి జీవనోపాధులకు భద్రత కల్పించకపోతే, ఇప్పుడు ఉన్న సంక్షోభం ఇంకా తీవ్రమవుతుంది. ఆత్మహత్యలు, వలసలు ఎక్కువవుతాయి. ప్రభుత్వ అంచనా మేరకు 30-40 శాతం మంది వ్యవసాయం నుంచి బయటకు వస్తారనుకుంటే రాష్ట్రంలో వచ్చే ఐదేళ్లలో 50-60 లక్షల కుటుంబాలు, దేశవ్యాప్తంగా 4-5 కోట్ల కుటుంబాలు రోడ్డున పడతాయి. ఈ పరిస్థితి తీవ్రత మనం అర్థం చేసుకోవచ్చు. దీనికి తోడు మొన్న యూనియన్ కార్బైడ్, నిన్న ఇవ్వాళ మోన్‌శాంటో, రేపు ఇంకో కార్పొరేట్ సంస్థ తమ లాభాల కోసం మన విధానాలను, మన జీవితాలను దోచుకుంటూనే ఉంటాయి. ఇప్పటికీ మేల్కొనకపోతే ఆ మత్తులోనే చనిపోతాం. మన భవిష్యత్తుకు మనమే చరమగీతం పాడుకుంటాం. వీ

ప్రజల అజ్ఞానాన్ని ఆసరాగా చేసుకొని పాలకులు తమ విజ్ఞానానికి మానవ ముఖాలు తొడిగి, తీసుకువస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను వివరిస్తున్నారు **వై. రామచంద్రం**

# ఎం.ఎన్.సి.ల సేవే ప్రభుత్వ ధ్యేయం

భోపాల్ గ్యాస్ బాధితులకు న్యాయం జరగాలని కోరుతూ రెండు స్వచ్ఛంద సంస్థలు ఈ మధ్య మళ్లీ న్యాయస్థానం తలుపు తట్టాయి. చీఫ్ జుడీషియల్ మెజిస్ట్రేట్ జూలై 22న ప్రధాన నిందితుడైన యూనియన్ కార్బైడ్ అధికారి వారెన్ అండర్సన్ అరెస్టుకు నాన్ బెయిలబుల్ వారెంట్ జారీ చేశారు.

భోపాల్ దుర్ఘటన జరిగి ఈ డిసెంబర్ 2కు ఇరవై ఐదు ఏళ్లు కావస్తోంది. డిసెంబర్ 2,1984 అర్ధరాత్రి యూనియన్ కార్బైడ్ కంపెనీ నుంచి వెలువడిన మిక్ విషవాయువు ప్రభావం వల్ల 1100 మంది మరణించారని ప్రభుత్వం నియమించిన పరిశోధన బృందం తేల్చింది. అనధికారిక లెక్కల ప్రకారం 25 వేల మంది మరణించి ఉంటారని అక్కడి స్వచ్ఛంద సంస్థలు అంచనా వేస్తున్నాయి. ఇండియన్ మెడికల్ రీసెర్చ్ కౌన్సిల్ సేకరించిన సమాచారం ప్రకారం 5,21,262 మంది మిక్ బాధితులుగా గుర్తించబడ్డారు. ఊపిరితిత్తుల్లో చిల్లులు పడి, చాల మంది అంధులై, దీర్ఘకాలిక వ్యాధులను ఎదుర్కొంటున్నారు. భోపాల్‌లో పక్కా ఇళ్లు ఉన్న వాళ్లని తప్ప సంచార జాతుల ప్రజలను ఇందులో లెక్కించలేదు. తరవాతి కాలంలో బాధితులకు కలిగిన సంతానాన్ని కాని, గర్భస్థ శిశువులను కాని ఇందులో చేర్చలేదు.

ప్రమాదం జరిగిన తరువాత అదో పెద్ద విపత్తు కాదంటూ కంపెనీ డాక్టర్ ప్రకటించాడు. అప్పటికే వందల మంది మరణించారు. భారత వైద్య పరిశోధనా మండలి రంగంలోకి దిగే వరకు, బాధితులపై దీర్ఘకాలిక ప్రభావం ఉండదని కంపెనీ నమ్మించింది. సంబంధిత నివేదికను పదిహేనేళ్ల పాటు బయటపెట్టలేదు. నేటికీ మిక్ బాధితులు వైద్యం కోసం రోజుకి నాలుగు వందల మంది వరకూ వస్తున్నారని అంచనా.

అక్కడ ప్రత్యక్షంగా ఉన్న డాక్టరు అనుభవం ప్రకారం అనేక మంది మహిళలకు గర్భస్రావాలయ్యాయి. ఆ పిండాలను డాక్టర్ శతపతి నిర్వాహణలోని హమీదా ప్రభుత్వ ఆసుపత్రి లాబొరేటరీలో పరిశోధన నిమిత్తం భద్రపరిచారు. ఆ రోజు ఉదయం అక్కడి ప్రజల జీవితాల్లో వెలుగుకు బదులు విషం చిమ్మి చీకటి కమ్మింది. 'దాదాపు 20 వేల మంది పైచిలుకు పంచనామాలు నిర్వహించి ఉంటాం. ఈ అనుభవం మాకు పీడకల లాంటిది. ప్రత్యేకించి దుర్ఘటన జరిగిన తొలిరోజుల్లో మార్చురీ నుంచి మేం బయటకు వచ్చిన సందర్భాలు చాలా అరుదు. ఆ తర్వాత కూడా చూసిన కొందరి పరిస్థితి అసాధారణంగా, విచిత్రంగా అనిపించింద' డాక్టర్ శతపతి అన్నారు.

యూనియన్ కార్బైడ్ వెదజల్లిన విషవాయువు వల్ల అక్కడ బతికి ఉన్నవారికి జీవితానికి చోటులేదు. చనిపోయిన వారిని పూడ్చడానికి చోటులేదు. కంపెనీ చుట్టూ అయిదు కిలోమీటర్ల మేరకు భూగర్భ జలాలు కలుషితమై భూమి, నీరు, గాలి, సకల జీవరాశులు తమ సహజత్వాన్ని కోల్పోయిన పరిస్థితి ఉంది. విషవాయువు కారణంగా వేలమంది మరణించడంతో వేరే గత్యంతరం లేక మృత దేహాలను ఒకదానిపై ఒకటి పూడ్చిపెట్టారు.

కార్బైడ్ కంపెనీ చరిత్రలోకి వెళితే, 1981లో ఒక కార్మికుడు విషవాయువు ప్రభావం వల్ల మరణించాడు. 1982లో విషవాయువు లీక్ కావడంవల్ల 14 మంది కార్మికులు అనారోగ్యానికి గురై ఆస్పత్రి పాలయ్యారు. ఒక ఇంజనీర్ శరీరం 30 శాతం కాలి గాయాల పాలయ్యాడు. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఈ ఘటనలను వ్యతిరేకిస్తూ కార్మిక సంఘాలు తమ నిరసనను తెలియ జేశాయి. కంపెనీకి లాభాలు, భారత అధికారులకు కమిషన్‌లే ప్రధానం కాబట్టి ప్రజల ప్రాణాలను లెక్కచేయలేదని డిసెంబర్ 2నాటి ఘటన రుజువుచేస్తోంది.

బాధితులకు న్యాయంకోసం జరుగుతున్న పోరాటానికి 25 ఏళ్లు నిండనున్నాయి. యూనియన్ కార్బైడ్ కంపెనీ సగటున ఒక్కొక్కరికి 500 డాలర్లు ఇచ్చి చేతులు దులుపుకుంది. కార్పొరేట్ నేరసంస్థల జాబితాలో ప్రపంచంలోనే ప్రథమస్థానం పొందిన కంపెనీ ఇది. 2001లో కార్బైడ్ కంపెనీ ఆస్తులను డౌ-కెమికల్ గ్రూపు కొనుగోలుచేసింది. మన దేశంలో యూనియన్ కార్బైడ్ ప్రమాద బాధితుల నష్టపరిహారంతో తనకు సంబంధం లేదంటోంది. తాను ఎవరికి, దేనికి జవాబుదారీ కాదని బుకాయిస్తోంది. అందుకే పోరాటం కూడ సుదీర్ఘకాలం సాగుతోంది. అమెరికాలోని ఆస్బెస్టాస్ బాధితులకు యూనియన్ కార్బైడ్ సంస్థ ఇచ్చిన పరిహారంతో పోల్చితే, భోపాల్ బాధితులకు అందినది అతి స్వల్పం.

యూనియన్ కార్బైడ్ అధికారి వారెన్ అండర్సన్‌ను 7 డిసెంబర్ 1984న అరెస్ట్ చేసింది. వేలాది మంది మరణాలకు కారణమైన కంపెనీ అధికారి 11 డిసెంబర్ 1984న దేశం విడిచి వెళ్లిపోనిచ్చింది. ఇక ఆరోజు నుండి అండర్సన్ మన దేశానికి తిరిగిరాలేదు. 1991లో భోపాల్ న్యాయస్థానం కార్బైడ్ ఛైర్మన్ అండర్సన్‌కు సమన్లు జారీ చేసింది. ఆయనపై హత్యానేరాన్ని మోపింది. మార్చి 2000లో న్యూయార్క్ దక్షిణ జిల్లాలోని ఫెడరల్ న్యాయస్థానంలో బాధితుల సంఘాలు దావా వేసాయి. కార్బైడ్ కంపెనీ న్యాయవాది విలియం క్రోహెలీ అండర్సన్ సమన్లను

కంపెనీ తీసుకుంటుందని తెలిపాడు. అండర్సన్ వివరాలు మాత్రం చెప్పదన్నాడు. బాధితుల సంస్థలు మాత్రం ఊరుకోదల్చలేదు. ఈ వారెంట్ జారీ అయినా చివరకు సుప్రీంకోర్టు ముందు బాధితులకు పరిహారం పేర, యూనియన్ కార్బైడ్ సంస్థపై క్రిమినల్ చర్యలు మినహాయించేలా ఒప్పందం కుదుర్చుకుంది. మళ్లీ బాధితులు కోర్టుకు వెళ్లి ఈ మినహాయింపును రద్దు చేయించవలసి వచ్చింది. ఈనాటికీ అక్కడి గోడల మీద 'అండర్సన్‌ను ఉరితీయండి', 'లాడెన్ నీకెంతో అండర్సన్ మాకంతే' అనే నినాదాలు రాసి ఉంటాయి. భోపాల్ దుర్ఘటనలో భర్తలు మరణించిన మహిళలకోసం ప్రత్యేకంగా రాష్ట్ర ప్రభుత్వం పట్టణ శివార్లలో పునరావాస కాలనీని నిర్మించిందంటే పరిస్థితి ఎంత తీవ్రంగా పరిణమించిందో అర్థమవుతూనే ఉంది.

మూడో ప్రపంచ దేశాల భూభాగాన్ని ఒక పెంటకుప్పగా మారుస్తున్నారు. అందులో భాగంగానే నెదర్ల్యాండ్ దేశంలోని పశువుల పేడను కాండ్లారేవుకు తరలించారు. ఎక్కడైతే గాంధీ ఉప్పు సత్యాగ్రహం చేపట్టారో అదే కాండ్లారేవుకి దిగుమతి చేసుకున్నారు. పాలు, మాంసం ఉత్పత్తి పెంచడానికి రకరాకాల మందులు పశువులకు వాడడం వల్ల అవి విసర్జించే పేడ కూడా విషతుల్యమై పోయింది. పేడ భూమి ఫలసాయాన్ని పెంచాల్సింది పోయి, దాని ప్రభావం వల్ల నేల ఉత్పత్తికి పనికిరాని విధంగా మారిపోతోంది. అభివృద్ధి చెందిన దేశాలు ఆ పేడ విషతుల్య ప్రభావాలు తమ దేశంలో పడకుండా మన దేశానికి తరలిస్తే ప్రజల ప్రాణాలను, పర్యావరణాన్ని గాలికి వదిలిన మన పాలకులు దాని దిగుమతి కోసం తట్టలు పట్టుకొని ఎదురేగారు. అభివృద్ధి చెందిన దేశాలు తమ దేశాలలోని కర్మాగారాలలో భద్రతా ప్రమాణాలు పాటిస్తూ, పేద దేశాలలో మాత్రం వ్యయం తగ్గించుకోవడానికి కార్మికులకు అతి తక్కువ వేతనాలు ఇస్తూ భద్రతా ప్రమాణాలు గాలికొదిలేస్తున్నాయి. ఇక్కడి సహజ వనరులను ఉపయోగించుకోవడానికి రసాయనాలు తయారు చేసే కంపెనీలు మొదలుకొని అణు కర్మాగారాలను స్థాపించడానికి ముందుకు వస్తున్నాయి. భోపాల్ ఘటన జరిగి 25 సంవత్సరాలు గడిచింది. అలాంటి దుర్మార్గమైన అనుభవం తరువాత కూడా ఎటువంటి కార్మిక ప్రమాణాలు పాటించనవసరంలేని, మన న్యాయస్థానాలకు జవాబుదారీ పడనక్కరలేని, మరింత విశృంఖలంగా దోపిడీ చేయడానికి కార్పొరేట్ కంపెనీలు ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో వస్తున్నాయి.

సంస్కరణల కాలాన్ని మనం గమనిస్తే బహుళజాతి సంస్థల మార్కెట్‌ను నిలిపి ఉంచేదిగా సేవల రంగం మనకు కనబడుతోంది. టెలివిజన్లు, టెలిఫోన్లు, కంప్యూటర్లు వృద్ధి చెందినంతగా, దీర్ఘకాలిక ప్రయోజనాన్ని చేకూర్చే, మనిషి మనుగడకు అవసరమైన కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఉపాధి సౌకర్యాలు ప్రజలకు అందుబాటులోకి రాలేదు. సరైన పోషకాహారం లేక, అనారోగ్యంతో, దారిద్ర్యంతో అసహజ మరణాల పాలవుతున్న వేలాది మంది ప్రజల మరణాలు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

అయిదు రాష్ట్రాల్లో వస్తున్న విద్యుత్ కంపెనీలు ఆయా రాష్ట్రాల్లోని స్థానిక ప్రజల ప్రమేయంతో వస్తున్నవేనా లేదా ప్రభుత్వ ఇష్టం మేరకు మాత్రమే వస్తున్నాయా, అవి ఎవరి ప్రయోజనాలను నెరవేర్చడానికి అనేది ప్రశ్న. ప్రభుత్వాలు తెచ్చే ఏ అభివృద్ధి అయినా స్థానిక ప్రజల ప్రమేయంతో గాని, ఆమోదంతోగాని రావాలి. వచ్చే ప్రాజెక్టులు అక్కడి ప్రజలను ఏ మేరకు కలుపుకుంటాయి. వారి ప్రయోజనాలను ఏమేరకు నెరవేరుస్తాయి. వారి జీవితాలకు ఎలాంటి భరోసానిస్తున్నాయి అనే ప్రశ్నల్ని వేసుకుని గతంలో వచ్చిన ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులైన ప్రజల జీవితాలను మనం గమనిస్తే వారికి తగిన పని దొరకక అడ్డకూలీలుగా, బిచ్చగాళ్లుగా, ఆత్మస్థైర్యం కోల్పోయి ఆత్మహత్యల పాలవుతూ, మతిస్థిమితం లేనివారుగా మిగులుతున్న పరిస్థితి మన కండ్లముందే ఉంది. దీపపు అడుగుభాగాన చీకటెలాగైతే ఉంటుందో మన దేశ అభివృద్ధిని గమనిస్తే 'అభివృద్ధి' వెలుగులు అందుకునే వాళ్లు పిడికెడు మందయితే, చీకటిలో జీవించే ప్రజలే ఎక్కువగా ఉన్నారనేది నిర్వాసితులైన లక్షల మంది ప్రజలను గమనిస్తే మనకర్థమవుతుంది.

వ్యవసాయరంగంలో ఉత్పత్తిని పెంచడానికి వచ్చిన హరిత విప్లవమైనా, తెగుళ్ల మందుల వాడకంకోసం వచ్చిన యూనియన్ కార్బైడ్ కంపెనీ అయినా జ్ఞానానికున్న పరిమితిని తెలియజేస్తుంది. సాంకేతిక పరిజ్ఞానం మన విశ్వవిద్యాలయాల శాస్త్ర పరిశోధనల నుండి రావాలి. మన దేశ సహజ వనరులు, సాంకేతిక పరిశోధనలు దేశ ప్రజల మౌలిక అవసరాలను తీర్చేవిగా ఉండాలి. అవి ప్రభుత్వ అధీనంలో మాత్రమే ఉండాలి. ప్రభుత్వ సంస్థలు మాత్రమే వాటిని వినియోగించాలి. ఒక వేళ సాంకేతిక పరిజ్ఞానం అవసరార్థం దిగుమతి చేసుకున్నా ఆ తర్వాత ఆ జ్ఞానం స్వతంత్ర అభివృద్ధిని సాధించగలిగినపుడు మాత్రమే ఈ దిగుమతులవల్ల ప్రయోజనముంటుంది. సాంకేతిక పరిజ్ఞానం పట్ల దాన్ని వాడే ప్రజలకు అవగాహన కల్పించాలి. మన దేశంలో విజ్ఞాన శాస్త్రం , విశ్వవిద్యాలయాలు, పరిశోధనలు అన్నీకూడ భూస్వామ్య శక్తులు, బహుళజాతి సంస్థల ఆధిపత్యంలో ఉన్నాయనడానికి భోపాల్ దుర్ఘటన ఒక ఉదాహరణ మాత్రమే.

భూమి కోసం చేసిన, చేస్తున్న పోరాటాల సంగతి అలా ఉంచితే ప్రభుత్వం అభివృద్ధి పేర అనుమతిస్తున్న బహుళజాతి సంస్థలు, ప్రత్యేక ఆర్థిక మండలాలు, ఓపెన్‌కాస్ట్ గనులకు వ్యతిరేకంగా ఉన్న భూమిని రక్షించుకోవడం కోసం పోరాడాల్సిన పరిస్థితి ఏర్పడింది. వీ

లాభాలను మూటగట్టుకుంటూ, నష్టాలను. ప్రమాదాలను ప్రజల నెత్తిన రుద్దుతున్న కార్పొరేట్ కంపెనీలను దారిలో పెట్టడానికి చట్టాలను మరింత పటిష్టం చేయాలంటున్నారు **అరిబండి ప్రసాద్‌రావు**

# భోపాల్ దుర్ఘటన - నేర్వని గుణపాఠాలు

రసాయన పరిశ్రమ చరిత్రలోనే అత్యంత విషాదకర దుర్ఘటన యూనియన్ కార్బైడ్ సంఘటన సస్యరక్షణ మందుల తయారీ కంపెనీలో 3 డిసెంబర్ 1984 రాత్రి భోపాల్‌లో జరిగింది. దీనివల్ల భోపాల్ పట్టణం చుట్టు పక్కల ప్రాంతాలలో ఐదు లక్షలకు పైగా జనాభా మిథైల్ ఐసోసైనేట్ ('మిక్' వాయువు) అనే అత్యంత విషవాయువు దుష్ప్రభావాలకు గురయ్యారు.

అధికారికంగా మూడు వేల ఐదు వందల పైనా, అనధికారికంగా ఎనిమిది నుంచి పదివేల మధ్య ఆ 24 గంటలలో చనిపోయారు. ఆ తరువాత, 25 వేల మంది చనిపోయారు. వార్తల ప్రకారం ఇప్పటికీ దాదాపు 390 టన్నుల విష రసాయనాలు ఫ్యాక్టరీలో ఉన్నాయి. ఎవాపరేషన్ ట్యాంకులకి మళ్లించిన విషపదార్థాలు భూ గర్భజలాలను పెద్ద ఎత్తున కలుషితం చేశాయి. వందకు పైన బోరు బావులు ఈ కాలుష్యం వల్ల నిరుపయోగం అయ్యాయి. ఇప్పటికీ ఫ్యాక్టరీ చుట్టుపట్ల ఐదు కిలోమీటర్ల దూరం వరకు భూ గర్భజలం కాలుష్యమైంది. ఈ కాలుష్యం వాతావరణాన్ని కూడా కలుషితం చేసింది. ఫలితంగా, ప్రజల ఆరోగ్యానికి, ఇతర జీవాల ఆరోగ్యానికి సమస్యల్ని సృష్టించింది.

ఈ ఫ్యాక్టరీ అమెరికాకు చెందిన బహుళజాతి కంపెనీ యూనియన్ కార్బైడ్‌కు చెందింది. భోపాల్ దుర్ఘటనకు ముందు దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం ప్రారంభమైంది. దీనిలో కార్బరిల్ (వాణిజ్య పేరు 'సెవిన్') అనే సస్య రక్షణ మందు తయారీ కోసం ప్రారంభించబడింది. దీనిపై భారతీయుల భాగస్వామ్యంతో 'యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్' అనే పేరుతో మరొక కంపెనీని ప్రారంభించారు. దీనిలో యూనియన్ కార్బైడ్ కంపెనీకి 51 శాతం షేర్లున్నాయి. అందువల్ల, భారత కంపెనీ మంచి, చెడ్డలకు అమెరికన్ యూనియన్ కార్బైడ్ కంపెనీదే బాధ్యత.

దుర్ఘటన తర్వాత అధికార, అనధికార కమిటీలు, నిపుణులు దీనికి గల కారణాలను అధ్యయనం చేశారు. వీటన్నిటి సారాంశం ఒకటే. ఏదో విధంగా ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకొని, గరిష్ట లాభాలను పొందేందుకు యాజమాన్యం ఏకైక లక్ష్యంతో ఏ పద్ధతినైనా అనుసరించడానికి వెనుకాడలేదు. ఉత్పత్తి ఖర్చును తగ్గించడానికి అంతగా విషతుల్యం కాని, ఎక్కువ ఖర్చుతో కూడిన తయారీ పద్ధతిని మార్చి ఎక్కువ విషతుల్యమైన, చవకైన 'మిక్' విషవాయువు పద్ధతిని ప్రవేశ పెట్టింది. డౌ కెమికల్ కంపెనీ ఈ సమయంలో తక్కువ విషతుల్యమైన పద్ధతిని అనుసరించింది. ఫ్యాక్టరీ ప్రారంభించిన పదేళ్ల తరువాత చవకైన మిక్ పద్ధతిని ప్రవేశపెట్టింది. అయితే మిక్ వాయువు నియంత్రణకు అవసరమైన వ్యవస్థను యాజమాన్యం నిర్లక్ష్యం చేసిందని దుర్ఘటన తరువాత చేసిన అధ్యయనాలు బయటపెట్టాయి.

1982లో 'ఫాస్‌జీన్' అనే విషవాయువు లీకైనందు వలన ఇరవై నాలుగు మంది కార్మికులు అస్వస్థతకు గురై, హాస్పిటల్‌లో చేరాల్సి వచ్చింది. పని చేసేటప్పుడు 'రక్షిత మాస్కు'లను పెట్టుకోవాలని యాజమాన్యం కార్మికులకు చెప్పలేదు. మరో నెలలో, మరో పద్దెనిమిది మంది కార్మికులు తిరిగి ఇదే కారణంతో అస్వస్థతకు గురయ్యారు. ఈ మొదటి హెచ్చరికలను దృష్టిలో పెట్టుకొని యాజమాన్యం సురక్షిత చర్యలను పటిష్టపరచాల్సింది. కాని, లాభాల వేటలోనున్న యాజమాన్యం వీటిని నిర్లక్ష్యం చేసింది. దాదాపు మరో ఐదు నెలల తరువాత ఒక ఇంజనీర్ ప్రమాదం ద్వారా ముప్పై శాతం శరీరం కాల్చుకున్నాడు. ఇలాంటి మరో రెండు ప్రమాదాలు ఆ సంవత్సరమే జరిగాయి. అయినా, యాజమాన్యం రక్షణా వ్యవస్థను పటిష్ఠపరచ లేదు.

1983, 84 లలో కూడా మిక్ ప్లాంటు నుండి మిక్ వాయువు, క్లోరిక్, మోనో మిథైల్ అమైన్, ఫాస్‌జీన్, కార్బన్ టెట్రా క్లోరైడ్‌లు లీకయ్యాయి. అయినా, యాజమాన్యం జాగ్రత్త పడలేదు. దుర్ఘటనకు ముందే, కాగల రసాయన ప్రమాదాలను గురించి అంతర్గత శాస్త్రజ్ఞులు యాజమాన్యాన్ని హెచ్చరించారు. కాని యాజమాన్యం ఈ హెచ్చరికలను కూడా సీరియస్‌గా పరిగణించలేదు.

1984 నవంబర్‌లోనే 'సురక్షితానికి' సంబంధించిన వ్యవస్థ సరిగ్గా పనిచేయడం లేదు. ముఖ్యంగా పైపులు, వాల్వులు సరిగ్గా పనిచేయడం లేదు. ఒక్క 610 నెంబర్ ట్యాంక్‌లోనే 42 టన్నుల మిక్ గ్యాస్ నిల్వ ఉంది. ఇది 'సురక్షిత' ప్రమాణం కన్నా చాలా ఎక్కువ. ఈ సమయంలో ప్రషర్ గేజ్ కూడా సరిగ్గా పనిచేయలేదు. డిసెంబర్ 2-3 రాత్రి ఈ ట్యాంక్‌లోకి నీరు పెద్ద ఎత్తున ప్రవేశించింది. ఫలితంగా, జరిగిన రసాయనిక ప్రక్రియ దుర్ఘటనగా బయటపడింది.

డిసెంబర్ 3 రాత్రి 11.30 నిమిషాలకు విష వాయువు దుష్ప్రభావాలను ప్రజలు ఎదుర్కొన్నారు. ఒంటి గంటకు పోలీస్‌లను అలర్ట్ చేశారు. తెల్లవారుజామున నాలుగు గంటలకు లీకయ్యే వాయువును నియంత్రించారు. ఉదయం ఆరు గంటలకు పోలీస్ యంత్రాంగం 'అంతా మామూలుగా ఉంది' అని లౌడ్ స్పీకర్ల ద్వారా ప్రజలకు తెలిపింది.

మొదట ఫ్యాక్టరీ యాజమాన్యం దుర్ఘటనను తీవ్రంగా పరిగణించ లేదు. పై పై చర్యలనే తీసుకొంది. కాని, ప్రజలు, స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పార్టీల ఆందోళనల తర్వాత, మొదట రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, యాజమాన్యం సీరియస్‌గా స్పందించడం మొదలుపెట్టాయి. వివిధ అంతర్జాతీయ సంస్థలు కూడా బాధితులకు సహాయంగా నిలిచాయి. కేంద్ర ప్రభుత్వం బాధితులందరి పక్షాన 'కంపెనీ'పై నష్టపరిహారానికి, పునరావాసానికి 'వ్యాజ్యం' నడపడానికి ఒక ప్రత్యేక చట్టాన్నే తేవాల్సి వచ్చింది. అయినా, బాధుతులకు న్యాయం జరుగలేదు.

1. 25 సంవత్సరాల సుదీర్ఘ పోరాటం తర్వాత కూడా అసలు దోషులు (యూనియన్ కార్బైడ్ యాజమాన్యం) శిక్షించబడలేదు. 2. బాధితులకు సరైన న్యాయమైన నష్టపరిహారం, పునరావాసం లభించలేదు. 3. ఇప్పటికీ దాదాపు ఆరు వేల మంది వైద్యాన్ని పొందాల్సి వస్తోంది. 4. బాధితుల పునరావాసానికి ప్రభుత్వ ఆర్థిక సహాయం ఆగిపోయింది. 5. వేలాది బాధిత విధవలకు, అనాథలకు, వికలాంగులకు పెన్షన్ సౌకర్యం లభించలేదు. 6. ఇప్పటికీ ఫ్యాక్టరీ పరిసర ప్రాంతాల్లో పెద్ద ఎత్తున నిల్వ ఉన్న విషపదార్థాలను తొలగించలేదు. 7. ఫ్యాక్టరీ చుట్టూ ఐదు కిలోమీటర్ల దూరం వరకు పెద్ద ఎత్తున భూగర్భ జలాలు కలుషితం అయ్యాయి. వందలాది బావులు నిరుపయోగం అయ్యాయి. పర్యావరణ పునరావాసం జరగలేదు. దుర్ఘటన గురైన ప్రాంతాలలో సురక్షిత నీటి సరఫరా లేదు. 8. భావితరాలకు జ్ఞాపికగా కనీసం ఒక 'మెమోరియల్'ను నిర్మించలేదు. 9. యూనియన్ కార్బైడ్ కంపెనీ యాజమాన్యంతో భారత ప్రభుత్వం చేసుకున్న సెటిల్‌మెంట్‌లో కేవలం మూడు వేల మంది బాధితులు చనిపోయినట్లు, 1,02,000 మంది బాధపడి, నష్టపోయినట్లు లెక్కలోకి తీసుకొన్నారు. కాని, ఆ తరువాత కోర్టులో చనిపోయిన వారితో సహా 5,70,367 మంది నష్టపోయిన వారికి సంబంధించిన వారుగా గుర్తించాయి. వాస్తవ బాధితుల సంఖ్య సెటిల్‌మెంట్ చేసుకున్న వారికన్నా ఐదు రెట్లకు పైగా ఉంది.

2001లో యూనియన్ కార్బైడ్ కంపెనీని 'డౌ కెమికల్స్' అనే మరొక బహుళజాతి కంపెనీ దాదాపు 10.3 బిలియన్ అమెరికన్ డాలర్లకు కొనేసింది. కొత్త యాజమాన్యం భారత యూనియన్ కార్బైడ్ కంపెనీతో తనకేమీ సంబంధం లేదని, పాత యాజమాన్యమే బాధితుల ఎడల ఉన్న అన్ని బాధ్యతలను పూర్తి చేసిందని చెబుతోంది. ప్రపంచీకరణ మైకంలో పడ్డ భారత ప్రభుత్వం యూనియన్ కార్బైడ్ ఇండియా కంపెనీని 'స్వాధీనం' చేసుకొంది. తద్వారా, కంపెనీ భారాన్ని తన మీదకు (అంటే భారత ప్రజల మీదకు) వాల్చుకుంది. 'లాభాలొస్తే బహుళజాతి కంపెనీ లకు, భారీ నష్టాలు వస్తే భారత ప్రజలకు' అనే దుర్నీతిని, లొంగుబాటు తనాన్ని ప్రభుత్వం చేబట్టింది. విద్యుత్ ఉత్పత్తి కోసం (దివాలా ప్రకటించక ముందు) ఎన్రాన్ భారత కంపెనీని ఇలాగే స్వాధీనం చేసుకొని వేలాది కోట్ల భారాన్ని భారత ప్రజలపై పడేసింది మన ప్రభుత్వం.

ఈ అనుభవాలను నుండి పాలకులు గుణపాఠాలను తీసుకొని, విధానపరమైన మార్పులను, ముఖ్యంగా రక్షణాత్మక చర్యలను చేశారా అంటే, 'లేదని' ఒక్కమాటలో చెప్పొచ్చు. ఇది యాధృచ్ఛికంగా జరిగింది కాదు. ఉద్దేశపూర్వకంగానే 'స్వదేశీ - విదేశీ' పెట్టుబడి మైత్రి కోసం కలిసి ప్రజలను కొల్లగొట్టడం కోసం జరుగుతుందనుకోవాల్సి వస్తోంది.

భోపాల్ గ్యాస్ దుర్ఘటన, ఎన్రాన్ అనుభవాల నేపథ్యంలో భారత ప్రజల ప్రయోజనాలను కాపాడడానికి కింది చర్యలు అత్యవసరం:

1. బహుళజాతి జాతి కంపెనీలు ప్రమాదకరమైన, పర్యావరణ సమస్యలతో కూడిన ఉత్పత్తులను సంబంధిత నియంత్రణ చట్టాలు బలహీనంగా ఉండే అభివృద్ధి చెందుతున్న దేశాలకు తరలిస్తున్నాయి. ఈ దేశాల పాలకుల బలహీనతలను ఉపయోగించుకొని 'సురక్షిత' ప్రమాణాలను ఉన్నతస్థాయిలో పాటించడం లేదు. 'ప్రపంచీకరణ మైకం'లో పడిపోయి, ఎలాగైనా విదేశీ పెట్టుబడులను, పరిశ్రమలను ఆకర్షించాలనే ఏకైక లక్ష్యంతో ఎలాంటి కనీస జాగ్రత్తలు తీసుకోకుండా, సాంకేతికంగా పొంచి ఉన్న ప్రమాదాలను పరిగణనలోకి తీసుకోకుండా బహుళజాతి కంపెనీలను పాలకవర్గం ఆహ్వానిస్తుంది. అవకాశాలను కలిగిస్తోంది. యూనియన్ కార్బైడ్ దుర్ఘటనను, ఎన్రాన్ అనుభవాల దృష్ట్యా, ఇప్పటికైనా దేశంలో పనిచేసే బహుళజాతి కంపెనీలలో ఉన్నత స్థాయి భద్రతా ప్రమాణాలను, నష్టపోయిన సందర్భాలలో ఉన్నత స్థాయి నష్టపరిహారాన్ని, పునరావాసాన్ని కల్పించే బాధ్యతలు ప్రధాన యాజమాన్యమే కలిగి ఉండేలా సమగ్ర చట్టబద్ధమైన చర్యలు తీసుకోవాలి.

2. బహుళజాతి కంపెనీ ప్రధాన కార్యాలయాలు ఏ దేశంలో రిజిస్టర్ అయినప్పటికీ, స్థానిక చట్టాలకు, న్యాయస్థాన నిర్ణయాలకు లోబడి పనిచేసే విధంగా అంగీకరించే కంపెనీలనే మనదేశంలో పనిచేసేందుకు అనుమతినివ్వాలి.

3. న్యాయవ్యవస్థ భోపాల్ గ్యాస్ బాధితులకు న్యాయం కలిగించడంలో, దోషులను శిక్షించడంలో వైఫల్యం చెందింది. న్యాయ వ్యవస్థ దృక్పథంలో, పని విధానంలో గుణాత్మక మార్పు రావాలి. దీనికవసరమైన చట్టబద్ధమైన ఏర్పాటు చేయాలి.

4. విస్తృతమైన ఆరోగ్య సమస్యలను సృష్టించగల బిటి సాంకేతికం లాంటి ప్రక్రియలు, విషంతో కూడిన ఆహార పదార్థాలు నేరుగా సామాన్యులు తినేలా ఉత్పత్తులను మార్కెట్లో విడుదల చేయడానికి పెద్ద ఎత్తున ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీనివల్ల రాగల లేదా వచ్చే దుష్ప్రభావాలను ప్రధాన కంపెనీ యాజమాన్యమే బాధ్యత వహించేలా, నష్టపోయిన సందర్భాలలో కంపెనీ ప్రధాన యాజమాన్యమే బాధ్యత వహించేలా చట్టబద్ధమైన ఏర్పాటు చేయాలి. వీ

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

**- వై. రామచంద్రం (సర్క్యులేషన్ మేనేజర్) 9949 391028**

Email : yatelliram@gmail.com

కార్బైడ్ కంపెనీ మాత్రమే కాదు, వివిధ రంగాలలో నిశ్శబ్దంగా అమలవుతున్న దుర్మార్గమైన విధానాలకు ప్రజా ప్రత్యామ్నాయమే పరిష్కారమంటున్నారు **కె. విజయ్‌కుమార్**

# భోపాల్ దురంతం - ఓ మాయని మచ్చ

భోపాల్ - ఒక అమెరికా కంపెనీ దుర్మార్గం, దురంతం, నిర్లక్ష్యం. మన ప్రభుత్వ చిన్నచూపు, చేతకానితనం, అమ్ముడుపోయిన వైనం. ఇరవైవేల మంది దుర్మరణం. మతఛాందసవాదుల చేతిలో కూడా ఇంతమంది మరణించలేదు.

మరో లక్షా యాభై వేలమంది పిల్లలు, యువత, ముదుసలి వారు - వారూ వీరూ అని లేకుండా ఆ దుర్మార్గానికి బలై ఇరవై ఐదు సంవత్సరాలుగా వేదన అనుభవిస్తున్నారు. ఇంకా మరణిస్తున్నారు.

ఇన్ని వేలమంది మరణానికి కారణమై, లక్షమందికి పైగా నిత్య హింసకి గురిచేసిన యూనియన్ కార్బైడ్ కంపెనీ యాజమాన్యాన్ని మీరేమని పిలుస్తారు? నరహంతకులనా? ఏ మాటలు మీరు వాడతారు? ఏమాత్రం మానవత్వం లేని నరరూప రాక్షసులనా? డబ్బు కోసం ఇంత నీచానికి పాల్పడిన దుర్మార్గులనా?

వాళ్లని మీరైతే ఏం చేస్తారు? కొన్ని దేశాలలో చేసినట్లు నడి బజారులో నిలబెట్టి కాళ్లు చేతులు నరికేస్తారా? ఉరిశిక్ష వేసి అమలు చేస్తారా కంపెనీ ఆస్తుల్ని యాజమాన్య వ్యక్తుల ఆస్తుల్ని జప్తు చేసి, యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తారా? ఏం చేస్తారు?

ఘనత వహించిన మన ప్రభుత్వం హాయిగా అమెరికా పంపించి వేసింది.

భోపాల్ - మన దేశపు పరిశ్రమల చరిత్రలో ఒక మాయని మచ్చగా మిగిలిన ఉదంతం. ఒక బహుళజాతి కంపెనీ నీచత్వం. ఏం జరిగిందసలు?

1984, డిసెంబర్ 2 రాత్రి చలికి ప్రజలంతా రజాయిలతో వేడిని కప్పుకుని ఆదమరిచి నిద్రిస్తున్న వేళ యూనియన్ కార్బైడ్ అనే అమెరికా కంపెనీ ప్రజల మీదికి విషవాయువుని వెదజల్లింది. సైనైడ్ పదార్థం ఏ మాత్రం నాలికకి తగిలినా వెంటనే ప్రాణం పోతుంది. ఆ సైనైడ్‌తో తయారయిన విషవాయువుతో ఆ రాత్రి యూకా (యూనియన్ కార్బైడ్) చుట్టు పక్కల ప్రాంతమంతా నిండిపోయింది. ప్రజలు తప్పించుకోడానికి కూడా సమయమివ్వని దుర్దినం. మెలకువ వచ్చి ఏదో వాయువు తమని కప్పేస్తుందని, తమ ప్రాణం మీదికొచ్చిందని తెలుసుకుని ఉరుకులు పరుగులు తీసేటప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది.

మారణహోమం మొదలయ్యింది. కొంతమంది అక్కడే చనిపోయారు. కొంతమంది ఆస్పత్రులలో చనిపోయారు. కొంతమంది కొంతకాలం బాధ అనుభవించి చనిపోయారు. ఇంకా చనిపోతూనే ఉన్నారు. అంతకంటే పదిరెట్ల మంది వివిధ జబ్బులతో బాధపడుతూ హింసను అనుభవిస్తూ బతుకులీడుస్తున్నారు. ఆ దుర్మార్గాన్ని తలచుకుంటే గుండె మండిపోతుంది. ఆ విషాదం మనసును కలచివేస్తుంది.

ఈ ఫ్యాక్టరీ పొలాలల్లో పంటల్ని నాశనం చేసే చీడ పురుగుల్ని చంపడానికి ఉపయోగించే మందుల్ని తయారుచేసి మన దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ అమ్ముతుంది. అమెరికాలో సైనైడ్ వాడే ఫ్యాక్టరీని అనుమతించరు. కాని మన దయగల ప్రభుత్వాలు (రాజకీయ నాయకులు) అభివృద్ధి పేరుతో ఇతర దేశాలలో నిషేధించిన కంపెనీలని ఇక్కడ పెట్టుకోనిస్తారు. ఇవి వదిలే కాలుష్యం గురించి, దానితో ప్రజలు పడే హింస గురించి ఏ మాత్రం పట్టించుకోరు. మన ఒకప్పటి ప్రధానమంత్రి ఇందిరమ్మ ఒక అంతర్జాతీయ సభలో '(ఈ కంపెనీ విడిచే) కాలుష్యం కంటే పేదరికమే ఎక్కువ కాలుష్యం' అని సెలవిచ్చింది. ఆమె అనుచరులు ఇక ఎలా ఆలోచిస్తారో, ఆచరిస్తారో మనం ఊహించుకోవచ్చు.

మనం ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ప్రపంచంలో పేదవారంటూ ఎవరూ లేరు. పేదవారుగా చేయబడ్డ వారు మాత్రమే ఉన్నారు. ఈ కంపెనీలు ప్రకటనలతో ఊదరగొట్టి తాము తయారు చేసే విష పదార్థాలని రైతులకంటగట్టడం వలన, వీటిని క్రిమి సంహారక మందులుగా మన పొలాలలో విచ్చలవిడిగా చల్లబడ్డాయి. దానితో మన వాతావరణమే మారిపోయింది. మామూలుగా వాతావరణ సమతుల్యం పూర్తిగా దెబ్బతింది. కొందరికి డబ్బులు కూడబెట్టుకోనికి మాత్రమే ఈ ఫ్యాక్టరీలు ఉపయోగపడుతున్నాయి. మన దేశ ప్రజలకి ఈ ఫ్యాక్టరీ నష్టదాయకమే. నాలుగు డబ్బులు చూపించగానే ఊడిగం చేయడానికి తయారయ్యే మన రాజకీయ నాయకులు, ప్రభుత్వ అధికారులే ఈ నేరంలో మొదటి ముద్దాయిలు. భోపాల్ ఒక్క రోజునే ఇంతమంది ప్రాణాలను కోల్పోవడం వలన మనం ఈ మాత్రమైనా స్పందిస్తున్నాం గానీ, మన పక్కనే ఉన్న పటాన్‌చెరులో రసాయనిక పరిశ్రమలు సంవత్సరాల తరబడి చేసిన దుర్మార్గం వలన రైతులు జబ్బుల పాలయ్యారు. పొలాలు, నీరు పూర్తిగా కలుషితమయ్యాయి. పశువుల్ని పోగొట్టుకున్నారు. ఈ పరిశ్రమల కాలుష్యం చాప కింద నీరులా చేరి, మెల్లమెల్లగా ఎంతోమంది మరణానికి కారణమైంది. డబ్బు కూడబెట్టు కోవడమే లక్ష్యంగా, నిర్లక్ష్యంగా రసాయన వాయువుల్ని, జలాల్ని విషపూరిత ఘన పదార్థాలని ప్రజలపైకి వదిలి, తమ పబ్బం

గడుపుకున్నాయి. ఇప్పుడు అవి మూత పడినా ప్రజల ప్రాణాన్ని, ఆరోగ్యాన్ని, ఆదాయ వనరుల్ని తిరిగి ఇవ్వలేవు. మన ప్రభుత్వాలు (రాజకీయ నాయకులు, అధికారులు) కూడా వాళ్లతో కుమ్మక్కై ప్రజలకి ద్రోహం చేశాయి. ఈ రోజు మనకి తెలుసు, బహుళజాతి కంపెనీలు, వాటికి ముడిపదార్థాలని, కొంత తయారైన పదార్థాలని (ఇంటర్మీడియట్స్) వాటికి సరఫరా చేసే దేశీయ కంపెనీలు ఉత్పత్తి చేసే ఎన్నో పదార్థాలు, మందులు ప్రజలకి అవసరం లేనివే. అయితే లేనిపోని అవసరాన్ని కల్పించి, భ్రమపెట్టి, మానవ బలహీనతల్ని ఆధారం చేసుకుని, ఆ ఉత్పత్తుల్ని ప్రజల మీద వదులుతున్నారు. డబ్బు కక్కుర్తి కోసం ఈ పనులు చేస్తున్నారు. కోకాకోలా లాంటి పానీయాల వల్ల ఉపయోగం ఏమిటి? ఈ రోజున పెద్ద ఎత్తున ప్రచారాలతో యువతని ఆకట్టుకొని అమ్మే క్రీములు, స్ప్రేలు తదితర పదార్థాల అవసరం ఎంత? మందుల కంపెనీలు తయారు చేసే వాటిలో నిజంగా మనకి అవసరమైనవి ఎన్ని? సారాయి తాగడం, పొగతాగడం ఆరోగ్యానికి హానికరమంటూనే, వాటిని ఎవరికోసం, ఎందుకోసం ఉత్పత్తి చేస్తున్నట్లు? ఇటువంటి ఎన్నో అవసరం లేని పదార్థాలలో, యూనియన్ కార్బైడ్ చేసే మందులు కూడా ఉన్నాయి. ఏ మాత్రం అవసరం లేని ఈ కంపెనీ ఎంతమందిని ప్రత్యక్షంగా పొట్టనబెట్టుకున్నదో మనం చూశాం. కొన్ని కంపెనీలు మనం తెలుసుకునే వీలు లేని పద్ధతిలో ప్రాణాల్ని హరిస్తున్నాయి.

పర్యావరణ చట్టాన్ని ఎంతగా దుర్వినియోగం చేస్తున్నారో మనం చూస్తున్నాం. ప్రజల పక్షాన నిలువవలసిన అధికారులు ప్రజలకి వ్యతిరేకంగా కంపెనీల తరపున నిలబడడం, బహిరంగ విచారణల్ని ఎంత తమాషాగా నిర్వహిస్తున్నారో మనం చూస్తున్నాం. చట్టం ప్రకారం కాలుష్య నివారణకు ఏఏ పద్ధతులు అవలంబిస్తారో, ఎలా నిరోధిస్తారో, కంపెనీలు అనుమతి పొందేముందే కాలుష్య నివారణ సంస్థకి సమర్పించాలి. కాని వాళ్లు సమర్పించే దరఖాస్తులో గాని, దానికి జతచేసే రిపోర్టులో కాని ఆ వివరాలేమీ ఉండవు. అయినా అనుమతులొస్తాయి.

భోపాల్ విషయంలో ప్రభుత్వం ఏం చేసింది? సంఘటన జరిగిన నాలుగు రోజుల తర్వాత డిసెంబర్ 7న కంపెనీ యజమాని ఆండర్సన్‌ని అరెస్టు చేసి బెయిల్ పై విడుదల చేసింది. మూడు సంవత్సరాల తర్వాత సిబిఐ అతనిపైన, మరో పదకొండు మందిపైన చార్జిషీట్ దాఖలు చేసింది. ఈలోపు ఆండర్సన్ అమెరికాకి జారుకున్నాడు. ప్రభుత్వం ఆపదలచుకుంటే ఆంక్షలు విధించి, పాస్‌పోర్ట్ జప్తు చేయవలసింది. బెయిల్ రద్దు చేసి జ్యుడిషియల్ కస్టడీకి అప్పగించాల్సింది. కేసు తేలేదాకా దేశం వదిలి వెళ్లకుండా కట్టడి చేయవలసింది. కాని మన ప్రభుత్వం అతనిని అమెరికా వెళ్లనిచ్చింది. బాధితులు, వారి తరపున నిలబడ్డవాళ్లు నిలదీస్తే, కొన్ని సంవత్సరాల వ్యవధి తర్వాత తూతూ మంత్రంగా ఆండర్సన్‌ని అప్పగించమని అమెరికాని కోరింది. అమెరికా, తన సహజ ధోరణిలో, ఎగతాళిగా నవ్వి ఊరుకుంది. అప్పటినుండి ఇప్పటి వరకు మన ప్రధానమంత్రులూ, ఎంతోమంది మంత్రులు అమెరికా దొరగారి దర్శనం చేసుకున్నారు. వారినిక్కడికి ఆహ్వానించి ఎర్రతివాచీ పరిచి నెత్తి కెత్తుకున్నారు. కాని ఆండర్సన్ విషయంలో పెదవి కదల్చలేక పోయారు. ఇంకా ఎంతో మంది ఆండర్సన్‌లు మన దేశ సంపదని దోచుకోకుండా అడ్డుకుంటున్నారని అమెరికా నక్సలైట్లని ఆతంక వాదులుగా ప్రకటించింది. సామంతగిరీ వెలగబెడుతున్న మన్మోహన్ గారు వెంటనే సిపిఐ (మావోయిస్ట్) ని నిషేధించి, వాళ్లపై యుద్ధం ప్రకటించాడు. ఆండర్సన్‌ల దోపిడీకి దారి సుగమం చేయడానికి మావోయిస్టుల మీదకి కోబ్రాలనబడే ప్రత్యేక హంతక ముఠాని తయారు చేసి వదిలింది.

ఇప్పటికే యూనియన్ కార్బైడ్ బాధితులకి సంపూర్ణ ఆరోగ్యాన్ని అందించడానికి గాని, వాళ్ల అవసరాలు తీర్చడానికి గాని, కనీస అవసరాలు తీరే విధంగా డబ్బు ఇవ్వడం గాని, ఇప్పించడం గాని చేయలేకపోతుంది. అందువలన ఈ రాజకీయ నాయకులు ఎవరి పక్షమో మనకి తెలుస్తూనే ఉంది. దోపిడీదారులకి, దుర్మార్గులకి, అక్రమాసురుల అడుగులకి మన రాజకీయ నాయకులు, అధికారులు ఎలా మడుగులొత్తు తున్నారో మనకర్థమవుతూనే ఉంది.

పోలీసులు డిసెంబర్ 4న ఎఫ్ఐఆర్ తయారు చేసి. 7న ఆండర్సన్‌ను అరెస్ట్ చేశారు. కాని వెంటనే బెయిల్‌పై విడుదల చేశారు. మూడు సంవత్సరాల తర్వాత, డిసెంబర్ 1, 1987న సిబిఐ ఆండర్సన్‌తో సహా పదకొండు మందిపై చార్జిషీట్ దాఖలు చేసింది. సంవత్సరన్నర తర్వాత కోర్టు ఆండర్సన్‌పై నాన్-బెయిలబుల్ వారెంట్ జారీ చేసింది. కాని అప్పటికే ప్రభుత్వం అతను దేశం వదిలి వెళ్లేలా అనుమతించింది.

ఫిబ్రవరి '89లో కంపెనీ 470 మిలియన్ డాలర్లు కాంపెన్సేషన్ ఇస్తాననగానే మన ప్రభుత్వం కేసులు రద్దు చేసింది. దీనితో కోపగించిన బాధితులు కోర్టులో పిటీషన్లు వేశారు. రెండున్నర సంవత్సరాల తర్వాత, ఈ పిటీషన్లకి జవాబుగా సుప్రీంకోర్టు యూనియన్ కార్బైడ్ పై క్రిమినల్ కేసులన్నిటినీ పునరుద్ధరించింది. దానితో 1991 నవంబర్‌లో భోపాల్ కోర్టు కూడా యూనియన్ కార్బైడ్ యాజమాన్యంపై కేసులు పునరుద్ధరించింది. మే 2002లో సిబిఐ ఆండర్సన్‌పై కేసుల్ని సవరించాల్సిందిగా (తీవ్రత తగ్గించాల్సిందిగా) కోర్టుని కోరింది. ఆగస్ట్ 2002లో కేసుల్ని ఏమాత్రం మార్పు చేయడానికి వీలులేదని, ఆండర్సన్‌ని వెంటనే ఇండియా రప్పించాలని కోర్టు ఆదేశాలు జారీ చేసింది. తాజాగా 30 జూలై, 2009న భోపాల్ కోర్టు ఆండర్సన్‌ని అరెస్ట్ చేయాల్సిందిగా సిబిఐని ఆదేశించింది.

ప్రభుత్వం కోర్టు ఆదేశాల్ని పెద్దగా పట్టించుకున్నట్లు లేదు. మన రాజకీయ నాయకులకి కనీసం చీమకుట్టినట్లయినా లేదు. కోర్టు పదే పదే ఆదేశాలిస్తున్నా ప్రభుత్వ చర్యలు నామమాత్రంగానే ఉన్నాయి. బాధితుల పరిహారానికి సంబంధించి రిజర్వ్‌బ్యాంకులో 1500 కోట్ల రూపాయలు జమయినా ప్రభుత్వం బాధితులకందించడానికి సరైన చర్యలు తీసుకోలేదు. చివరికి ఈ ఉదంతం జరిగిన ఇరవై సంవత్సరాల తర్వాత ఆ డబ్బు బాధితులకి పంచమని రిజర్వ్ బ్యాంక్ ఆదేశాలు జారీ చేయవలసి వచ్చింది.

ఇంతగా యూనియన్ కార్బైడ్ యాజమాన్యం బాధ్యతారాహిత్యం తెలిసినా, అమెరికా పారిపోయి తప్పించుకు తిరుగుతున్న కంపెనీని డౌ కెమికల్స్ లిమిటెడ్ అనే మరో కంపెనీకి అమ్ముకోవడానికి అనుమతిచ్చింది. ఇప్పుడా డౌ కంపెనీ ఈ సంఘటన నా హయాంలో జరగలేదు కాబట్టి నాకెటువంటి బాధ్యతా లేదని, ఇప్పటికీ భోపాల్ ఫ్యాక్టరీలో ఉన్న కాలుష్య పదార్థాలని శుభ్రం చేయవలసిన బాధ్యత

**విత్తనాలు, ఎరువులు, పురుగు మందులతో సహా వ్యవసాయానికి అవసరమయ్యే ఉత్పాదకాలపై బహుళజాతి సంస్థలు గుత్తాధిపత్యం నెరపడమే కాక, వ్యవసాయ సంక్షోభానికి కారణమవుతున్నాయంటున్నారు కె.ఆర్.చౌదరి**

# బహుళజాతి కంపెనీలు - వ్యవసాయ రంగం

ఏదో ఒక దేశంలో, ప్రధానంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద పాశ్చాత్య దేశాల్లో, హెడ్‌క్వార్టర్స్ పెట్టుకుని పలు దేశాల్లో తమ శాఖలను నెలకొల్పి, వ్యాపార, వాణిజ్య, పారిశ్రామిక తదితర ఆర్థిక కార్యక్రమాలను బహుళజాతి కంపెనీలు నిర్వహించుకుంటున్నాయి. కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలు కూడా బహుళజాతి కంపెనీల ద్వారా వివిధ దేశాల్లో లావాదేవీలు కలిగి ఉన్నాయి. కాని, అవి వేళ్ల పై లెక్కించదగ్గవి. 90 శాతం బహుళజాతి కంపెనీలు సామ్రాజ్యవాద దేశాలకు సంబంధించినవే. ఆ దేశాలు తమ బహుళజాతి కంపెనీలకు అన్ని విధాలా తోడ్పాటును, మద్దతును అందిస్తున్నాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలను బహుళజాతి కంపెనీలు అనేక రూపాల్లో దోపిడీ చేస్తున్నాయి. ప్రకృతి వనరులను కొల్లగొట్టుతున్నాయి. ప్రజలను ఆర్థికంగా దోపిడీ చేస్తున్నాయి. సామాజిక విలువలను, ప్రజా సంస్కృతిని అధోగతి పాలుచేస్తున్నాయి. పర్యావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. ప్రజల జీవితాలను, ఆరోగ్యాల్ని దెబ్బతీస్తున్నాయి. వందలాది మంది ప్రజల ప్రాణాలను బహుళజాతి కంపెనీలు హరించి వేస్తున్నాయి. బతికి బయటపడ్డ వారి జీవితాలను నరకప్రాయం చేస్తున్నాయి. బహుళజాతి కంపెనీల చరిత్ర అత్యంత క్రూరమైనదని చెప్పడానికి అనేక రుజువులున్నాయి. లాభాలే పరమావధిగా బహుళజాతి కంపెనీలు పనిచేస్తాయి. దోపిడీ ద్వారా కొల్లగొట్టిన సంపదను తమ దేశాలకు తరలించుకుని పోతాయి. ఆయా దేశాల ఆర్థికాభివృద్ధికి ఇవి సోపానాలుగా వాడుకుంటున్నాయి. కొన్ని పేదదేశాల బడ్జెట్ల కన్నా, జిడిపిల కన్నా కొన్ని బహుళజాతి కంపెనీల ఆర్థికపరిస్థితి, సామర్థ్యం అధికంగా ఉంది.

---

నాది కాదని చేతులు దులిపేసుకుంది. ప్రభుత్వం ప్రజలకి వ్యతిరేకంగా, యూనియన్ కార్బైడ్‌కి మద్దతుగా నిలబడుతుందటానికి ఇంతకంటే నిదర్శనం అక్కరలేదు.

ఇంతవరకు బాధితులకి న్యాయం చేయడం గానీ, సరైన పరిహారం ఇప్పించడం గానీ, ఆరోగ్య సదుపాయాలు కల్పించడం గానీ, దోషుల్ని శిక్షించడం గానీ చేయని ప్రభుత్వం, జ్ఞాపక చిహ్నాలని నిర్మిస్తాననడం గర్హనీయం. అవి ప్రజలే నిర్మించుకోవాలి. పుండు మీద కారం చల్లినట్లుగా, ఆండర్సన్‌ని అప్పగించను, శిక్షించను అన్న అమెరికా, భోపాల్ దురంతం 25 సంవత్సరాల కార్యక్రమానికి హాజరవుతానంటోంది. ఈ అమెరికా వైఖరిని ఖండించడమే గాదు, డిసెంబర్ 3న జరిగే కార్యక్రమంలో అమెరికా పాల్గొనడాన్ని వ్యతిరేకించాలి, ప్రతిఘటించాలి.

ఈ విదేశీ పెట్టుబడిదారులు ఇంత బాధ్యతారహితంగా, దుర్మార్గంగా ప్రవర్తిస్తుంటే, మన ప్రస్తుత ప్రభుత్వం ఇప్పుడు ఇంకా కాలేజీలు, యూనివర్సిటీలు పెట్టమని వాళ్లని బతిమలాడుతోంది. వాళ్లకి సకల సదుపాయాలు కల్పించడానికి సిద్ధమౌతోంది. ఈ విదేశీ వ్యక్తులపై కనీస నియంత్రణని కూడా అమలు పరచలేని ప్రభుత్వం వాళ్ల దోపిడీ నిరాటకంగా సాగేందుకు కార్మిక చట్టాలతో సహా అన్ని చట్టాలని మారుస్తోంది.

ఇంత దుర్మార్గంగా బహుళజాతి కంపెనీలు వాటి యాజమాన్యాలు, వారి దేశాల ప్రభుత్వాలు ఇంత బాధ్యతా రహితంగా, దుర్మార్గంగా, ద్రోహపూరితంగా ప్రవర్తిస్తుంటే, మనం ఈ కంపెనీలని ఎందుకు ఆహ్వానిస్తున్నాం? వేల కోట్ల రూపాయలు రాయితీల రూపంలో బంగారు పళ్లెంలో పెట్టి మరీ ఎందుకు సమర్పించుకుంటున్నాం? ఆటోమొబైల్ రంగం కావచ్చు, ఎలెక్ట్రానిక్ వస్తువులు కావచ్చు, సిటీ బ్యాంక్ లాంటి బ్యాంక్‌లు కావచ్చు, బీమా సంస్థలు కావచ్చు, రసాయనిక పరిశ్రమలు కావచ్చు, సాఫ్ట్‌వేర్ కంపెనీలు కావచ్చు, మలేషియా సలీం లాంటి రియల్ ఎస్టేట్ వ్యాపారులు కావచ్చు, కన్‌స్ట్రక్షన్ కంపెనీలు కావచ్చు, ఏవైనా, ఎవరైనా మనకి మేలు చేయడానికి రారు. వాళ్ల దేశాలలో వీలు కాని పద్ధతులలో, అక్కడ రానంత సొమ్ము ఇక్కడ రాబట్టుకోవగలమనే వస్తారు. ఎందుకు వీళ్లని రానివ్వడం? మనకి వనరులు లేకనా? నిపుణులు లేకనా? కాదు, దేశం పట్ల, ప్రజల పట్ల నిబద్ధత, నిజాయితీ లేని రాజకీయ నాయకులు స్వలాభాపేక్షతో ఈ పనికి పాల్పడుతున్నారు. అన్నీ ఉండి అల్లుని నోట్లో శని అన్నట్లు, మన రైతుల్ని పదే పదే పేదరికంలోకి నెట్టుతూ, విదేశీ, స్వదేశీ వ్యాపారులకి మూటలుకట్టి అందిస్తున్నారు.

ఇటువంటి రాజకీయ వ్యవస్థ ఉన్న దేశంలో ప్రజలకు మేలు జరుగుతుందా? నిజమైన ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుందా? భోపాల్ బాధితులకు న్యాయం లభిస్తుందా? లేదు అనే గత ఇరవై ఐదు సంవత్సరాల భోపాల్ చరిత్ర చెబుతోంది. వీళ్లకి న్యాయం జరగాలంటే దేశంలో నిజంగా ప్రజాస్వామ్యం ఏర్పడాలంటే జనతన సర్కార్ ఏర్పడాలేమో. అదే మార్గమేమో ఆలోచించండి. వీ

బహుళజాతి కంపెనీలకు వత్తాసుగా సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాలు పనిచేస్తున్నాయి. నయానో, భయానో, అదరించో, బెదిరించో ఈ ప్రభుత్వాలు పేదదేశాల ప్రభుత్వాలను లొంగదీసుకుంటున్నాయి. ప్రలోభాల ద్వారా, మోసపూరిత వాగ్దానాలు, చర్యల ద్వారా కూడా పేద దేశాల ప్రభుత్వాలను ప్రభావితం చేస్తున్నాయి.

బహుళజాతి కంపెనీలు, పేదదేశాలకు విదేశీ పెట్టుబడులు భారీగా తరలించి, ఆ దేశాల్లో పరిశ్రమలను స్థాపించి, ఉపాధి సౌకర్యాలు పెంచి, ప్రజల అభివృద్ధికి తోడ్పతాయని సామ్రాజ్యవాద దేశాలు నమ్మబలుకుతున్నాయి. వాస్తవంలో ఇది జరగలేదు. మనదేశంలోకి విదేశీ పెట్టుబడులు భారీ స్థాయిలో వస్తున్నాయని ప్రభుత్వం గొప్పలు చెప్పుకుంటోంది. కానీ, వచ్చినవి ద్రవ్య పెట్టుబడులు. ఉత్పత్తి పెంచడానికో, పరిశ్రమలను స్థాపించడానికో, ఉపాధి సౌకర్యాలు పెంచడానికో ఈ పెట్టుబడులు ఉపయోగపడలేదు. కంపెనీల వాటాలను కొనడానికో, స్టాక్ మార్కెట్లో వ్యాపారం చేయడానికో, సట్టా వ్యాపారం చేయడానికో ఈ పెట్టుబడులను బహుళజాతి కంపెనీలు ఉపయోగించు కుంటున్నాయి. అంతేకాదు, ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రంగాలు కూడా బహుళజాతి కంపెనీల అధీనంలోకి వెళ్లిపోతున్నాయి.

బహుళజాతి కంపెనీల కార్యకలాపాల విస్తరణకు విశేషంగా దోహదపడేవి ఆర్థిక సంస్కరణలు. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలు సామ్రాజ్యవాద శక్తుల ఆదేశాల మేరకే మన దేశంలో అమలవుతున్నాయి. అంతర్జాతీయ ద్రవ్య నిధి, ప్రపంచ బ్యాంక్, ప్రపంచ వాణిజ్య సంస్థ మొదలైన అంతర్జాతీయ సంస్థలు బహుళజాతి కంపెనీలకు వత్తాసుగా అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాల పై ఒత్తిడి తెచ్చి, ఆర్థిక సంస్కరణల అమలును వేగవంతం చేస్తున్నాయి. అందుచేత, మనదేశంలోకి బహుళజాతి కంపెనీలు చొచ్చుకొని వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. వీటి ప్రభావం అన్ని రంగాలపైన పడింది. వ్యవసాయ రంగంపై వీటి దుష్ప్రభావం అధికంగా ఉంది.

వ్యవసాయ రంగం సంక్షోభంలో కూరుకుని పోయింది. రైతాంగం జీవితాలు అతలాకుతలమయ్యాయి. రైతాంగ వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. ఈ దుస్థితికి అనేక కారణాలున్నప్పటికీ, బహుళజాతి కంపెనీలు మూల కారణంగా గుర్తించడం జరిగింది.

బహుళజాతి కంపెనీలు ప్రధానంగా నాలుగు విధానాల ద్వారా మన వ్యవసాయరంగాన్ని బలహీనం చేస్తున్నాయి. మొదటిది, ఆర్థిక విధానాలు. రెండోది, చట్టపరమైన విధానాలు. మూడోది, సాంకేతిక పరమైన విధానాలు. నాలుగోది వాణిజ్య విధానాలు.

సరళీకరణ, ప్రపంచీకరణ విధానాల ద్వారా మన దేశంలో ప్రకృతి వనరులపై బహుళజాతి సంస్థలు ఆధిపత్యాన్ని పొందుతున్నాయి.

బహుళజాతి కంపెనీలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పైన తీవ్రమైన ఒత్తిడి తెచ్చి, తమ కార్యకలాపాలకు భూమిని పొందుతున్నాయి. విత్తనోత్పత్తి, సుగంధ, వనమూలికలు, ప్లాంటేషన్ మొక్కల సాగు, బయోటెక్ పార్కులు, బిజినెస్ స్కూళ్లు, పర్యాటక పార్కులు, క్లబ్బులు, హోటళ్లు, పరిశ్రమల స్థాపన మొదలైన వాటి కోసం భూమిని పొందుతున్నాయి. స్వదేశీ కంపెనీలతో కలిసి భూమిని వాడుకుంటు న్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలాల ద్వారా భూమిని కబళించి వేస్తున్నాయి. కార్పొరేట్ సేద్యం, కాంట్రాక్ట్ సేద్యం ద్వారా భూమిపైన బహుళజాతి కంపెనీలు ఆధిపత్యం పొందుతున్నాయి. ఇప్పటికీ ఐదు శాతం సాగులో ఉన్న భూమి విదేశీ కంపెనీల ఆధిపత్యం లోకి వెళ్లిందనే నివేదిక లున్నాయి. రైతులు తమ భూముల నుండి బేదఖలు అవుతున్నారు. కంపెనీ సేద్యం వల్ల భూకేంద్రీకరణ పెరుగుతోంది. భూ పంపకాల సామాజిక న్యాయం పొందడానికి వీలు ఉండదు. ప్రజలు ఉపాధి కోల్పోతారు. ఆహార సమస్య తీవ్రమవుతోంది. కాంట్రాక్ట్ సేద్యం కంపెనీలకే లాభం. రైతులు నష్టపోతారు. వ్యవసాయం దెబ్బతింటోంది.

దాదాపు మూడు లక్షల కోట్ల రూపాయలు ఖర్చుగల ప్రాజెక్టులను బహుళజాతి కంపెనీలు నేరుగానో, దేశీయ కంపెనీలతో కలిసి గానీ చేపడుతున్నాయి. పెప్సికోలా, కోకాకోలా కంపెనీలు తాగునీరు, శీతల పానీయాల వ్యాపారంలోకి ప్రవేశించి, మన జలవనరులను దోపిడీ చేస్తున్నాయి. నీటిని ప్రైవేటీకరించడానికి రంగం సిద్ధమయింది.

లక్షలాది మంది ఆదివాసులకు జీవనాధారం అడవులే. కలప, గుజ్జు, జీవ వైవిధ్యం, తదితర వాటి కొరకు విదేశీ కంపెనీలు అడవులపై ఆధిపత్యాన్ని పొందుతున్నాయి. అందువల్ల ఆదివాసులు జీవనోపాధి కోల్పోతున్నారు.

ఖనిజ సంపద కోసం అడవులను, సాగు భూములను విదేశీ, స్వదేశీ కంపెనీలు నాశనం చేస్తున్నాయి. పోస్కో, వేదాంత లాంటి కంపెనీలు ఖనిజ సంపద కోసం వేటాడుతున్నాయి. ఆదివాసులు వీరి ఆగడాలను ప్రతిఘటిస్తున్నారు. వారి భూముల్ని, జీవనాధారాన్ని హరించే ప్రయత్నాలను అడ్డుకుంటున్నారు. 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' ను పూర్తిగా వదులుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఒత్తిడి తెచ్చి, బహుళజాతి కంపెనీలు, కొత్త చట్టాలను చేయించి, పాత చట్టాలకు సవరణలు చేసింది. ఇవి మేధో సంపత్తి హక్కులు (ముఖ్యంగా పేటెంట్ హక్కులు), విద్యుత్ రంగంలో చట్టాలు, నీటి యాజమాన్యానికి సంబంధించినవి, వ్యవసాయ మార్కెట్ కమిటీ చట్టం (ప్రైవేట్ మార్కెట్లు), ఎగుమతి పంపకాలు, కార్పొరేట్ సేద్యం మొదలైన చట్టాలు, లేదా సవరణలు బహుళజాతి కంపెనీలకు అనుకూలంగా, మన రైతాంగానికి వ్యతిరేకంగా పని చేసేవే, రైతుల హక్కులు హరించేవే.

వలస దేశాలను దోపిడీ చేసిన సంపదను ఉపయోగించుకొని సామ్రాజ్యవాద దేశాలు శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాన్ని బాగా అభివృద్ధి చేసుకున్నాయి. ఆ విజ్ఞానాన్ని ఉపయోగించుకొని అభివృద్ధి చెందుతున్న దేశ ప్రజల్ని దోచుకుని, ఆ దేశాలపై పెత్తనం చేస్తూ, వాటిని అణచి వేసి తమ గుప్పెట్లో పెట్టుకుంటున్నాయి.

నిజానికి మన దేశంలో వ్యవసాయ రంగానికి సంబంధించి అపారమైన సాంప్రదాయ విజ్ఞానం, సేద్య పద్ధతులుండేవి ఈ విజ్ఞానం, సేద్య పద్ధతుల ద్వారా జరిగే వ్యవసాయంలో ఉత్పత్తి ఖర్చులు కనిష్టంగా ఉండేవి. పర్యావరణానికి అనుకూలంగా ఉండేవి. రైతుకు 'రిస్క్' తక్కువగా

ఉండేది. ఈ విధానం ద్వారా అనేక పంటలు లేదా మిశ్రమ వ్యవసాయ పద్ధతులుండేవి. తమకు అవసరమైన విత్తనాలను, సేంద్రీయ ఎరువులను, పురుగు మందులు రైతులే తయారు చేసుకొనేవారు.

సామ్రాజ్యవాద దేశాల నుండి దిగుమతి అయిన నూతన వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానం మన సాంప్రదాయ పద్ధతులను పూర్తిగా తొక్కివేసింది. ఏ సాంకేతిక పరిజ్ఞానమైనా మానవుని విముక్తి చేసేదిగా ఉండాలి. కానీ ఈ విజ్ఞానం మానవుని బానిసగా మార్చివేసింది. నూతన సాంకేతిక పరిజ్ఞానం పునాదిగా గల వ్యవసాయంలో సాంకేతిక విజ్ఞానంతో పాటు ఉత్పాదకాలను మార్కెట్లో కొనే పరిస్థితి ఏర్పడింది. విదేశీ కంపెనీల సాంకేతికంలో స్థిరత్వం లేదు. 'రిస్క్' ఎక్కువ. అయినప్పటికీ విదేశీ కంపెనీలు సాంకేతిక విజ్ఞానాన్ని తమ గుప్పెట్లో పెట్టుకుని పేద దేశాల వ్యవసాయాన్ని శాసిస్తున్నాయి. తమ లాభాల కొరకు పేద దేశాల రైతాంగాన్ని దోపిడీ, పీడనలకు గురిచేస్తున్నాయి.

జీవశాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం (బయోటెక్నాలజీ) బహుళజాతి కంపెనీల చేతుల్లో ఉంది. ఇది అత్యంత ప్రమాదకరం. జన్యు శాస్త్ర పరిజ్ఞాన ప్రమాదాలను ప్రజలు గుర్తిస్తున్నారు. ప్రజల జీవితాలకు అభద్రత కలిగిస్తోంది. జన్యుమార్పిడి పంటలు జీవ వైవిధ్యాన్ని నాశనం చేస్తాయి. జన్యు స్వచ్ఛతను కలుషితం చేస్తాయి. విదేశీ విత్తన కంపెనీలు అమ్మకం చేసే విత్తనాలు ప్రతి సంవత్సరం కొనాల్సిందే. ఈ విత్తనాలకు పునరుత్పత్తి సామర్థ్యం ఉండదు. విత్తనాల ధరలు ఎన్నోరెట్లు పెరిగాయి. జన్యుమార్పిడి పంటల ద్వారా నేల, నీరు, గాలి, పర్యావరణం కలుషితం అవుతోంది. ఆహార భద్రత, ఆరోగ్య భద్రతలు దెబ్బతింటాయి. విదేషీ కంపెనీలపై ఆధారపడడం పెరుగుతుంది. దేశ స్వావలంబన సాధ్యపడదు.

జన్యుమార్పిడి పంటల్లో 96 శాతం మోన్‌శాంటో కంపెనీ తయారు చేసినవే. బిటి పరిజ్ఞానం, టర్మినేటర్ సాంకేతిక పరిజ్ఞానం, రౌండ్ అఫ్ సాంకేతిక పరిజ్ఞానాన్ని మోన్‌శాంటో తయారు చేసింది. ఈ మూడు రకలా పరిజ్ఞానం ఖర్చుతో కూడుకున్నది. రైతు భరించలేడు. కొంటే అప్పుల పాలవుతున్నాడు. కంపెనీ కోట్లాది రూపాయలు లాభం పొందుతోంది. రైతులు నష్టపోయి, అప్పుల పాలయి, ఆత్మహత్యలకు గురవుతున్నారు.

విత్తనాలు, వ్యవసాయ రసాయనాల మార్కెట్‌పై గుత్తాధిపత్యాన్ని విదేశీ కంపెనీలు సాధించి, మన రైతాంగాన్ని కొల్లగొట్టుతున్నాయి. విదేశీ కంపెనీల విత్తనాల ధరలు ఎన్నో రెట్లు ఎక్కువగా ఉన్నాయి. నాణ్యత కూడా లేదు. దేశీయ కంపెనీలు మూతపడుతున్నాయి. ప్రత్యామ్నాయం లేక విదేశీ కంపెనీల విత్తనాల పైనే రైతులు ఆధార పడుతున్నారు. విదేశీ కంపెనీలు ఇప్పటికే విత్తన ఉత్పత్తి, వ్యాపారాల్లో 30 శాతం వాటా దక్కించుకొన్నాయి. రసాయనిక ఎరువుల్లో 100 శాతం పోటాష్, 90 శాతం భాస్వరాన్ని దిగుమతి చేసుకొంటున్నాం. ఇక పురుగు మందుల్లో 80-90 శాతం విదేశీ కంపెనీల చేతుల్లోనే ఉంది. ఇవి నకిలీ, కల్తీ ఉత్పాదకాలే. వీటి ధర ఎక్కువ అయినందు వల్ల రైతులు నష్టపోతున్నారు. కల్తీ, నకిలీ ఉత్పాదకాలు వాడినందు వల్ల పంటలు నష్టపోయి, ఆదాయాలు పొందలేక ఎందరో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కొన్ని పురుగు మందుల ధరలు రు.10,000 నుండి 15,000 (ఒక్క లీటరుకు) ఉన్నాయని చెబుతున్నారు.

ఉత్పత్తి ఖర్చులు ఇందుమూలంగా విపరీతంగా పెరిగి, రైతులు వీటిని కొనడానికి అప్పులు తీసుకొంటున్నారు. వ్యవసాయం గిట్టక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఉత్పాదకాల వ్యాపారం 90 శాతం ప్రైవేట్ రంగంలోనే ఉంది. విదేశీ కంపెనీలు విత్తనాల్లో 30 శాతం, ఎరువుల్లో 60 శాతం, పురుగు మందుల వ్యాపారంలో 90 శాతం వాటా కలిగి ఉన్నాయి. రైతులకు సబ్సిడీలతో తక్కువ ధరకు ఉత్పాదకాలు అందించినప్పుడే వ్యవసాయం లాభసాటిగా ఉండడానికి అవకాశం ఉంది.

ఎగుమతులు తగ్గుతున్నాయి. ఎగుమతులు పెంచడానికి ప్రపంచ వాణిజ్య సంస్థ ఏ విధంగానూ సహాయపడలేదు. వ్యవసాయోత్పత్తుల దిగుమతుల ప్రవాహం నిరాటంకంగా సాగుతోంది. దిగుమతులపై నిషేధం ఎత్తివేశారు. దిగుమతి సుంకాలు తగ్గించారు. వంట నూనెలు, పత్తి, చక్కెర, పప్పులు, పాలు, పాల ఉత్పత్తులు, పళ్లు దిగుమతి అవుతున్నాయి. ఎగుమతి, దిగుమతులను విదేశీ కంపెనీలే శాసిస్తున్నాయి. రైతులు దోపిడీకి గురవుతున్నారు.

విదేశీ బహుళజాతి కంపెనీలు తమ వ్యాపారం ద్వారానే కాక విధానాలను ప్రభావితం చేయడం ద్వారా కూడా మన వ్యవసాయాన్ని, రైతాంగాన్ని దివాళా తీయించాయి. మన పర్యావరణాన్ని క్షీణింప జేశాయి.

మొత్తం ఆహార ధాన్యాల వాణిజ్యం కేవలం ఐదు బహుళజాతి కంపెనీల ఆధీనంలో ఉంది. కార్గిల్ కంపెనీ పంజాబ్, హర్యానాలలో లక్షలాది ఎకరాల్లో పండిన గోధుమ, వరి ధాన్యాన్ని తక్కువ రేటుకు కొని, నిల్వ చేసుకొని, కొంతకాలం తర్వాత ధరలు భారీగా పెంచి అమ్ముకుంటోంది. ఇక్కడ రైతుకు అందాల్సిన ధర అందడం లేదు. వినియోగదారులు ఎక్కువ ధర చెల్లిస్తున్నారు. ప్రపంచంలో అతి పెద్దదైన వాల్ మార్ట్ కంపెనీ కూడా భారత మార్కెట్లోకి వస్తోంది. ఈ కంపెనీలు గుత్తాధిపత్యాన్ని సంపాదించుకొని, ప్రజలను దోపిడీ చేస్తాయనడంలో ఎలాంటి సందేహం లేదు.

ప్రపంచ పెట్టుబడుల నివేదిక 2009 ప్రకారం బహుళజాతి కంపెనీలు భారత్‌లో పెట్టుబడులు పెట్టడానికి ఉవ్విళ్లూరుతున్నాయి.

బహుళజాతి కంపెనీలను నిషేధించాలనే డిమాండ్ బలంగా వినిపిస్తోంది. జన్యు మార్పిడి పంటలను, ముఖ్యంగా వంగ, బెండ లాంటి ఆహార ఉత్పత్తులను నిషేధించాలి. విత్తనాలను రైతులే తయారు చేసుకోవాలి. సేంద్రియ సేద్యాన్ని ప్రోత్సహించాలి.

కంపెనీలపై ఆధారపడదాన్ని తగ్గించుకోవచ్చు. స్వావలంబన అభివృద్ధికి ఆదర్శం కావాలి. భూ పంపకాలు అవసరం. గిట్టుబాటు ధరలు కల్పించాలి. ఈ విధంగా రైతులను రక్షించుకోనే అవకాశం ఉంది. వీ

పాలక పార్టీల జెండాలు వేరైనా ప్రజల్ని వంచించడంలో, ప్రజావ్యతిరేక పాలన సాగించడంలో అందరి ఎజెండా ఒక్కటేనని, భోపాల్‌తో సహా అనేక సంఘటనలు రుజువు చేశాయంటున్నారు **ఎన్. వేణుగోపాల్**

# ఇప్పుడు వెయ్యి భోపాల్‌లు, లక్ష కార్బైడ్‌లు

భోపాల్ విషాదం జరిగి ఈ డిసెంబర్ 3కు ఇరవై ఐదు సంవత్సరాలు. పెట్టుబడిదారీ లాభాపేక్షతో కూడిన పారిశ్రామికీకరణ, దేశదేశాల పాలకులను దళారీలుగా మార్చుకునే బహుళజాతిసంస్థల సామ్రాజ్యవాద ఆధిపత్యం ప్రజాజీవితం మీద ఎంత దారుణమైన ప్రభావం వేస్తాయో చూపడానికి భోపాల్ దురంతం ఒక ముఖ్యమైన చిహ్నం. భోపాల్‌లో బహుళజాతిసంస్థల దుర్మార్గం అతి నగ్నంగా బయటపడినప్పటికీ భారత పాలకులు దానినుంచి ఎటువంటి పాఠాలు నేర్చుకోలేదు సరిగదా, మరింతగా బహుళజాతి సంస్థలకు దాసోహమయ్యే స్థితికి దిగజారారు. భోపాల్ దురంతం జరిగిననాటికి కాగితం మీదనైనా ఉన్న ప్రజాసంక్షేమ, భారత ప్రజల సార్వభౌమాధికార రక్షణ చట్టాలను కూడ ఆ తర్వాత సవరించారు, రద్దుచేశారు. ఇవాళ దేశంలో బహుళజాతి సంస్థల దురాగతాలను అడ్డుకునే పాలక విధానం ఏదీ లేని స్థితిలో వెయ్యి భోపాల్ లు, లక్ష కార్బైడ్ లు రాజ్యం చేస్తున్నాయి. సామ్రాజ్యవాద లాభాపేక్షా రక్తదాహానికి బలి అయిపోయిన వేలాదిమంది భోపాల్ వాసుల స్మృతిలో, అలా విస్తరిస్తున్న వెయ్యి భోపాల్‌ల గురించి, లక్ష కార్బైడ్‌ల గురించి, వాటికి అవకాశమిస్తున్న పాలక విధానాల గురించి మాట్లాడుకోవలసి ఉంది.

మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ లో యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ (ఈ కంపెనీ యూనియన్ కార్బైడ్ అనే అమెరికా బహుళజాతి సంస్థకు, భారత దళారీ పెట్టుబడికి, భారత ప్రభుత్వ ద్రవ్యసంస్థల పెట్టుబడికి పుట్టిన పుత్రిక) కు చెందిన క్రిమిసంహారకాల కర్మాగారంలో 1984 డిసెంబర్ 2-3 అర్ధరాత్రి మిథైల్ ఐసో సయనేట్ అనే విషవాయువు బయటపడి ఎనిమిదివేలమందిని (ప్రభుత్వ లెక్కలప్రకారం 3,787 మందిని) బలితీసుకుంది. ఐదులక్షల మంది ఆ విషవాయు ప్రభావానికి లోనయ్యారు. వారిలో ఆ ప్రభావం వల్లనే ఏటా కనీసం వెయ్యి మంది చొప్పున ఇప్పటికి ఇరవై ఐదువేల మంది చనిపోయారు. ఇంత మంది మరణాలకు, అనారోగ్యానికి కారణమైన యూనియన్ కార్బైడ్ యాజమాన్యంపై, యూనియన్ కార్బైడ్ వంటి కంపెనీలు ఇలా ఇష్టారాజ్యంగా వ్యవహరించడానికి వీలు కల్పించిన స్థానిక ప్రభుత్వాధికారులపై, రాజకీయ నాయకులపై ఎటువంటి విచారణ జరగలేదు, ఎవరికీ శిక్ష పడలేదు. అసలు తాము టాంకులలో నిలువ చేసిన పదార్థం ఏమిటో, ఆ రాత్రి బయటపడిన విష వాయువు ఏమిటో కూడ చెప్పడానికి యూనియన్ కార్బైడ్ నిరాకరించింది. అంటే ఈ దేశంలో, ఈ దేశప్రజల ప్రాణాలు తీసే పదార్థాలు నిలువచేస్తూ ప్రమాదం జరిగిన తర్వాతనైనా అవి ఏమిటో చెప్పనంత బాధ్యతా రాహిత్యాన్ని, హంతక నిర్లక్ష్యాన్ని యూనియన్ కార్బైడ్ ప్రదర్శించింది. అయినా యూనియన్ కార్బైడ్ యజమానులను అరెస్టు చేయలేదు సరిగదా వారి దగ్గర భారత ప్రభుత్వం సాగిలపడింది. యూనియన్ కార్బైడ్ అధ్యక్షుడు వారెన్ ఆండర్సన్ భారతదేశం వస్తే అరెస్టు చేసి విచారించవలసిన ప్రభుత్వం ఎర్రతివాచీ స్వాగతాలు పలికింది. ఆయన కోరుకున్నట్టుగా కాగితాల మీద అరెస్టు చూపించి ప్రత్యేక విమానంలో సకల సౌకర్యాలతో సాగనంపింది. యూనియన్ కార్బైడ్ వారు ఇవ్వజూపిన బిచ్చంతో సరిపోయిన నష్ట పరిహారాన్ని అంగీకరించింది. విడిగా బాధితులో, వారి తరఫున స్వచ్ఛంద సంస్థలో యూనియన్ కార్బైడ్ పై కేసులు వేయడాన్ని నిషేధిస్తూ, తాను మాత్రమే కేసులు పెడతానని చట్టం తీసుకువచ్చింది. భోపాల్ కర్మాగారంలో అమెరికన్ సంస్థకు 51 శాతం ఉండగా, మిగిలిన 49 శాతం భారత ప్రభుత్వ ద్రవ్య సంస్థల చేతుల్లో, మహీంద్రాల చేతుల్లో ఉండి కేశబ్ మహీంద్రా భారత కంపెనీకి చైర్మన్ గా ఉండేవాడు. అలా దళారీగా పనిచేసిన భారత యజమానులపై కూడ కనీస చర్యలు తీసుకోలేదు. ఆ భారత దళారీ పారిశ్రామికవేత్తలు – మహీంద్రాలు – ఆ తర్వాత మరింత బడా పారిశ్రామిక వేత్తలుగా ఎదిగారు.

భోపాల్ దురంతం విషయంలో నిర్లక్ష్యం వహించడం మాత్రమే కాదు, ఆ తర్వాతి ఇరవై ఐదు సంవత్సరాలలో భారత పాలకులు అనుసరించిన బహుళజాతి సంస్థల అనుకూల విధానాలు దిగ్భ్రాంతి కలిగిస్తాయి. భోపాల్ కర్మాగారం లాంటి అనేక ప్రమాదకర కర్మాగారాలు స్థాపించడానికి, బహుళజాతిసంస్థలు ఈ నేలమీది ప్రజాజీవనాన్ని అస్తవ్యస్తం చేయడానికి, తమ ఇష్టారాజ్యంగా భారత సహజ సంపదలను కొల్లగొట్టుకుపోవడానికి, భారత మార్కెట్లను నిరాటంకంగా దోచుకోవడానికి పాలకులు వీలు కలిపించారు. భోపాల్ దుర్ఘటన తర్వాత కూడ ఆ ప్రభావం ఏమీ లేకుండా భారతీయుల ప్రాణాలను, భారతీయుల సహజ సంపదలను ఇంత చౌకగా, దుర్మార్గంగా పణం పెట్టే రాజకీయార్థిక విధానాలు ఎలా అమలులోకి వచ్చాయి? మన ప్రజలను, మన శ్రమను, మన సంపదలను ఇలా ప్రయోగశాలలో బలిపశువులుగా, అంగడి సరుకులుగా, మార్చిన పాలక విధానాలు ఎలా సాగుతున్నాయి?

భోపాల్ మారణకాండ జరిగిన నాటి రాజకీయార్థిక స్థితిని అర్థం చేసుకుంటే గాని ఆ తర్వాతి పరిణామాలను అర్థం చేసుకోలేం. ఎమర్జెన్సీ అనంతరం మూడు సంవత్సరాల జనతాపార్టీ ఐక్య సంఘటన ప్రభుత్వాల ప్రయోగం విఫలమై 1980 జనవరిలో ఇందిరాగాంధీ తిరిగి అధికారం

లోకి వచ్చిన తర్వాత భారత ప్రభుత్వం సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలమీద ఆధారపడే పరిస్థితి అంతకు ముందు కన్న పెరిగింది. 1981లో భారతప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఇంటర్నేషనల్ మానెటరీ ఫండ్ - ఐఎంఎఫ్) నుంచి తీసుకున్న అప్పు, ఆ అప్పుతో ప్రారంభమైన వ్యవస్థాత్మక సంస్కరణల కార్యక్రమం (స్ట్రక్చరల్ అడ్జస్ట్‌మెంట్ ప్రోగ్రాం) ఈ క్రమంలో ఒక ముఖ్యమైన మైలురాయి. నిజానికి 1947 నుంచీ కూడ ఎన్నడూ భారత ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని ధిక్కరించి, నిజమైన ప్రజా ప్రభుత్వాన్ని నడిపింది లేదుగాని, కనీసం మిశ్రమ ఆర్థిక విధానం; ప్రభుత్వ రంగ ప్రాధాన్యం; ప్రణాళికాబద్ధ అభివృద్ధి వ్యూహం; దిగుమతులకు ప్రత్యామ్నాయాల అన్వేషణ; చిన్నతరహా పరిశ్రమలు; ఉపాధికల్పన, దేశీయాభివృద్ధి లక్ష్యాలుగా పారిశ్రామికీకరణ వంటి నినాదాలనయినా ఇవ్వడం పాలకులకు అలవాటుగా ఉండేది. ఇక 1969 నుంచి 1975 దాకా ఇందిరాగాంధీ చూపించిన ప్రగతిశీల ముఖంలో ఫారిన్ ఎక్స్‌చేంజ్ రెగ్యులేషన్ ఆక్ట్ (ఫెరా) తో విదేశీ పెట్టుబడులపై ఆంక్షలు, మోనోపలీ అండ్ రిస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టీసెస్ ఆక్ట్ (ఎంఆర్‌టిపి) తో గుత్తపెట్టుబడి కేంద్రీకరణపై ఆంక్షలు, ఇండియన్ పేటెంట్స్ ఆక్ట్‌తో దేశీయ సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధి దిశగా ప్రయత్నాలు వంటి చర్యలు విదేశీ పెట్టుబడి ప్రవేశం మీద కొన్ని అవరోధాలనయినా పెట్టాయి. అయితే ఆ అవరోధాలు చాలవరకు కాగితం మీద మాత్రమే మిగిలిపోయాయి.

ఆ అవరోధాలు ఉండగానే దేశంలోకి విదేశీ పెట్టుబడిదారీ, బహుళజాతి సంస్థల ప్రవేశం సాగిపోతూనే ఉండింది. కాగితాలమీద ఉన్న ఆంక్షలను కూడ తొలగించాలని ఆ సంస్థలు, వారి భారతీయ దళారీలు కోరుతుండేవారు. 1981 ఐఎంఎఫ్ అప్పు షరతులతో వారి కోరికలు తీరడం మొదలయింది. ఆ షరతులను అమలు జరప బోతుండగానే ఇందిరాగాంధీ హత్య జరిగి రాజీవ్‌గాంధీ అధికారంలోకి వచ్చాడు. మొదట ఆపద్ధర్మ ప్రధానమంత్రిగా, రెండునెలల తర్వాత ఎన్నికయిన ప్రధానమంత్రిగా రాజీవ్‌గాంధీ వెంటనే చేసిన పని దేశాన్ని ఇరవయ్యొకటో శతాబ్దంలోకి తీసుకుపోతానని అనడం. ఆ మాటకు అర్థం దిగుమతుల సరళీకరణ విధానం, పన్నుల విధానంలో మార్పులు, నూతన విద్యావిధానం పేరుతో బహుళజాతిసంస్థలకు ఉపయోగపడే ఉన్నతవర్గ విద్యావిధానం, కంప్యూటరీకరణ, టెలికమ్యూనికేషన్స్ రంగంలో మార్పులు. ఈ మార్పులన్నీ కూడ ఇవాళ మనం చూస్తున్న బహుళజాతి సంస్థల విస్తరణకు మార్గం సుగమం చేసినవే.

రాజీవ్‌గాంధీ దుర్మార్గం ఎక్కడ ఉందంటే, ఆయన బహుళజాతి సంస్థలకు అనుకూలంగా చేసిన ఈ పనులన్నీ సరిగ్గా భోపాల్ అనుభవం తర్వాతనే చేశాడు. ఆయన 1984 అక్టోబర్ 31 న ఆపద్ధర్మ ప్రధానమంత్రిగా అధికారంలోకి వస్తే, సరిగ్గా నెల రోజులకే భోపాల్ దురంతం జరిగింది. ఆ నెలలోనే జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ 542 స్థానాలకు గాను 414 స్థానాలను గెలుచుకుంది. అంత పెద్ద ఎత్తున మెజారిటీ వచ్చిన అహంకారంతో కాంగ్రెస్ ప్రభుత్వం అనేక ప్రజావ్యతిరేక చర్యలు ప్రారంభించింది. అంత నిర్లక్ష్యంగా ప్రవర్తించి, అంతమంది ప్రాణాలను బలిగొని, ప్రపంచంలోనే అత్యంత పెద్ద పారిశ్రామిక ప్రమాదంగా గుర్తింపు పొందిన భోపాల్ దురంతం విషయంలో భారత ప్రభుత్వం తీసుకున్న చర్యలు శూన్యం. భోపాల్ దుర్మార్గానికి బాధ్యులైన వారిమీద చర్యలు చేపట్టకపోవడం మాత్రమే కాక, వెంటవెంటనే వారికి అనుకూలమైన విధానాలను రూపొందించడం, అమలులోకి తేవడం మొదలయింది.

రాజీవ్‌గాంధీ ప్రభుత్వం అనుసరించిన విధానాలకు గణాంకాల ద్వారా ఒక ఉదాహరణ చెప్పాలంటే, దేశీయ పారిశ్రామిక వ్యాపార సంస్థలకు విదేశీ పారిశ్రామిక వ్యాపార సంస్థలతో కుదిరిన ఒప్పందాల సంఖ్య చూడాలి. ఈ ఒప్పందాల సంఖ్య 1948-58 మధ్యకాలంలో ఏడాదికి ఐదుగా ఉంటే, 1959-66 మధ్య 108కి పెరిగి, 1967-79 మధ్య 39కి తగ్గింది. ఆ సంఖ్య 1980-88 మధ్య కాలంలో 170కి పెరగడానికి బాధ్యత ఐఎంఎఫ్ షరతులది, రాజీవ్ గాంధీది మాత్రమే. రాజీవ్‌గాంధీ ప్రభుత్వం కల్పించిన ఆ పునాది మీద ఆ ఒప్పందాల సంఖ్య 1989-90 నాటికి 174కు పెరిగి, ఆ తర్వాత మారిన రాజకీయార్థిక విధానాల వల్ల 1991-2000 మధ్య కాలంలో సాలీనా 1842 ఒప్పందాలకు చేరింది. (జై బి.పి. సిన్హా, మల్టినేషనల్స్ ఇన్ ఇండియా, సేజ్ పబ్లికేషన్స్, 2004).

రాజీవ్‌గాంధీ అనుసరించిన దిగుమతుల సరళీకరణ, సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థల అనుకూల విధానాల వల్ల నాలుగైదేళ్లకే భారత ప్రభుత్వ ఖజానా ఖాళీ అయ్యే పరిస్థితి వచ్చింది. 1989లో ఎన్నికల తర్వాత ఏర్పడిన వి.పి. సింగ్ ప్రభుత్వం, చంద్రశేఖర్ ప్రభుత్వం ఆ ఆర్థిక సంక్షోభ భారాన్ని భరించవలసి వచ్చింది. ఆ ప్రభుత్వాలు ఎదుర్కొన్న చిక్కులవల్ల మళ్లీ త్వరలోనే ఎన్నికలు వచ్చి, ఆ ఎన్నికల ప్రచార సందర్భంగానే రాజీవ్‌గాంధీ హత్య జరిగింది. ఆ ఎన్నికల ప్రచార క్రమంలోనే ఆర్థిక సంక్షోభం గురించి, దాన్ని పరిష్కరించే అవకాశాల గురించి చర్చలు జరిగాయి. కాంగ్రెస్ అధికారంలోకి వస్తే ప్రపంచబ్యాంకు మాజీ ఉద్యోగి మన్మోహన్‌సింగ్ ఆర్థికమంత్రి అవుతాడని, అంటే నేరుగా ప్రపంచబ్యాంకు విధానాలు అమలు అవుతాయని కూడ చర్చ మొదలయింది. లోక్‌సభలో మెజారిటీ రాకపోయినా పివి నరసింహారావు ప్రధానిగా, మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా ప్రభుత్వం ఏర్పడింది. ఏర్పడిన కొద్ది రోజుల్లోనే నూతన ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య విధానాలను ప్రకటించింది. రూపాయి మారకపు విలువను తగ్గించమని అమెరికా ఇచ్చిన ఆదేశాన్ని వెంటనే అమలు చేసింది.

లోక్‌సభలో మైనారిటీలో ఉంటూనే 1991 జూన్ నుంచి 1996 వరకు పూర్తికాలం అధికారంలో కొనసాగిన పివి నరసింహారావు - మన్మోహన్ సింగ్ ప్రభుత్వం దేశ రాజకీయార్థిక విధానాలలో ఎన్నో మార్పులు తీసుకువచ్చింది. అంతవరకూ లోపాయకారీగా జరుగుతున్న విధానాలను బహిరంగంగా అమలు చేయడం మొదలుపెట్టింది. అప్పటివరకూ అటు సోవియట్ యూనియన్‌కూ ఇటు అమెరికాకూ మధ్యన బేరసారాలు జరపగలిగిన శక్తితో అమలయిన కొన్ని ప్రజానుకూల చర్యలయినా, సోవియట్ యూనియన్ కూలిపోవడంతో రద్దయిపోయాయి. సంపూర్ణంగా ప్రపంచబ్యాంకు కనుసన్నలలో, బహుళజాతి సంస్థలకు సకల అధికారాలు ఇచ్చే పాలన ప్రారంభమయింది. ప్రభుత్వం నిస్సిగ్గుగా భోపాల్‌లో బలి అయిపోయిన వేలాదిమంది ప్రజల సమాధుల పై సామ్రాజ్యవాద అనుకూల విధానాలను రూపొందిస్తూ పోయింది. పారిశ్రామిక, వ్యాపార రంగాలలోకి విదేశీ పెట్టుబడుల ప్రవాహం, ద్రవ్యరంగ సంస్కరణలు, ప్రభుత్వ రంగ పరిశ్రమలను అమ్మివేయడం, మూసివేయడం, ప్రైవేటీకరించడం, వ్యవసాయ రంగంలో బహుళజాతి సంస్థల జోక్యం, డంకెల్ డ్రాఫ్ట్ - ప్రపంచవాణిజ్య సంస్థ చర్చలు వంటి

అనేక దీర్ఘకాలిక ప్రభావం ఉండే పరిణామాలు మొదలయ్యాయి. బహుళజాతి సంస్థల దుర్మార్గం, స్థానిక ప్రజల ప్రాణాలపట్ల హంతక నిర్లక్ష్యం భోపాల్‌లో బయటపడినప్పటికీ, ఎటువంటి ఆంక్షలు, నియంత్రణలు, పర్యవేక్షణ లేని విధంగా బహుళజాతి సంస్థల కార్యకలాపాలు జరుపుకోవడానికి వీలయిన వ్యవస్థ తయారయింది. స్థానిక ప్రజల, అధికారుల అదుపు అనేది లైసెన్స్ రాజ్ అనే పేరుతో అపహాస్యానికి గురయింది. ఆ పరిణామాల దుష్ఫలితాలు హర్షద్ మెహతా స్టాక్ మార్కెట్ కుంభకోణం, జైన్ హవాలా కుంభకోణం, చేనేత కార్మికుల, రైతుల ఆత్మహత్యలు మొదలయినవాటిలో బహిర్గత మయ్యాయి.

ఆ తర్వాత ఎన్నికలలో ఏ పార్టీకీ పూర్తి మెజారిటీ రాని నేపథ్యంలో పదమూడు రోజుల పాటు భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని ఐక్య సంఘటన, తర్వాత పద్దెనిమిది నెలలు దేవెగౌడ నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్, ఏడు నెలలు ఐకె గుజ్రాల్ నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాలు రాజ్యం చేశాయి. మళ్లీ 1998లో ఎన్నికలు జరిగి భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని మైనారిటీ ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటికీ అవిశ్వాస తీర్మానంతో అది కూడ కూలిపోయింది. 1999 ఎన్నికలలో భాజపా నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (ఎన్ డి ఎ) కూటమి అధికారంలోకి వచ్చి ఐదు సంవత్సరాలు పూర్తిగా పాలించింది. 2004 ఎన్నికలలోనూ, 2009 ఎన్నికలలోనూ కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) అధికారంలోకి వచ్చింది.

ఈ అన్ని కూటములలోనూ లోపలి నుంచి మద్దతు రూపంలోనో, బైటినుంచి మద్దతు రూపంలోనో దేశంలోని అన్ని రాజకీయపక్షాలూ, వామపక్షాలతో సహా, భాగస్వాములుగా ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టిన 1991 నుంచి ఇవాళ్టివరకూ గడిచిన పద్దెనిమిది సంవత్సరాలలో కేంద్రంలో అధికారం చేపట్టని రాజకీయ పార్టీ ఒక్కటి కూడ లేదు. కాని అదే సమయంలో ఏఒక్క పార్టీ కూడ భోపాల్ బాధితులకు న్యాయం చేయలేదు. న్యాయం జరగాలని చట్టసభలలోనో, బయటనో నినదించలేదు. భోపాల్ దుర్ఘటన నుంచి గుణపాఠాలు తీసుకుని ఐనా బహుళజాతి సంస్థల మీద తగిన ఆంక్షలు విధించాలని అనలేదు, అనుకోలేదు. బహుళజాతి సంస్థల లాభాలకన్న, ఆ లాభాలలో ఇక్కడి దళారీలకు, రాజకీయ నాయకులకు వాటాగా అందే ఎంగిలి మెతుకులకన్న, ఈ దేశ ప్రజల ప్రయోజనాలు ముఖ్యమైనవని అనుకోలేదు.

ఏ పార్టీ నాయకత్వంలో ఎన్నిపార్టీల ఐక్య సంఘటన ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా బహుళజాతి సంస్థల అనుకూల విధానాలకు ఎదురే లేకుండా పోయింది. మన దేశ ప్రజలకు, మన సమాజానికి అవసరమయినా, కాకపోయినా అనేక రకాల సరుకులకు ఈ దేశం బహిరంగ మార్కెట్ గా మారిపోయింది. బహుళజాతి సంస్థల ఉత్పత్తి కార్యక్రమానికి అవసరమైన ఖనిజ వనరులను ఇష్టారాజ్యంగా తవ్వుకుపోవడానికి వారికి అన్ని అధికారాలు అందాయి. ఆ బహుళజాతి సంస్థలకు అవసరమయిన పనులు చేసి తమ బొక్కసాలు నింపుకునే దేశీయ దళారీ సంస్థలు పుట్టుకొచ్చాయి. భారతదేశం సువిశాలమైన మార్కెట్ అనీ, దానిలో ప్రవేశించడానికి తమకు ఉన్న అడ్డంకులన్నిటినీ తొలగించాలని బహుళజాతి సంస్థలు కోరినకొద్దీ ప్రభుత్వాలు దాసోహమంటూ వచ్చాయి. ఇక్కడి ప్రజల శ్రమ అతి చౌకగా దొరుకుతున్నప్పటికీ, ఇక్కడ ఉన్న కార్మిక సంక్షేమ చట్టాలు తమకు ఆటంకంగా ఉన్నాయని, ఆ చట్టాలకు తూట్లు పొడవాలనీ బహుళజాతిసంస్థలు కోరితే, వారు కోరిన పనల్లా చేయడానికి ప్రభుత్వాలు సిద్ధపడ్డాయి. ఇక్కడ ప్రజాధనంతో, ప్రభుత్వ రంగ సంస్థలతో సంపన్నంగా పెరిగిన వనరులను, ద్రవ్యసంస్థల నిధులను తమకు అప్పగించాలని బహుళజాతి సంస్థలు కోరితే అందుకు అనుగుణంగా చట్టాలను సవరించడం జరిగింది. ఈ దేశంలో ఉన్న విస్తారమైన భూవనరులను, అటవీ వనరులను, జల వనరులను వాడుకుని లాభాలు సంపాదించడానికి తమను అనుమతించాలని బహుళజాతి సంస్థలు కోరితే దేశం మొత్తాన్నీ వెండి పళ్లెరంలో పెట్టి వారికి అందించడం జరిగింది. ఈ దేశ భూగర్భంలో వేల ఏళ్లుగా నిక్షిప్తమయి ఉన్న ఖనిజ సంపద మీద ఈ దేశవాసులకు ఏ హక్కూ ఉండగూడదని, అదంతా తమ పారిశ్రామిక వ్యవస్థకు ముడి సరుకు కావాలని బహుళజాతి సంస్థలు కోరితే మారుమాట లేకుండా రాసి ఇవ్వడం జరిగింది. తత్ఫలితంగా దేశ పాలనలో సామ్రాజ్యవాద జోక్యం, బహుళజాతి సంస్థల జోక్యం, దేశదేశాల సంపన్నుల మాఫియా జోక్యం విపరీతంగా పెరిగిపోయింది. ఈ బ్రహ్మాండమైన, బహిరంగమైన దేశద్రోహ, ప్రజాద్రోహ కార్యక్రమంలో అన్ని పార్లమెంటరీ రాజకీయ పక్షాలకూ వాటా ఉంది.

ఇలా భోపాల్ దుర్ఘటన తర్వాత గడిచిన ఇరవై ఐదు సంవత్సరాలలో ఈదేశ పాలకవర్గాలు, ఏ నినాదాలు వల్లించినా, ఏ జెండాలు పట్టుకున్నా బహుళజాతి సంస్థల గులాములుగా, దళారులుగా మరిపోయారని తేటతెల్లమయింది. సరిగ్గా అంతకు ముందు శతాబ్దాలలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతదేశం ఒక అమూల్యమైన రత్నం అని భావించేవారో, ప్రస్తుతం అట్లాగే రవి అస్తమించని బహుళజాతి సామ్రాజ్యంలో భారతదేశం కీలక భాగస్వామి అయింది.

అయితే ఇదంతా నాణానికి ఒక ముఖం మాత్రమే. అంతర్జాతీయ సామ్రాజ్యవాద, బహుళజాతి విషచక్రంలో భారతదేశానికి ఇంత కీలక స్థానం ఉండడం వల్లనే ఆ విషచక్రాన్ని తుత్తునియలు చేయగల శక్తి కూడ భారత ప్రజానీకానికే ఉంది. భోపాల్ విషవాయు దుర్ఘటన తర్వాత ప్రభుత్వం అనుసరించిన బహుళజాతి అనుకూల వైఖరి వల్ల, ఏడు సంవత్సరాలు తిరగకుండానే, మొత్తంగా బహుళజాతి సంస్థలకు గులాములుగా మారిపోవడం వల్ల సామాన్య ప్రజానీకానికి కూడ సామ్రాజ్యవాదం గురించి, దేశ పాలకుల వంచన గురించి అవగాహన పెరిగింది. 1984 తర్వాత దేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా చైతన్యం నానాటికీ పెరుగుతోంది. అందుకే 1991 తర్వాత ప్రపంచీకరణ అని పేరుపెట్టుకున్న ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా పెరుగుతున్న ప్రజాచైతన్యానికి భోపాల్ ఒక ముఖ్యమైన పతాకం అయింది. భోపాల్ బహుళజాతి సంస్థల దుర్మార్గానికి మాత్రమే కాదు, ఆ దుర్మార్గం మీద పోరాడుతున్న ప్రజాచైతన్యానికి కూడ చిహ్నమైంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రజల ప్రతిఘటన మరింతగా బలోపేతమవుతూ, సంఘటితమవుతూ ముందుకు సాగుతోంది. ఈ ప్రతిఘటన ఇంకా బలపడి, విస్తరించి, ఈ నేల మీది నుంచి దళారీ పాలకులను, దళారీ పారిశ్రామిక, వ్యాపారవేత్తలను, సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల దుర్మార్గాన్ని రద్దుచేసిననాడే భోపాల్ మృతులకు నిజమైన నివాళి. వీ

*అమెరికా తన ఆధిపత్యం, ప్రయోజనాలు, లాభాల కోసం ప్రపంచ వ్యాప్తంగా ప్రజలను, పర్యావరణాన్ని ఏరకంగా నాశనం చేస్తోందో వియత్నాం ఉదాహరణగా వివరిస్తున్నారు* **పి. సంజీవమ్మ**

# ఉగ్రవాదమే సామ్రాజ్యవాద స్వభావం

'పీస్ అండ్ సాలిడారిటీ' అయిప్సొ పత్రిక (మే-జూలై 2009) లో అమెరికా సంయుక్త రాష్ట్రాల యుద్ధ నేరాల్ని గురించి ఒక వ్యాసం వచ్చింది. రచయిత మార్‌జోరె కోన్ అమెరికా పౌరుడే. ఆ వ్యాసం నేటికీ కొనసాగుతున్న అమెరికా యుద్ధ నేరం - ముఖ్యంగా వియత్నాం నేలను ఇప్పటికీ విషమయం చేస్తున్న ఏజెంట్ ఆరెంజ్ గురించి. ఆ వ్యాసం ఆధారంగా - వివరాల్లోకి వెళ్తే.

1961 నుంచి 1971 వరకు అమెరికా మిలిటరీ వియత్నాం భూమి మీద ఏజెంట్ ఆరెంజ్‌ను విపరీతంగా చల్లింది. అందులో డై ఆక్సిన్ అనే రసాయనం పెద్ద మొత్తంలో ఉంటుంది. మానవజాతికి ఇప్పటి వరకు తెలిసిన భయంకరమైన రసాయనం. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు.ఎచ్.ఒ.) దీన్ని క్యాన్సర్ కారకంగా గుర్తించింది. అమెరికన్ మెడికల్ అకాడమీ కూడ దీన్ని పుట్టుకలో అనేక లోపాలు కలిగించేదిగా విశ్లేషించింది.

ముప్పై ఏళ్లపాటు వియత్నాం మీద దురాక్రమణ యుద్ధం చేసి, ఒక దశాబ్దం పాటు ఏజెంట్ ఆరెంజ్‌ను స్ప్రే చేసి ఆ భూమిని, ఆ పౌరుల్ని సర్వనాశనం చేసింది అమెరికా. ఎంత దురాక్రమణ యుద్ధానికైనా ఒక నీతి ఉంటుంది. పౌరులకు ముప్పు కలిగించకూడదు. కాని అమెరికా సామ్రాజ్యవాదానికి అదేమీ పట్టదు. ఏజెంట్ ఆరెంజ్ కలిగించిన వినాశనం గురించి ఇటీవల శాస్త్రజ్ఞులు విశ్లేషిస్తున్నారు. ఏజెంట్ ఆరెంజ్ పీడితులైన వియత్నాం పౌరులు అమెరికా కోర్టుల్లో కేసులు వేసి ఎలాంటి న్యాయాన్ని పొందలేకపోతున్నారు. సామ్రాజ్యవాద తాజా క్రూర రూపాన్ని, స్వభావాన్ని తెలుసుకుంటే మనం దాన్ని ఏ ఉగ్రవాదితోనూ పోల్చలేం. దానికి భాషలో కొత్త పదం కనిపెట్టాల్సి ఉంది. ప్రపంచమంతా ఛీ కొడుతున్నా ఇరాక్‌ను సర్వనాశనం చేసింది. ఆఫ్ఘన్ పరిస్థితి ఇరాక్ కంటే తక్కువేమీ కాదు. దీని ముద్దుబిడ్డ ఇజ్రాయిల్‌ను నిత్యం ఉసికొల్పుతూ పాలస్తీనా ప్రజలకు దినదిన గండం విధిస్తోంది.

ఏజెంట్ ఆరెంజ్ వియత్నాంలో కలిగించిన వినాశనం గురించిన విషయానికొస్తే - ఆ దేశంలోని అడవుల్లోని 20 శాతం ప్రాంతంపై పదేళ్ల పాటు ఏజెంట్ ఆరెంజ్ రసాయనాన్ని చల్లింది. ఆ భూమి గడ్డి పరక మొలవడానికి కూడా పనికిరాదు, అడవుల్లో చెట్లు మాడిపోయాయి. ఈ రసాయనానికి గురైన పౌరులు వారి కుటుంబాలు రెండు తరాల నుండి నరక యాతనలు అనుభవిస్తున్నారు. తరాలుగా గుండె జబ్బులు, క్యాన్సర్, కాలేయం జబ్బులు, చర్మం, నరాలకు విపరీతమైన జబ్బులు, పునరుత్పత్తి శక్తిలో ఘోరమైన లోపాలు కొనసాగుతున్నాయి. మానసిక అశక్తత, స్వల్ప ఆయుష్షుతో బాధలు పడుతున్నారు.

అడవులు మరలా ఏర్పడాలంటే మరో రెండు వందల సంవత్సరాలు పడతాయి. ఆ భయంకర రసాయనం వల్ల నదులు, భూగర్భజలాలు పూర్తిగా కలుషితమై పాడైనాయి. వాతావరణ కాలుష్యం ఎంతగా వ్యాపించి ఉందో, భూములు ఎడారులుగా మారి, పంటలు పండక జంతుజాలం జీవించదు.

అమెరికా ప్రభుత్వానికి, ఆ కెమికల్ కంపెనీలకు తెలుసు - ఏజెంట్ ఆరెంజ్‌ను అధిక ఉష్ణోగ్రత స్థాయిలో వేగంగా ఉత్పత్తి చేసినపుడు అందులో డై ఆక్సిన్ అధిక మొత్తంలో ఉంటుందని. అయినా వాళ్లు దాని ఉత్పత్తిని మానలేదు. 1963లో అమెరికా ప్రభుత్వమే బయోనెటిక్స్ అధ్యయనం చేయడానికి ఒక కమిషన్ వేసింది. ఆ అధ్యయనంలో తేలిన విషయమేమంటే కొద్ది మోతాదులో అయినా డై ఆక్సిన్ అనేది గర్భస్థ శిశువుల్ని చంపుతుంది, లేక అనాకారం చేస్తుంది. ఇది తల్లి పాలలో చేరి బిడ్డల్ని చంపుతుంది. ఈ వాస్తవం బయటికి పొక్కకుండా చేశారు. 'నేచర్' పత్రికలో శాస్త్రజ్ఞుల విశ్లేషణ దీని గురించి ఏమంటే - ఇది ఇప్పటికీ పూర్తిగా అధ్యయనం చేయబడని ఘోర వినాశనకారి అయిన రసాయనం అని.

1969లో ఏజెంట్ ఆరెంజ్ గురించిన అధ్యయన ఫలితాలు బయటికి పొక్కేంత వరకు అమెరికా దాన్ని వియత్నాంలో చల్లడం ఆపలేదు. ఆ తర్వాతనే ఆపారు. వియత్నాంలో ఏజెంట్ ఆరెంజ్‌ను స్ప్రే చేయడం వల్ల రోగాల బారిన పడిన అమెరికా సైనికులు అమెరికా కంపెనీల మీద అక్కడి కోర్టుల్లో కేసులు వేశారు. (కంపెనీలు ఏజెంట్ ఆరెంజ్‌ను తయారు చేసి ప్రభుత్వానికి అమ్ముతాయి.) ఆ కంపెనీలు డౌ (డి.ఒ.డబ్ల్యు.), మోన్‌సాంటో. అయితే ఆ కంపెనీలు తమ మీద వేసిన కేసుల్ని కోర్టుకు వెలుపల సెటిల్ చేసుకున్నాయి. ఆ సైనికులకు కంపెనీలు నూట ఎనభై మిలియన్ డాలర్లు చెల్లించాయి. అలాగే, అమెరికా యుద్ధ వీరులు కొందరు ఏజెంట్ ఆరెంజ్‌కు ఎక్స్‌పోజ్ అయినందుకు ఒక్కొక్క సంవత్సరానికి 1.52 బిలియన్ డాలర్లు చట్ట ప్రకారం నష్టపరిహారం పొందారు

అదే ఏజెంట్ ఆరెంజ్‌కు బలైన వియత్నాం పౌరులు అమెరికా ఫెడరల్ కోర్టుల్లో ఆ కంపెనీల మీద కేసు వేయగా జిల్లా జడ్జి జాక్ వెయిన్ స్టీన్ ఆ కేసును కొట్టివేస్తూ అన్న మాటలు వింటే మనకు భరించరాని కోపం, అసహ్యం వేస్తాయి.

'1907 హేగ్ కన్వెన్షన్ ప్రకారం ఏజెంట్ ఆరెంజ్‌లో విషపూరిత మైనదేదీ లేదు' అని హైకోర్టు కూడా కొట్టివేసింది. ఆఖరికి సుప్రీంకోర్టు ఆ కేసుల్ని వినడానికి కూడా అంగీకరించలేదు. కెమికల్ కంపెనీలు సుప్రీంకోర్టులో వాదించిన విషయం మనకు మరింత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. 'ఉద్దేశపూర్వకంగా హాని కలిగించే విధంగా ఏజెంట్ ఆరెంజ్‌ను తయారు చేయలేదు. అయితే అలాంటి కీడును ముందుగానే పసికట్టవచ్చును' అని ఉద్దేశపూర్వకం కానప్పుడు, కీడును మునుముందు గానే ఎట్లా పసికట్టగలరు? ఇదీ ప్రశ్న. భోపాల్ గ్యాస్ బాధితులకు అమెరికా కంపెనీ నిర్వాకం బాగా తెలుసు. యూనియన్ కార్బైడ్ ఎరువుల కంపెనీ పాతిక సంవత్సరాలు గడచినా వినాశనం సంభవించి, ఇప్పటికీ బాధితులకు న్యాయం లభించలేదు.

ఈ సంవత్సరం మే 15, 16 తేదీల్లో పారిస్‌లో అంతర్జాతీయ ప్రజాస్వామ్య న్యాయవాదుల సంఘం ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసింది. ఏజెంట్ ఆరెంజ్‌కు బలైన వియత్నాం పౌరుల పక్షంలో న్యాయవాదులు ఆ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. మూడు ఖండాల నుండి ఏడు మంది న్యాయమూర్తులు పాల్గొని ట్రిబ్యునల్‌కు తమ తీర్పును ప్రకటించారు. ఆ ట్రిబ్యునల్ ముందు 27 మంది వియత్నాం పౌరులు – ఏజెంట్ ఆరెంజ్‌కు బలైన వాళ్లను, సాక్ష్యుల్ని, విజ్ఞానశాస్త్ర నిపుణుల్ని విచారించారు.

వారు ఇచ్చిన సాక్ష్యాలు, చెప్పిన విషయాలు వింటే అమెరికాది ఏ రకమైన ఉగ్రవాదమో మనం ఆలోచించగలం. దక్షిణ వియత్నాం సైన్యంలో ఒకటైన మాయ్ జియాంగ్‌వూ ఈ రసాయనాన్ని సంచుల కొద్దీ తన వీపు మీద మోసినందువల్ల అతనికి పుట్టిన ఇద్దరు కొడుకులు నడవలేని స్థితిలో ఉండి, ఏ పనులూ చేసుకోలేక, అవయవాలు నెమ్మదిగా వంకర తిరిగిపోయి, కొన్నాళ్లు కేవలం నేలమీద పాకుతూ, ఆఖరికి వాళ్లు 23, 25 ఏళ్ల వయసులో చనిపోయారు.

మరొక వ్యక్తి ఫామ్ ది మిన్ సాక్ష్యం ఇచ్చాడు. అతని తల్లిదండ్రులు కూడ వియత్నాం సైన్యంలో పని చేశారు. వారి కొడుకైన తనకు కాళ్లు ఎలా వంకర తిరిగి, చర్మం వేలాడుతూ ఉందో చూపించాడు. గుండెజబ్బు, జీర్ణకోశ వ్యాధులతో బాధపడుతున్నానని చెప్పాడు.

టోంగాట్రాన్ అనే మహిళా జర్నలిస్టు ఏజెంట్ ఆరెంజ్ స్ప్రే సమయంలో జర్నలిస్టుగా పనిచేసింది. ఆమె బిడ్డ మూడు నెలల వయసులో 6.6 పౌనుల బరువుండి 17 నెలలకు కూడా అంతే బరువుతో చర్మం అంతా వదులై వేలాడుతూ చనిపోయింది. మరో మహిళ ఒక మాంసపు ముద్దకు జన్మనిచ్చింది. మరికొందరు బిడ్డలు మెదడు లేకుండా, కొందరు మెదడు అరలు లేకుండా, మరెన్నో వికారాలతో పుట్టారు. చాలామంది పిల్లలు అమానుషంగా అరిచేవారు.

జార్జిమిజో వియత్నాంతో యుద్ధంలో అమెరికా సైన్యంలో పనిచేశాడు. అతని తిండి తిప్పలు పడక, అన్నీ ఏజెంట్ ఆరెంజ్ వల్ల కలుషితం కావడం వల్ల పనిచేయలేని స్థితికి వచ్చాడు. అయినా సైన్యం అతన్ని విచారణ జరిపి శిక్షించింది. అతడు చనిపోయేముందు వియత్నాం లో 'స్నేహ గ్రామాలు' ఏర్పటు చేయడంలో ఎంతో సహకరించాడు.

జార్జ్ డూసిన్ అనే మరో మహానుభావుడు ఆ స్నేహ గ్రామాలు మరిన్ని ఏర్పాటు చేయడంలో వియత్నాం పౌరులకు సహకరించాడు. అవి ఇప్పటికీ పదకొండు మాత్రమే ఉన్నాయి. కనీసం వెయ్యి గ్రామాలైనా నిర్మాణం అయితే కాని వియత్నాంలో ఏజెంట్ ఆరెంజ్ పీడితుల్ని ఆ గ్రామాల్లో ఉంచి చూసుకోగలుగుతారు. ఎందుకంటే వారు కుటుంబా లతో కలిసి ఇళ్లలో ఉండటానికి సాధ్యంకాని పరిస్థితి ఉంది. విపరీతమైన బాధలతో వికారంగా ఏడుస్తూ, అరుస్తూ అనాకారి శరీరాలతో చావుబతుకుల్లో ఉన్నారు.

ప్రపంచ విజ్ఞాన శాస్త్రవేత్తలు ఈ భయంకర రసాయనాన్ని గురించి అధ్యయనం చేస్తూనే ఉన్నారు. దాని దుష్ఫలితాలు వెల్లడిస్తూనే ఉన్నారు. ఇప్పటికే వియత్నాంలో యుద్ధం తీవ్రంగా జరిగిన ప్రదేశాల్లో పర్యావరణం నాశనమైంది. వియత్నాంలో ఏజెంట్ ఆరెంజ్ వల్ల పాడైపోయిన ఒక హెక్టారు భూమిని పునరుద్ధరించడానికి ఒక బిలియన్ డాలర్ ఖర్చవుతుందని శాస్త్రజ్ఞుల అంచనా.

పారిస్ సమావేశం తర్వాత అంతర్జాతీయ ప్రజాస్వామ్య న్యాయవాదుల సంఘం మే 2009లోనే హనాయ్‌లో ఒక కమిషన్ ఏర్పాటు చేసి అమెరికా యుద్ధ నేరాల్ని విచారించవలసిందిగా ఆ దేశాధ్యక్షునికి పిలుపునిచ్చారు. చట్టరీత్యా నష్టపరిహారం పొందే హక్కును నిరూపించారు. అమెరికా ప్రభుత్వం ఆ కంపెనీలు చేసిన యుద్ధ నేరాలు మానవజాతి సిగ్గుతో తలవంచుకునేలా చేశాయి. వియత్నాంలో ఆనాడు అమెరికా మిలిటరీ బాంబులు కురిపిస్తూ ఉన్నప్పటికీ వియత్నాం ప్రజలు వారి ప్రభుత్వమూ అమెరికా ప్రభుత్వానికి ఆ ప్రజలకూ మధ్య భేదాన్ని గమనించడం మరచిపోలేదు. అమెరికా ప్రజలకు ఆ యుద్ధం ఇష్టం లేదన్న విషయం వియత్నాం ప్రజలకు తెలుసు. అమెరికా ప్రజలంటే మాకు ఇష్టం అన్నారు వాళ్లు.

ముప్పై లక్షల మంది వియత్నామీయులు ఆ యుద్ధంలో, యుద్ధ నేరాల్లో మరణించారు. యాభై ఎనిమిది వేల మంది అమెరికా సైనికులూ చనిపోయారు. అంతేకాదు, నేటికీ, యుద్ధం ఆగిన దాదాపు నలభై ఏళ్లకూ వియత్నాం ప్రజలు వారి కుటుంబాలు, అమెరికా సైనిక కుటుంబాలు యుద్ధ బీభత్సాన్ని ఎదుర్కొంటూనే ఉన్నాయి. వాళ్ల పుట్టకలు వాళ్ల జీవితాలు ఏజెంట్ ఆరెంజ్ విషానికి బలి అవుతూనే ఉన్నాయి.

మానవ హక్కుల్ని ఘోరంగా ఉల్లంఘించి, మానవతను ఎగతాళి చేసే స్థాయికి వెళ్లిన అమెరికా ప్రభుత్వం, వారి మిలిటరీ, వారి ధన దాహ కంపెనీలు ప్రపంచం అంతా ఛీ కొడుతున్నంగురైనా – వియత్నాం ప్రజలకు న్యాయం చేయాలి. నిక్సన్ ప్రకటించిన నష్టపరిహారం ఇవ్వాలి. మానవాళి పట్ల భయంకరమైన తప్పిదం చేసిన అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచ ప్రజల కోర్టు ముందు తలవంచాలి.

అమెరికా మిలిటరీ ఇరాక్‌లో, అఫ్ఘనిస్తాన్‌లో వ్యర్థ యురేనియంను ఉపయోగి స్తూందట. ఇంక ఆ దేశాల ప్రజలు ఆ భూములు శతాబ్దాల తరబడి ఆ విషవాయువులకు బలి కావలసిందేనా? ఇది అమెరికా సామ్రాజ్యవాద నగ్నస్వరూపం. మరి అది ఉగ్రవాది కాక మరేమిటి? అమెరికా ప్రజలకు మచ్చతెచ్చేపని.

జూలై 10, 11 తేదీల్లో బీజింగ్‌లో చైనా, భారత, రష్యా దేశాల శాంతి సంఘాల సమావేశం జరిగింది. అమెరికా సామ్రాజ్యవాదం కలకంటున్న ఏకధ్రువ ప్రపంచం ఆశను భగ్నం చేస్తూ, బహుళ ధ్రువ ప్రపంచానికి బలీయమైన బాట వేయడానికి ఆ సమావేశంలో ప్రయత్నం ప్రారంభం అయింది. ఈ ప్రయత్నాన్ని మరింత ముందుకు తీసుకుపోవటానికి మూడు దేశాలు కలిసి కట్టుగా పని చేస్తాయని ఆశిద్దాం. వీ

***మానవ హక్కుల ఉద్యమకారుడు బాలగోపాల్ విలక్షణ వ్యక్తిత్వాన్నీ, నమ్మిన విలువల పట్ల ఆయన నిబద్ధతనూ వివరిస్తున్నారు* జి. లచ్చయ్య**

# ఉరితాళ్లను ప్రశ్నించిన వ్యక్తి

**మా**వోయిస్టు పార్టీ అధికారంలోకి వస్తే బాలగోపాల్ ఎవరి పక్షం వహిస్తాడని ప్రశ్న వేసుకుంటే – 'ప్రజల పక్షం' అని నిస్సందేహంగా సమాధానం వస్తుంది. రాజ్యం ఏదైనా, ఎవరు అధికారంలో ఉన్నా ఆయన వకాలతు పుచ్చుకునేది ప్రజల పక్షమే. ఇది కొందరికి రుచించవచ్చు; మరికొందరికి రుచించకపోవచ్చు.

రాజ్యహింసను ప్రశ్నించడం బాలగోపాల్‌తో మొదలుకాలేదు. బాలగోపాల్‌తో అంతంకాదు. చరిత్ర తెలిసిన వారికి, ఆయా కాలాల్లో రాజ్యాన్ని ప్రశ్నించిన వారు, పోరాడిన వారు కనపడతారు. ప్రాణత్యాగం చేసినవారు, హత్య గావించినవారు ఉన్నారు. కేంద్రంలో, రాష్ట్రంలో పాలకులు మారినప్పుడు గొంతు మార్చుకున్న పౌరహక్కుల నేతలూ ఉన్నారు. నాడు, నేడు ఎన్నికల ప్రక్రియలతో పాలకులు మారినా, మారని ప్రజల బతుకుల పక్షాన వకాలతు పుచ్చుకున్న ఏకైక వ్యక్తి బాలగోపాల్. రాజ్యహింసతో పాటు, ప్రైవేట్ హింసను (ఇందులో మతకలహాలు, ఫ్యాక్షనిజం, గూండాయిజం, మతమౌఢ్యం మొదలైనవి వస్తాయి) ప్రశ్నించాలని నినదించిన మొదటి వ్యక్తి బాలగోపాల్. ప్రైవేట్ హింస అనగానే అనేకసార్లు నాటి పీపుల్స్ వార్ పార్టీ ద్వారా జరిగిన తప్పిదాలు ప్రధాన చర్చకు రావడం జరిగింది. ప్రైవేట్ హింసను ప్రశ్నించడానికి స్వయంగా ప్రభుత్వం, ప్రభుత్వ యంత్రాంగం, పాలకపక్షం వహించే మీడియా ఉంది కదా అనే చర్చ కూడా లేవనెత్తడం జరిగింది. ఈ నేపథ్యమే ఆయన్ని పౌరహక్కుల సంస్థ నుంచి దూరం చేసింది.

ఈ సందర్భంగానే మార్క్సిస్టు మేధావుల చర్చకు ఆయన కేంద్ర బిందువయ్యాడు. పౌరహక్కుల సంస్థలో వివిధ వామపక్ష పార్టీల, ప్రధానంగా సిపిఐ (ఎం.ఎల్.) భావజాలాలు కలిగిన సమూహంగా ఆనాడు పౌరహక్కుల సంస్థ నడిచేది. ప్రైవేట్‌హింస పేరుతో పీపుల్స్ వార్‌ను 'టార్గెట్' చేయడం బాలగోపాల్ ఆలోచనా విధానమని భావించిన పౌరహక్కుల సంస్థలోని మెజారిటీ సభ్యులు ఈ అంశంపై చర్చకు పెట్టడం, మెజారిటీ బాలగోపాల్ వాదనను తిరస్కరించడంతో, కొద్దిమంది అనుచరులతో (పీపుల్స్ వార్ సిద్ధాంతాలతో, రాజకీయాలను విభేదించే ఇతర ఎం.ఎల్. పార్టీల సానుభూతిపరులు) బయటకు రావడం, నక్సలైట్ ఉద్యమాన్ని 'చీకటి కోణం'గా అభివర్ణించి వ్యాసం రాయడం, చాలా మందికి, ముఖ్యంగా ఆయనంటే అభిమానించే వారికి కూడా నచ్చలేదు. ప్రజా ఉద్యమాల్లో, విప్లవ పోరాటాల్లో సామాన్యులు, ప్రజలు కూడా బలికావడం జరుగుతుంది. మరణాలు సంభవిస్తాయి. నిజానికి పీపుల్స్‌వార్ ద్వారా అప్పుడప్పుడు కొన్ని తప్పిదాలు జరగడం, తర్వాత వాటిని ఆ పార్టీ స్వీయ విమర్శ పేరున ఒప్పుకోవడం, బహిరంగ క్షమాపణలను కోరడం జరుగుతూనే ఉంది. (ఈ కోవలోకి చెందినదే – నిజామాబాద్‌లో సరళ హత్య, మానాల గిరిజనుల పై జరిగిన దమనకాండ – కాకతీయ రైలు బోగి అంటించడం మొదలైనవి) ఇలాంటి తప్పిదాలను ఇప్పటికీ ఆ పార్టీ సానుభూతిపరులు సందర్భానుసారంగా తప్పుపడుతూనే ఉన్నారు. విశాల ప్రాతిపదిక పనిచేస్తూ, దీర్ఘకాల పోరాట పంథాను ఎంచుకున్న పార్టీ నిర్మాణం రీత్యా, అవగాహన రీత్యా అందరిని ఆ పార్టీ సిద్ధాంతంతో సరితూచడం సరికాదు. పార్టీలో చేరేవారిని కాచి వడపోచి చేర్చుకోవడం చాలా సందర్భాలలో కుదరని పని. దీంతో స్వయంగా పార్టీ అనేకసార్లు మూల్యాన్ని చెల్లించుకున్నది కూడా. ఇది కూడా జరగకుండా పార్టీ చూడాలని అంటే, ప్రపంచ వ్యాప్తంగా విప్లవాలు విజయవంతం అయ్యేవి కావు. పీపుల్స్‌వార్ లాగానే ప్రపంచంలో చాలా విప్లవపార్టీలు నష్టాన్ని చవిచూడడం, పార్టీల ద్వారా సామాన్య ప్రజానీకానికి నష్టం జరుగుతూనే ఉన్నాయి.

బాలగోపాల్ లాంటి స్పష్టత కలిగిన మేధావులకు ఈ అంశాలన్నీ తెలియకనో, లేదా తన పంథా మార్చుకుని ఈ విధంగా ప్రైవేట్ హింస నినాదం కింద పీపుల్స్‌వార్ (నేటి మావోయిస్టు) పార్టీని విమర్శించాలనే ఆలోచనతో ఉన్నదో అర్థం కాని ప్రశ్నగానే మిగిలిపోయింది. ఆయన కిడ్నాపు తర్వాత ఆయన ఆలోచన సరళిలో మార్పు వచ్చిందని కొందరు భావించిన వారు లేకపోలేదు. దీనికి రెండు సమాధానాలు – ఒకటి – ఆయన అప్పుడు, ఇప్పుడు గతంలో పనిచేసిన విధంగానే పనిచేయడం, రాజకీయ బేధాభిప్రాయాలకు తావివ్వకుండా పౌరహక్కులకై పనిచేయడం జరిగింది. రెండవది – ఈ మధ్యన మరికొంత ముందుకెళ్లి ఛత్తీస్‌ఘడ్‌లో గుత్తికోయలపై జరుగుతున్న హింసకు మావోయిస్టులను కూడా బాధ్యుల్ని చేయడం, బుద్ధదేవ్ భట్టాచార్యపై జరిగిన దాడిని ఖండించడం; మానవీయ కోణంలో ఇవి సరిగానే కనపడినా – రాజ్యహింసను ఏ విధంగా తట్టుకోవాలో ప్రజలకు గాని, ఆ ప్రజల పక్షాన పోరాటం చేస్తున్న వివిధ పార్టీలకు గాని ఓ రాజకీయ సిద్ధాంతాన్ని చెప్పలేని స్థితిలో మాత్రం బాలగోపాల్ ఉండిపోయారు. తుపాకిని తుపాకితో ఎదుర్కోవడంలో పరిమితులుండాలనడం సమంజసమైన వాదన కాదు. ఈ బలమైన వాదననే ఆంధ్రప్రదేశ్‌లో చర్చలు విఫలం కావడానికి దారి తీసింది. బాలగోపాల్ భావించినట్లు నక్సల్బరీ చీకటి కోణమయితే

అసలు విప్లవమే ప్రశ్నార్థకంగా మారుతుందని, బాలగోపాల్ చీకటి దారిలో నడుస్తున్నారని ఆయనపై పుస్తకాలు రాసినవారు ఉన్నారు. ఏది ఏమైనా, తన ఆలోచనను నిర్మొహమాటంగా ప్రకటించిన నిజాయితీపరుడు బాలగోపాల్. (బాలగోపాల్ వాదనను సమర్థించడమా, వ్యతిరేకించడమా అనేది ఇక్కడ చర్చ కాదు. ఎవరి వాదనలు వారికున్నాయి.)

1997లో ఆదిలాబాద్ జిల్లా లక్ష్మణచాంద మండలంలో చిన్నారెడ్డి అనే ఉపాధ్యాయున్ని నాటి పీపుల్స్‌వార్ హత్య చేయడం, హత్యకు సంబంధించిన ఆరోపణలపై విచారణ జరపాలని ఆయన కుటుంబ సభ్యులు నాడు పౌరహక్కుల సంస్థను కోరడం, బాలగోపాల్ కొంతమంది నిజామాబాద్ పౌరహక్కుల సభ్యులతో కలిసి నిజ నిర్ధారణ కమిటీగా (బహుశా ప్రైవేట్ హింసపై మొదటి నిజనిర్ధారణ అయి ఉంటుంది) వెనకా, ముందు ఆలోచించకుండా ఆ హత్యోదంతంపై విచారణ జరిపి, పీపుల్స్‌వార్ ఆరోపించినంత నేరస్తుడు చిన్నారెడ్డి కాదని, చంపడం సరియైంది కాదని, ఎలాంటి భేషజాలకు పోకుండా మొట్ట మొదటిసారి పీపుల్స్‌వార్‌ను తప్పుపట్టిన వ్యక్తి బాలగోపాల్. ఈ విధంగా పీపుల్స్‌వార్ వ్యతిరేకిగా బాలగోపాల్ మారుతున్నారనే ఆరోపణలకు నాంది ప్రస్తావన గావించాడు. అయినా చలించకుండా ముందుకు సాగుతూ, పీపుల్స్‌వార్ తన ఉద్యమాన్ని రివ్యూ చేసుకోవాలనే ప్రస్తావన కూడా తెచ్చాడు. అయితే పార్టీలో చర్చ ఎంతమేరకు జరిగిందో తెలియదు కాని, పౌరహక్కుల సంస్థలో పెద్ద చర్చ జరగడం, బాలగోపాల్ మైనారిటీగా మారడం, బయటికి వచ్చి 1997 అక్టోబర్‌లోనే మానవ హక్కుల వేదికను ఏర్పాటు చేసి, ప్రధాన కార్యదర్శిగా, చనిపోవడానికి ముందు ఉపాధ్యక్షునిగా ఎన్నుకోబడడం, అదే స్ఫూర్తితో పనిచేయడం గమనించాల్సిన అంశాలు.

ఒకవైపు ఆ పార్టీ ఆచరణలో జరుగుతున్న తప్పిదాలను ప్రశ్నిస్తూనే, ఆ పార్టీ భావజాలంతో పనిచేయడం బాలగోపాల్‌లోని ఓ విశిష్టత. పౌరహక్కుల సంఘం నుంచి బాలగోపాల్‌తో బయటికి వచ్చిన వారంతా పీపుల్స్‌వార్ భావజాలానికి వ్యతిరేకంగా, ఇతర ఎం.ఎల్. పార్టీల సానుభూతిపరులుగా ఉన్న వ్యక్తులే అయినా, వారి భావజాలంతో బాలగోపాల్ రాజీపడినట్లు గానీ, వారి అజమాయిషీలో పని చేసినట్లుగానీ ఎక్కడా కనపడదు. ఇదో విలక్షణమైన గుణం బాలగోపాల్‌ది. పైగా ప్రజల పక్షాన పోరాడాతున్న ఏకైక పార్టీగా మావోయిస్టు పార్టీని భావిస్తూ – ఆ సంస్థ, ఆ సంస్థ సభ్యులు ఎదుర్కొనే అన్ని ఇబ్బందుల్ని, పట్టించుకొని బాసటగా నిలిచారు. నిర్ద్వంద్వంగా ఎన్‌కౌంటర్లను వ్యతిరేకిస్తూ, ఎన్‌కౌంటర్లన్నీ పోలీసు హత్యలేనని, హత్యా నేరం కింద పోలీసులపై కేసులు పెట్టాలని, హైకోర్టులో కేసు వేసి గెలిచిన వ్యక్తి బాలగోపాల్. చాలా సందర్భాలలో, అందునా ఎన్‌కౌంటర్ల లాంటి సందర్భాలలో అంటిముట్టనట్లుండే న్యాయ వ్యవస్థను కూడా కదిలించగలిగిన నేర్పరి. ఎన్‌కౌంటర్లపై కించెత్తు ఆలోచనను పోలీసుల్లో కలిగించారు. ఈ విధంగా ఏపిసిఎల్‌సి నుంచి బయటకి వచ్చినా, ఆ సంస్థ భావజాలానికి వన్నె తగ్గకుండా పనిచేసి, ఉరితాళ్లను నిరంతరం ప్రశ్నించిన అరుదైన వ్యక్తి.

పౌరహక్కుల ఉద్యమాల్లో, ప్రజాసంఘాల్లో, వామపక్ష భావ జాలంతో వృత్తి, ఉద్యోగ సంఘాల్లో చాలామందే పని చేస్తున్నారు. గతంలో చేసారు. రాజకీయ లక్ష్యంతో, సాయుధ పోరాటమే మార్గమని నమ్మి, అన్నింటిని వదులుకొని ఉద్యమ మార్గాలను పట్టిన వారు వేల సంఖ్యలో ఉన్నారు. తమ లక్ష్య సాధనలో అమరులైన వారూ ఉన్నారు. వీరిని స్వార్థం, కుటుంబం, సుఖలాలస జీవితం, ఏవి దరిచేరవు. ఉద్యమబాట ఎంచుకున్న నాడే, ప్రాణాల్ని ఫణంగా పెట్టి ఉద్యమానికే అంకితమైతారు. వీరితో బాలగోపాల్‌ను పోల్చడం సరియైంది కాకపోయినా, ఆయన మాత్రం జనారణ్యంలో నిత్యం శత్రువు మధ్యన ముప్పై ఏళ్లు గడిపాడు. ఇదే ఓ విచిత్రం. ఆయన లాంటి పని విధానంతో ఇంతకాలం శత్రువు తూటాలకు బలికాకపోవడమే ఆశ్చర్యం వేస్తుంది. (ఆయన కొన్ని విషయాలలో రాజీ పడుతున్నాడనే వారు ఉన్నారు.) కొంతమంది పోలీసుల్ని పీపుల్స్‌వార్ కిడ్నాప్ చేసినందుకు ప్రతీకారంగా బాలగోపాల్‌ను పోలీసులు కొత్తగూడెంలో కిడ్నాప్ చేసారు. అవి నిర్బంధం తీవ్రంగా ఉన్న రోజులు. ప్రజా సంఘాలన్ని చిందరవందరయ్యాయి. పౌరహక్కుల నేతల్ని అరెస్టు చేయడం, కోబ్రాల పేరున బెదిరించడం, చంపడం జరుగుతున్న రోజులవి. నిర్బంధాన్ని తట్టుకోలేక ఉద్యమ దారి నుంచి తప్పుకున్న వారూ ఉన్నారు. బాలగోపాల్ కూడా ఉద్యమ బాట వీడుతాడని భావించిన వారు లేకపోలేదు. 'మా పోలీసు వాళ్లని విడిచి పెట్టమని పత్రికా ముఖంగా మీరు పీపుల్స్ వార్‌ను కోరితే, మిమ్మల్ని విడిచి పెడుతామని' పోలీసులు బాలగోపాల్‌ను కోరగా, నేను స్వేచ్ఛగా ఉన్నప్పుడు ఆ మాట కోరతాను గాని మీ చెరలో కాదని నిర్భయంగా, నిజాయితీతో, ప్రాణానికి భయపడకుండా సమాధానం చెప్పిన వ్యక్తి బాలగోపాల్. (అప్పన్నుంచే బాలగోపాల్ సరళిలో కొంత మార్పు వచ్చిందనేది కొందరి వాదన.)

బహుశా చరిత్ర తెలిసిన వారెవరు ఆయన్ని ఎవరితో పోల్చలేరు. లేదా ఆయనతో పోల్చదగిన వ్యక్తులు (ఇంతకన్నా గొప్ప వారుండవచ్చు.) కూడా దొరకరేమో. మనిషన్నప్పుడు కొన్ని బలహీనతలుండవా? సంసారం, పిల్లలు, సుఖాలు, సెలవులు, ఎంటర్‌టైన్‌మెంట్లు – ఎప్పుడూ ప్రజల సమస్యలేనా? ఇవి సాధారణంగా, ప్రజా, వృత్తి సంఘాల్లో పని చేస్తున్నవారు అప్పుడప్పుడు వేసుకునే ప్రశ్నలు. కాని వీటన్నింటికి బాలగోపాల్ అతీతుడంటే ఆశ్చర్యం కావచ్చు. అర్ధరాత్రి, అపరరాత్రి, ఎక్కడ కిడ్నాపు జరిగినా, ఎన్‌కౌంటర్ జరిగినా, ఎవరినైనా నిర్బంధించినా, 'అయ్యో బాలగోపాల్‌కు చెప్పారా?' అనే ప్రశ్న గత దశాబ్దాల కాలంగా వస్తున్నది. సమాచారం తెలిసిందే తడవుగా తనదైన శైలితో సంఘటన చుట్టూ, ముందు తిరగకుండా, వెంటనే పోలీసు పెద్దలకు, హోం మంత్రికి, అవసరమైతే ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియాకు, ఇతర పౌరహక్కుల నేతలకు, అన్ని మీడియాలకు సమాచారానిచ్చి, కోర్టు సహాయాన్ని పొందేవాడు. సమస్య చెప్పిన వారు డబ్బులిస్తారా, కోర్టు ఫీజులు, ఖర్చులు, కాగితాల ఖర్చులిస్తారా, లాయర్ ఫీజు ఇస్తారా – ఇచ్చినప్పుడు చూసుకుందాంలే అనే ఆలోచనలకు తావివ్వకుండా సంఘటనలను వెలుగులోకి తెచ్చి, వందలాది మందికి ప్రాణనష్టం జరగకుండా కాపాడిన మానవతా వాది బాలగోపాల్. ఆ విధంగా ముందు జాగ్రత్త చర్యలు చేపట్టి, వెంటనే సంఘటన స్థలానికి ఎవరు వచ్చినా, రాకపోయినా, సహకరించినా, సహకరించక పోయినా ఒంటరిగా, రాత్రి, పగలు అనే తేడా లేకుండా, ఎండా వాన, చలిలను లెక్కచేయకుండా, ప్రయాణ సాధనాలు లేని అనేక మారుమూల

ప్రాంతాలకు సైకిల్‌పై, కాలి నడకన వెళ్లి గిరిజనులకు, దళితులకు, అణచబడిన వర్గాలందరికి దగ్గరయ్యాడు. ఎక్కడికి వెళ్లినా తన అవసరాలకు అడగకుండా, ఎవరిని ఇబ్బంది పెట్టకుండా, తిన్నా, తినకున్నా తన లక్ష్య సాధన కోసం నిరంతరం పరితపించి ఆచరించిన వ్యక్తి బాలగోపాల్. ఎవరైనా పౌరహక్కుల నేతల దగ్గరికి పోవడానికి తెలిసిన వారి సహాయాన్ని కోరుతారు. కాని బాలగోపాల్ దగ్గరికి చిన్న పిల్లవాడు వెళ్లినా పలకరించి పనిచేసి పెట్టాడు గాని, కాదని ఏనాడు అనలేదు. ఇదే ఆయనలోని విశిష్టత.

పౌరహక్కుల వేదిక నుంచి, మానవ హక్కుల వేదికకు చిరునామా మార్చినా, పనితనంలో మార్పులేని వ్యక్తి, స్నేహితులని దూరం చేసుకోలేని స్నేహశీలి. ఆయనను నేరుగా, చాటుగా విమర్శించిన వ్యక్తుల పట్ల, సంస్థల పట్ల ఆయన చూపిన దార్శనికత మరువరానిది. ఆయనను విభేధించిన వారే ఆయన సహకారాన్ని పొందడం, ఎలాంటి భేషజాలకు పోకుండా, నిగర్వీగా పౌరహక్కుల ఉద్యమానికి తలవంచి పనిచేయడం అందరితో కాని పని.

మరణించిన వారికి సానుభూతి చూపడం, బాధపడడం సహజం. కొందరు మరణాన్ని రాజకీయ కోణంతో చూస్తారు. ఆ వ్యక్తికుండే మద్దతును బట్టి స్పందన ఉంటుంది. కాని బాలగోపాల్ మరణం వీటన్నింటికి అతీతమైంది.

ఈ నెల రోజుల కాలంలో ఆంధ్రప్రదేశ్ మూడు ముఖ్యమైన ఘటనలను చవి చూసింది. – వై.ఎస్.ఆర్. మరణం, వరదలు, బాలగోపాల్ మరణం. వై.ఎస్.ఆర్. మరణాన్ని రాజకీయ లబ్ధికి వాడుకున్న నేతలు పడినపాట్లు, ఆయన మరణం తర్వాత 'అయ్యో ఆపన్న హస్తం ఇక లేదా' అని గుండెపగిలి చచ్చారని వందలకొద్ది లిస్టుల్లోకి ఎక్కినవి నిజమైన గుండె చెదిరిన మరణాలని భావిస్తే, ఏకధాటిగా ప్రసారం చేసిన మీడియాల భాష్యం నమ్మితే – ఈ ఆపన్న హస్తానికి ఎదురు చూస్తున్న వారి పక్షాన నిలబడి రూపాయి ఆశించకుండా, ఏమి దాచుకోకుండా, తన ఆరోగ్యాన్ని సైతం లెక్క చేయకుండా (చనిపోయిన రోజు మధ్యాహ్నం కోర్టులోనే ఎక్కిల్లు వస్తుంటే, హాస్పిటల్‌కు వెళ్దామని ఆయన జూనియర్, మాజి లెక్చరర్ రాజేశం కోరినా – వద్దులే, ఏం కాదని భావించి ప్రాణానికి ముప్పు తెచ్చుకున్న వ్యక్తి) తన స్నేహ హస్తాన్ని అందించిన బాలగోపాల్ మరణంతో ఏ మరణమైనా పోటీ పడగలదా!?

బహుశా ఆయన వేసిన కేసులు, ప్రజా వ్యాజ్యాలు, దేశంలో, ప్రపంచంలో ఎవరు వేయలేరంటే ఆశ్చర్యం కావచ్చు. ఆయన సాధారణ మనిషైతే గిన్నీసు బుక్కులోకి ఎక్కేవారు. బరాక్ ఒబామాతో నోబెల్ శాంతి బహుమతికి పోటీ పడేవారు. కాని ఆయన స్టాచు ఆఫ్ లిబర్టీకి అందనంత ఎత్తుకు ఎదిగాడనడంలో సందేహం లేదు. వీ

---

*(...10వ పేజీ తరువాయి)*

కాంగ్రెస్‌కు కమ్యూనిస్టుల మద్దతు ఉన్నా, లేకపోయినా, కాంగ్రెస్‌కు బద్ధశత్రువైన యునైటెడ్ ఫ్రంట్ అధికారంలో ఉన్నా – ఎప్పుడూ మంత్రి పదవిలో ఉండగలడు. పోనీ ఏదో నామ్‌కే వాస్తే మంత్రి పదవి కూడా కాదు. అయితే ఆర్థికం, లేకుంటే వాణిజ్యం, కాకపోతే హోం. ఇవేవీ కాకపోతే, కార్పొరేట్ లాయర్‌గా ప్రాక్టీస్! ఈయనంటే అందుకేనేమో, మన్మోహన్‌కు అంత ఇష్టం.

కార్పొరేట్ కంపెనీలతో కుమ్మక్కై, వేలాది కోట్ల ప్రజాధనం వృథా కావడానికి కారణమైన, స్టాక్ మార్కెట్లలో లక్ష కోట్ల రూపాయల చిన్న మదుపర్ల డబ్బు పోవడానికి కారణమైన, సరళీకృత ఆర్థిక విధానాలు తప్ప మరో రాజకీయ సిద్ధాంతం లేని చిదంబరానికి దేశానికి ఎవరు ముప్పో తీర్పునిచ్చే అర్హత ఉన్నదా?

మన్మోహన్‌కు అత్యంత ఇష్టుల్లో మరొకరు జి.కె. పిళ్లై. మన్మోహన్‌కు, చిదంబరంకు ఉన్నంత ప్రాచుర్యం ఈ ఐఎఎస్ ఆఫీసర్‌కు ఉండకపోవచ్చు. కానీ, ప్రభుత్వంలో ఈయన పాత్ర ఎంత ఉన్నదంటే, ప్రత్యేక ఆర్థిక మండలాలకు (ఎస్ఇజెడ్) ఈయనే రూపశిల్పి. 235 ఎస్ఇజెడ్‌లకు స్వయంగా ఈయనే పచ్చజెండా ఊపాడు. దేశం నలుమూలలా తిరిగి ఎస్ఇజెడ్‌ల ఆవశ్యకత గురించి ప్రచారం చేశాడు. వాణిజ్యశాఖ కార్యదర్శిగా ఉంటూ ఎస్ఇజెడ్‌లకు విశ్వసనీయత కలిగించే ప్రయత్నం చేశాడు. నోరు విప్పితే చాలు, ఎస్ఇజెడ్‌ల వల్ల ఎన్ని లక్షల కోట్ల పెట్టుబడి వస్తుందో, ఎన్ని లక్షల మందికి ఉద్యోగాలు వస్తాయో చెప్తాడు. ప్రజలెప్పుడూ చిన్న కమతాలపై బతకాల్సిందేనా, రోజుకు యాభై రూపాయల ఆదాయంతో ఉండాల్సిందేనా అని ప్రశ్నిస్తాడు. ఆ భూములన్నీ పారిశ్రామికవేత్తలకు అమ్మితే దేశం బాగుపడుతుంది కదా అని ప్రశ్నిస్తాడు. ఎస్ఇజెడ్‌ల కోసం భూమిని ప్రభుత్వం ఎందుకు సేకరించాలి అని అడిగారనుకోండి, 'మరి ప్రైవేట్ కంపెనీలకు కష్టం కాదా' అని మిమ్మల్నే ప్రశ్నిస్తాడు. 'భూమి పోతోందో' అని ఎందుకు గగ్గోలు పెడతారో అర్థం కావడం లేదు. మొత్తం భూమిలో ఒక శాతం కంటే తక్కువే పోతుంది కదా! ఎందుకింత రాద్ధాంతం' అని వాదిస్తాడు.

'కానీ ఇందుకు సారవంతమైన భూములే ఎందుకు కావాల'ని అడిగితే దాటేస్తాడు.

మరి ఈయనకి మావోయిస్టులంటే ఎందుకు కోపం ఉండదు? కళింగనగర్ (ఒరిస్సా), నందిగ్రామ్, సింగూర్ (పశ్చిమ బెంగాల్), ఇంకా జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్, ఒరిస్సా, బీహార్ రాష్ట్రాల్లో ఎన్నో ఎస్ఇజెడ్‌లకు, ప్రాజెక్టులకు వీళ్లు 'అడ్డుగా' ఉన్నారు. ఎట్లా ఎదుర్కోవాలి ఈ సమస్యను?

ప్రధానమంత్రి ఆధ్వర్యంలోని అత్యున్నతస్థాయి నియామకాల సంఘం పిళ్లైను హోంశాఖ కార్యదర్శిగా నియమించింది. ప్రధానే స్వయంగా ఈయన పేరును సూచించాడు. ఈయన మొట్టమొదటి ప్రాధాన్యతాంశం సహజంగానే గ్రీన్‌హంట్!

దశాబ్దాల తరబడి ప్రపంచ బ్యాంక్‌కు ఊడిగం చేసిన మన్మోహన్ సింగ్, ఏళ్లతరబడి కార్పొరేట్ల ప్రాపకంలో ఉన్న చిదంబరం, దేశంలో బహుళజాతి సంస్థలకు స్వతంత్ర భూభాగాలను సృష్టించిన పిళ్లై – వీరు ముగ్గురూ కలిసి ఇప్పుడు దేశానికి ఎవరు శత్రువులో మనకి చెబుతున్నారు! ఈ దేశ సార్వభౌమత్వానికీ, అంతర్గత భద్రతకూ ఎవరు ముప్పు? వీ

*అమెరికా, ఇతర అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక సంక్షోభపు లోతుపాతులను వివరిస్తూ మన దేశంపై అది కలిగించిన, కలిగించనున్న ప్రభావాన్ని విశ్లేషిస్తున్నారు* **అరవింద్**

# ముంచుకొస్తున్న మహామాంద్యం

*(గత సంచిక తరువాయి)*

**ఆ**రు వందల బిలియన్ డాలర్లున్న రష్యా విదేశీ మారకపు నిల్వలు కేవలం సెప్టెంబర్, అక్టోబర్ మాసాల్లోనే 50 శాతానికి తగ్గాయి. సెప్టెంబర్ నాటి ఆర్.టి.ఎస్. స్టాక్ నుంచి 54 శాతం తగ్గింది. ఎన్నటికీ తిరిగి కోలుకోలేని అమెరికా తనఖా మార్కెట్‌లో రష్యా కేంద్ర బ్యాంక్ 100 బిలియన్ డాలర్లను మదుపు చేయడం వల్ల రష్యా ఆర్థిక వ్యవస్థ చంచల పరిస్థితి మరింత దిగజారింది. 1950ల నుండే ఆహారం, కాగితం లాంటి మన్నికేతరమైన వస్తువులపై ఖర్చు తీవ్రంగా తగ్గుతూ వచ్చింది. మూడో త్రైమాసికంలో వ్యయార్హ ఆదాయాలు 8.7 శాతం తగ్గాయి. 1947 నుండి నమోదైన రికార్డుల్లో ఇదే అత్యధికం.

'ప్రపంచీకరించబడిన' ఆర్థిక వ్యవస్థలో వెనకబడ్డ దేశాలు తప్పకుండా ఘోరంగా దెబ్బతింటాయి. ఇదంతా విదేశీ పెట్టుబడితో విడదీయరానంతగా ముడిపడి, దానిపై ఆధారపడి ఉంది. విదేశీ పెట్టుబడి ఆకస్మిక ఉపసంహరణ స్టాక్ ఎక్స్ఛేంజ్‌లను దెబ్బతీయటమే గాక, పరపతి లభ్యతను కూడా దెబ్బతీసింది. అంతేగాక ఈ దేశాలన్నీ మార్కెట్లు, ఉత్పత్తి కోసం సామ్రాజ్యవాదులతో భారీగా పెనవేసుకొన్నాయి. ఆసియాలో కేవలం ఎగుమతులే జి.డి.పి.లో 43 శాతం ఉన్నాయి. ఆర్థిక వ్యవస్థలోని విశాలమైన రంగాలు బహుళజాతి సంస్థలకోసం ఉత్పత్తుల, విడిభాగాల, సేవల ఔట్‌సోర్సింగ్ (ఒక దేశం ఇతర దేశాల సంస్థలకు శ్రమచేయటం లేదా విదేశానికి స్వదేశీ శ్రమనందించటం)లో నిమగ్నమయ్యాయి. ఈ మూడు రంగాల్లో (పెట్టుబడి, ఉత్పత్తి, మార్కెటింగ్) వెనకబడ్డ దేశాలు సామ్రాజ్యవాద ఆర్థిక వ్యవస్థలపైనా, బహుళజాతిసంస్థలపైనా ఆధారపడటం మనం చూస్తాం. ప్రభావం ఇక్కడ వినాశకరంగా ఉంటుంది. ఇది ఇప్పటికే స్టాక్‌ఎక్స్ఛేంజ్‌ల పతనాలు, విదేశీ మారక నిల్వల తగ్గుదల, తమ కరెన్సీలు బలహీనపడటం, ఎగుమతుల ఆర్డరులో తగ్గుదల, తత్ఫలితంగా నిరుద్యోగం, వగైరాల్లో కనపడింది. చైనాలో కూడా జనవరి నాటికి దానివర్తక మిగులు (ట్రేడ్ సర్‌ప్లస్) 11 శాతానికి పడిపోయింది. మామూలుగానే 10–20 శాతం మధ్య ఉన్న దాని వృద్ధిరేటు 7.5 శాతానికి తగ్గుతుందని అంచనా వేయబడింది. ఆసియాపై దృష్టి సారించిన 70 హెడ్జ్ ఫండ్లు కూడా జనవరి నుంచి మూతపడ్డాయి. ఈ సంక్షోభాన్ని సర్దుబాటు చేయడానికి 10 మంది సభ్యులుగల ఆగ్నేసియా దేశాల కూటమి ఒక నిధిని ఏర్పాటు చేసింది. ఈ మొత్తం నిధిలో చైనా (800 బిలియన్ డాలర్లు), జపాన్, దక్షిణ కొరియాలు 80 శాతం సమకూరుస్తాయి.

అక్టోబర్ మొదటి వారంలో గ్లోబల్ వస్తు ధరలు 50 సంవత్సరాల కాలంలో అత్యంత భారీగా తగ్గాయి. జూలై నుండి 40 శాతం పైగా తగ్గిన ధరలు ఇప్పుడింకా తగ్గుతున్నాయి. కనుక సంక్షోభం ఇప్పటికే అన్ని దేశాలకు, అన్ని రంగాలకు వ్యాపించింది. అయితే ద్రవ్య భూకంప కేంద్రస్థానం ప్రపంచ అతిపెద్ద ఆర్థిక వ్యవస్థ అయిన అమెరికా సంయుక్త రాష్ట్రాలు.

మనదేశాన్నే తీసుకుందాం. ప్రధానమంత్రి, ఆర్థిక శాఖ మంత్రుల మితిమీరిన వాదనలకు భిన్నంగా, ఆర్థిక వ్యవస్థ ఇప్పటికే బాగా దెబ్బతిన్నది. జనవరి 2008లో 21,207 తారా స్థాయికి చేరుకున్న బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజ్ (బి.ఎస్.ఇ.) వాటా సూచీ అక్టోబర్ ఆఖరు నాటికి 60 శాతం పడిపోయింది. దీనికి కారణం విదేశీ సంస్థాగత మదుపుదార్లు (ఎఫ్.ఎ.ఐ.లు) 12 బిలియన్ డాలర్ల భారీ మొత్తాన్ని ఉపసంహరించుకోవటమే. నవంబర్ 21న బి.ఎస్.ఇ. సూచీ 38 నెలల కనిష్ట స్థాయికి అంటే 8451 కి చేరుకొంది. రియల్ ఎస్టేట్ స్టాకులు 90 శాతానికి, మ్యూచువల్ ఫండ్స్ 80 శాతానికి పడిపోయాయి. ఈనాడు కోట్ చేయబడిన 2,699 కంపెనీల్లో సగం ఖాతా విలువ కంటే తక్కువగా ఉన్నాయి. విదేశీ నిధుల్ని ఉపసంహరించుకొన్న కారణంగా స్టాక్ మార్కెట్ కుప్పకూలటమే కాకుండా 50 మార్క్ కంటే తగ్గటానికే 2008 ఆఖరు నాటికి కొద్దివారాల్లోనే రూపాయి 15 శాతం క్షీణించింది.

విదేశీ వర్తకం, సేవలు మన జి.డి.పి.లో 40 శాతం ఉన్నాయన్నప్పుడు, ఎగుమతులు ఇదివరకే తీవ్రంగా దెబ్బతిన్నాయని పేర్కొనవచ్చు. ఉదాహరణకు ఆగస్ట్ నుండి ఇనుప ముడి ఖనిజ ఎగుమతుల్లో 50 శాతం తగ్గుదల ఉంది. దీనివల్ల నౌకాశ్రయాల్లో 4 మిలియన్ టన్నుల నిల్వలు పేరుకుపోయి ఉన్నాయి. మూడు నెలల క్రితం ఉన్న ఒక టన్ను 140 డాలర్ల నుండి ధరలు 50 శాతానికి తగ్గాయి. సిమెంట్ ఆర్డర్లు తగ్గిపోవటం వల్ల అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీ తన సిబ్బందిలో 25 శాతాన్ని తగ్గించింది. చిన్నపాటి టెక్స్‌టైల్ సంస్థలు పతనమవుతున్నాయి. ఎగుమతుల ఆర్డర్ల రద్దువల్ల కొద్దినెలల తర్వాత దాదాపు 4 లక్షల గార్‌మెంట్ (దుస్తుల తయారీ) వర్కర్లు ఉద్వాసనకు గురయ్యే అవకాశముంది. దూదిదారపు కండెలు, ఇతర ఉత్పాదకాల (ఇన్‌పుట్స్) ధరలు భారీగా పెరగటం వల్ల చిన్నతరహా సంస్థలు జనవరి నుండి 400 కోట్ల రూపాయలు నష్టపోయాయి. త్రిపుర టెక్స్‌టైల్ కేంద్రం ఒక్కటే తన యూనిట్లలో 25 శాతాన్ని మూయనున్న

కారణంగా, రాబోయే కొద్ది నెలలలో యాభై వేల ఉద్యోగాల్ని కోల్పోతుంది. లూథియానాలోని వస్త్ర తయారీదార్లు, ఎగుమతిదార్లు తమ వ్యాపారంలో 30 శాతం పోగొట్టుకున్నారు. దీనికి కారణం, 35 లక్షల శ్రామికులు (15 లక్షల వలసదార్లు) పని చేస్తున్న ఈ పరిశ్రమను సంక్షోభం తీవ్రంగా దెబ్బతీయడమే. మీరట్‌లో ముప్ఫై వేల మంది స్వర్ణ వృత్తిదార్లలో (వీరు ఎక్కువగా బెంగాలీలే) 20 శాతంపైగా ఇంటి ముఖం పట్టారు. సూరత్‌లో 20 శాతం వజ్రాల యూనిట్లని మూసివేశారు. మిగిలిన వాటిలో పనిలేదు. ఎగుమతుల తగ్గుదల వల్ల, డాలర్‌తో పోల్చితే రూపాయి విలువ పడిపోవటం చేత ముడి వజ్రాల వ్యయాల్లో పెరుగుదల వల్ల ఈ పరిశ్రమ బాగా దెబ్బతిన్నది. అడ్డదిడ్డంగా ఉండే ముంబాయి మురికివాడ, ధారవి తోలు బెల్టుల ఎగుమతులు నెలకు డెబ్భై వేల నుంచి మూడు వేలకు పడిపోయాయి.

ఇదేగాక, ఇంకా బాగా దెబ్బతిన్నవి - బిజినెస్ ప్రాసెసింగ్ ఔట్‌సోర్సింగ్‌లు (బి.పి.ఒ.), ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ (ఐ.టి.)లతో కూడిన సేవలు తమ మనుగడ కోసం విదేశీ ఆర్డర్లపై ఆధారపడ్డాయి. ఇప్పటికే ఇవి చాలావరకు మూసివేతల్ని ఎదుర్కొంటున్నాయి. ఉనికిలో ఉన్న సంస్థలు వేగంగా ఉద్యోగాల్లో, జీతాల్లో, సౌకర్యాల్లో కోతలు విధిస్తున్నాయి. జెట్ ఎయిర్‌వేస్ లాంటి భారత వైమానిక రవాణా సంస్థ భారీ స్థాయిలో ఉద్యోగుల్ని తొలగించింది. తర్వాత కొద్దిమంది సిబ్బందిని, గతంలో వాళ్లు పొందే జీతాలను తగ్గించి, తిరిగి తీసుకుంది. వాణిజ్య కుటుంబాల అత్యున్నత సంపన్నమైన ఆసోచామ్ (అసోసియేటెడ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ) 2008 అక్టోబర్‌లో వెల్లడించిన నివేదికలో 'విధుల కొనసాగింపుకు' భారతీయ కంపెనీలు తమ శ్రామిక శక్తిలో 25 శాతం కోత విధిస్తాయని ప్రకటించింది. తొలుత ఏడు కీలక పారిశ్రామిక రంగాల్లో - స్టీల్, సిమెంట్, ఐ.టి. సంబంధిత సేవలు - బి.పి.ఒ.లు, ద్రవ్యపరమైన, దళారీ సేవలు, నిర్మాణరంగం, రియల్ ఎస్టేట్, వైమానిక రవాణా - నిలిపివేతలు (లే ఆఫ్‌లు) ఉంటాయని ప్రకటించింది.

ఇది కేవలం ప్రారంభం మాత్రమే. జాతీయం చేయబడిన బ్యాంకులు విదేశాలకు అంతగా బహిర్గతం కానందున, మ్యూచువల్ ఫండ్స్‌ని మినహాయిస్తే, ఇంతవరకు ప్రత్యేకించి పొదుపు మొత్తాలు దెబ్బ తినలేదు. అయితే ఇండస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఐసిఐసిఐ) బాగా దెబ్బతింది. బహుళజాతి సంస్థల (టిఎన్‌సి లు)తో ముడిపడిన ప్రైవేట్ రంగంలో ప్రత్యేకంగా బ్యాంకు, బీమా సౌకర్యాలు వైఫల్యం చెందడానికి బలమైన అవకాశం ఉంది. ప్రపంచ వ్యాప్త మాంద్య విధ్వంసకాలు భారతదేశం లాంటి దేశాన్ని బాగా దెబ్బతీస్తాయి. ఎందుకంటే సామ్రాజ్యవాదులు ఆ సంక్షోభ భారాన్ని వెనకబడ్డ దేశాలపై రుద్దడానికి ప్రయత్నిస్తారు కాబట్టి. ఇప్పటికీ దళారీ ఆర్థిక శాఖ మంత్రి విదేశీ పెట్టుబడికి భారీగా రాయితీల్ని పెంచే వినాశకర చర్యల్ని ప్రకటించారు. ఈ రంగంలో తీవ్రమైన మార్పులు జరుగుతాయని ప్రకటించారు. ఇది బడా పారిశ్రామికవేత్తలకు, ఫైనాన్షియర్ల (దేశీయ, విదేశీయ)కు సహాయపడవచ్చు. అయినా ఇది పరిస్థితిని ఇంకా తీవ్రతరం చేస్తుంది.

రాజ్య జోక్యం (జాతీయికరణ), సంక్షేమ రాజ్యాల కీన్స్ ఫార్ములాల ద్వారా రెండో ప్రపంచ యుద్ధం తర్వాత 1930ల నాటి మహామాంద్యం తన సంక్షోభం నుండి చివరికి గట్టెక్కింది. ఆ రోజుల్లో శక్తిమంతమైన సోషలిస్ట్ శిబిరంతో పోటీ పడాల్సిన స్థితి ఉంది. అయితే సోషలిజం తాత్కాలిక పతనంతో, జాతి విముక్తి ఉద్యమాలు వెనుకంజ వేశాయి. 1970ల నుండి కొనసాగుతున్న ఆర్థిక సంక్షోభం వల్ల నయా ఉదారవాద ఫార్ములాలు ముందుకొచ్చాయి. రీగనిజం, థాచరిజాలు ఫ్యాషనై పోయాయి. కెనీషియన్ వాదం, జాతీయకరణల్ని గేలిచేశారు. ఇక సోషలిస్టు ప్రత్యామ్నాయం సంగతి వేరే చెప్పాల్సిన పని లేదు. 1990లలో నయా ఉదారవాద విధానాలు శిఖరాగ్రానికి చేరుకున్నాయి. వీటి ప్రకారం మార్కెటే నూతన దైవం. అన్ని విషయాలని అదే నిర్ణయిస్తుంది. పెట్టుబడిదారీ విధాన చరిత్రలో ఎన్నడూ చూడని స్థాయిలో అదృష్టాన్ని పోగేసుకున్నారు. నిజానికి, అత్యంత దైన్యీకరణ నేపథ్యంలో ధనిక-పేద మధ్య అఖాతం ఎన్నడూ లేనంతగా పెరిగింది. పెట్టుబడిదారీ 'స్వర్ణ' యుగం ఇక్కడే శాశ్వతంగా ఉన్నట్లు, సోషలిజాన్ని చరిత్ర పాఠ్య పుస్తకాల్లోకి కుదించినట్లు, దీన్నే 'చరిత్ర అంతం'గా చిత్రీకరించారు.

1970ల నాటితో పోల్చితే వృద్ధి రేట్లు పెరిగాయి. అదే నయా ఉదారవాద సైద్ధాంతికవేత్తలకు ఎలిబిగా మారింది. శాస్త్రీయ అనివార్యతా గ్లామర్‌ని కల్పించిన కంప్యూటర్, ఇంటర్నెట్ (అంతర్జాలం), సెల్‌ఫోన్, టి.వి. వగైరాల రూపంలో ప్రసార సాంకేతిక విజ్ఞానంలో వచ్చిన బ్రహ్మాండమైన పరిణామాలు (గెంతులు) నయా ఉదారవాదానికి తోడయ్యాయి. ఉన్నత స్థాయి చిత్రణ కలిగిన మీడియా ఉపరితలం దిగువన ఉన్న ఎటువంటి దైన్యాన్నీ చిత్రించకుండా, సంపద, గ్లామర్ ప్రపంచాన్ని ఉద్ధరించింది. ఇలా నిరంతరం ఊదర గొట్టి మధ్యతరగతి మేధస్సున్ని ఉతికి పారేస్తోంది. ఇందులో ఒక సెక్షన్ సామ్రాజ్యవాద / దళారీ బల్లపై నుంచి విసిరేసిన కొన్ని తునకల్ని తినే అవకాశాన్ని కూడా పొందింది. అతి స్వల్ప అసమ్మతిని 'టెర్రరిస్టు'గా ముద్రవేసి కాలరాస్తారు. ఒకసారి అలా ముద్రపడ్డ తర్వాత, అతడు మనిషిగా ఉండలేడు. అదేదో ప్రమాదకరమైన కీటకమైనట్లు కాలరాయ బడుతుంది. ఈ పటాటోప ప్రపంచంలో దారిద్ర్య పీడితులైన ప్రజా బాహుళ్యం కూడా అస్తిత్వేతరమే.

ఇప్పుడు నయాఉదారవాద ఊహాప్రపంచం బుడగ పేలిపోయింది. చాలా కాలం దాకా తిరిగి కోలుకోలేని విధంగా ఉందా పేలుడు. ఈలోగా అది తనతో పాటే కోటాను కోట్ల ప్రజానీకాన్ని రొంపిలోకి దింపి, వాళ్ల రక్తాన్ని జుర్రుకుంటుంది. ఒక ద్రవ్య బుడగ తర్వాత మరొకటి పేలటానికి నయా ఉదారవాద సైద్ధాంతికవేత్తల దగ్గర సమాధానాల్లేవు. ద్రవ్య నిర్మాణ మూల స్తంభాలు ఒకదాని తర్వాత మరొకటి కుప్పకూలుతున్న నేపథ్యంలో వాళ్లు మొత్తంగా నిస్సహాయ స్థితిలో ఉన్నట్లుంది. అధికార సంపద దేవుళ్లు పతనమవుతున్నారు.

వాళ్ల వద్ద కేవలం తమవైన కోశ ప్రామాణిక సమాధానాలున్నాయి. వడ్డీ రేట్లు తగ్గించడం వాళ్ల ప్రధాన పనిముట్టు. ద్రవ్యత్వాన్ని (అంటే పెట్టుబడిదార్ల కోసం డబ్బు) పెంచడం, ప్రజలు ఖర్చు చేయడానికి సులభంగా పరపతి లభించేలా చూడడం, పతనమవుతున్న మార్కెట్‌ను పునరుద్ధరించడం. అయితే ఇది పనిచేయడం లేదు. అక్టోబర్ 9న అనేక కేంద్ర బ్యాంకులు ఉమ్మడి స్వరంతో మార్కెట్ భయానికి అడ్డుకట్ట వేయడానికి ఉపక్రమించాయి. అమెరికా కేంద్ర బ్యాంకైన యు.ఎస్.ఫెడ్ వడ్డీ రేట్లని 50 బేసిక్ పాయింట్లతో 1.5 శాతానికి తగ్గించింది.

యురపియన్ కేంద్ర బ్యాంక్ వడ్డీ రేట్లని 4.25 శాతం నుండి 3.75 శాతానికి తగ్గించింది. బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్, కెనడా, స్విడన్, స్విట్జర్లాండ్, చైనా కేంద్ర బ్యాంకులు కూడా సెకెండ్ల వ్యవధిలో వడ్డీ రేట్లు తగ్గించాయి.

అయితే ఇది ఈ కుళ్లుని తొలగించలేదు. బ్యాంకులు, ద్రవ్య సంస్థల పతనం, పారిశ్రామిక ఉద్దండుల పతనం కొనసాగింది. వడ్డీ రేట్లు ఇంకా తగ్గాయి. ఇప్పుడు అమెరికా వడ్డీ రేటు 1 శాతంగా ఉంది. జపాన్‌లో ఇది 0.2 శాతం. నవంబర్ 6న ఇంగ్లండ్ మరోసారి వడ్డీ రేట్లను తగ్గించింది. ఈసారి దాన్ని 3 శాతానికి (53 సంవత్సరాల్లో ఇది తక్కువస్థాయి) తీసుకు రావడానికి 1.5 శాతం మేరకు తగ్గించింది.

వాళ్లు నిరాశతో తమ నయా ఉదారవాద సిద్ధాంతాన్ని గాలి కొదిలేశారు. బ్యాంకుల్నీ, మదుపు సంస్థల్నీ, కంపెనీల్నీ కాపాడడానికి బ్రహ్మాండమైన బెయిల్ అవుట్ ప్యాకేజీతో ప్రభుత్వాలు జోక్యం చేసుకున్నాయి. ఇదంతా బహుశా నిందకు గురైన 'జాతీయికరణ'ను యదార్థంగా చేపట్టడమే. వాళ్లు భారీ లాభాల్ని గడిస్తున్నంత కాలం ప్రైవేటీకరణే మంత్రంగా ఉంది. ఇప్పుడు వాళ్లు నష్టాలకు గురవుతూ, కుప్పకూలుతూ ఉండడం వల్ల అది తిరిగి 'జాతీయికరణ'ను చేపట్టింది. అయితే ఈ కెనీషియన్ ప్రత్యామ్నాయం యదార్థమైన పరిష్కారం కాదు. ఇది తక్షణ ఉపశమనాన్ని కలిగించే చర్యే. సోషల్ డెమోక్రట్లు, సిపిఐ, సిపిఎం రకం సోషలిస్టులు ఈ ప్రత్యామ్నాయలనే ఊదరగొట్టవచ్చు. అయితే వాళ్లు 1970లో ప్రారంభమైన సంక్షోభం నేటికీ కొనసాగడానికి దారి తీసిన 1960ల కెనీషియన్ నమూనా గత వైఫల్యాన్ని వివరించాల్సి ఉంది. అంతేగాక సోవియట్ యూనియన్ (పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణ తర్వాత), తూర్పు ఐరోపా దేశాల (ఇవన్నీ బలమైన రాజ్య రంగంపై నిర్మించబడ్డాయి) పతనాల్ని కూడా వివరించాల్సి ఉంది.

మహా మాంద్యాన్ని గుర్తు చేసే ప్రస్తుత సంక్షోభం పెట్టుబడిదారీ ఉత్పత్తి తరహా వ్యవస్థాగత సమస్య. సంక్షోభ మూలాలు పెట్టుబడిదారీ వ్యవస్థలోనే దాగి ఉన్నాయి. దీనికి ఆ వ్యవస్థ లోపల పరిష్కారం లేదు. అసలు విషయం ఆ వ్యవస్థనే కూలదోసి, దాన్ని సోషలిస్టు ప్రత్యామ్నాయంతో పునఃస్థాపించడం ద్వారా ఆర్థిక వ్యవస్థను పునర్ వ్యవస్థీకరిండమే ఏకైక పరిష్కారం.

ఎందుకు? దీనికి సమాధానం చెప్పడానికి మనం ప్రస్తుత సంక్షోభం చరిత్ర, చలనశీలతల్లోకి వెళదాం. వ్యవస్థ లోపల ఏమైనా పరిష్కారం ఉందేమో చూద్దాం.

1930 మహామాంద్యం తర్వాత ప్రపంచ యుద్ధం సంభవించింది. అమెరికా కేంద్రంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో సాపేక్షికమైన వికాసాన్ని యుద్ధానంతర కాలం వీక్షించింది. అయితే ఆయిల్ షాక్, బంగారు ప్రమాణం (లేదా రుణాత్మక) వృద్ధి రేట్లు, వగైరాలతో 1970ల్లో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మరొకసారి సంక్షోభంలో చిక్కుకొంది.

1970ల్లో ప్రారంభమైన ఈ సంక్షోభం, కొద్దికాలం విరామం గల సంక్షిప్త పురోగమనాలతో, నేటికి కూడా కొనసాగుతూ ఉంది. సాధ్యమైనంత గరిష్టంగా వేతనాల్ని తగ్గించడం ద్వారా లాభాలు (పెట్టుబడి సంచయనం) గడించడానికి ప్రయత్నించే పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్గత వైరుధ్యం నుంచి పెట్టుబడిదారీ వ్యవస్థకు జాడ్యంగా మారిన అధికోత్పత్తి సంక్షోభం ఉత్పన్నమైంది. నిరంతర పెట్టుబడి సంచయనం మార్కెట్ నిరంతర వృద్ధిని కోరుకుంటుంది. ఎందుకంటే ఏదో ఒక చోట పెట్టుబడిని మదుపు చేయాలి కాబట్టి. (అలా లేనిచో అది పెట్టుబడే కాదు, కేవలం డబ్బే). అయితే వేతనాలు తగ్గి ఉండడం, ప్రజల అల్ప కొనుగోలు శక్తి వల్ల మార్కెట్లు ఎప్పుడూ నియంత్రించబడుతూ ఉంటాయి. ఈ వైరుధ్యమే అధికోత్పత్తి క్రమబద్ధ సంక్షోభానికి దారితీస్తుంది. పెట్టుబడిదారులు పరిమితమైన చట్రం లోపల మాత్రమే పని చేయగలుగుతారు. అయితే ఈ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి వారు సమర్థులు కారు. దీని ఫలితమే సామ్రాజ్యవాద యుగంలో క్రమబద్ధ సంక్షోభాలూ, మహా మాంద్యాలూ.

1970ల్లో సంక్షోభం ఏర్పడుతుండడంతో ప్రజల కొనుగోలు శక్తి తగ్గింది. అన్ని సంక్షోభాలకీ పెరుగుతున్న నిరుద్యోగం, వేతనాల స్తంభన వగైరాలు తోడుగా ఉంటాయి. కనుక సంచయనమవుతున్న పెట్టుబడికి పునర్ మదుపు చేయడం కోసం మాన్యుఫాక్చరింగ్ (వస్తు తయారీ) రంగం నుంచి బయటకు వెళ్లే మార్గం ఉండదు. అందువల్ల అది శుద్ధ ఫైనాన్స్ రంగంలో ఇతర మార్గాల్ని వెతుక్కుంది. 1980ల్లో పెట్టుబడి సంచయనం ఉన్నత శ్రేణులు, ప్రత్యేకించి పెట్రో డాలర్ల కుమ్మరింపు వల్ల మూడో ప్రపంచంలో రుణాలివ్వడానికి కొత్త మార్గాన్ని కనుగొన్నాయి. 1980ల అంతటా ఇది అంతర్జాతీయ ద్రవ్యనిధి (ఐ.ఎం.ఎఫ్.), ప్రపంచ బ్యాంకుల సహాయంతో భారీ స్థాయిలో కొనసాగింది. మదుపుదార్లకు భారీ రాబడుల్ని అందిస్తూ ఈ దేశాల్ని అగాధపు రుణ అంచుల్లోకి నెట్టివేశాయి. వడ్డీల్ని వసూలు చేయడం ద్వారా అశేష లాభాల్ని గడించడమే గాక, కరెన్సీల మూల్య తగ్గుదల, ఎరవేసి గరిష్ఠ డబ్బును రాబట్టుకోడానికి రుణాల్ని షరతులతో నియంత్రించాయి. ఒక దశాబ్దంలోనే ఈ దోపిడీ తీవ్రమవడం వల్ల ఈ దేశాలు దివాలా లోకి నెట్టబడ్డాయి. వాస్తవానికి ఈ రుణాల్లో అనేకమైన వాటిని రీషెడ్యూల్ చేయాల్సి వచ్చింది. ఈ కాలం, కొద్దిపాటి పురోగమనాలు (రికవరీస్) కలిగి ఉన్నప్పటికీ, క్రమవారీ సంక్షోభాల్ని వరసగా 1973, 1979, 1985, 1987, 1997 సంవత్సరాల్లో గమనించింది. ఇది జపాన్ ఆర్థిక వ్యవస్థ (అమెరికాకిది సవాలుగా మొదలైంది) బుడగలాంటి వృద్ధిని చూసింది. ఇది 1989లో పేలిపోయింది. దీన్నుంచి ఇంకా కోలుకోవాల్సి ఉంది.

1990లు, ప్రస్తుత శతాబ్దం 1970ల నుండి తమ వ్యాధిపూరిత సంక్షోభానికి 'ప్రపంచీకరణ'ను పరిష్కారంగా గమనించాయి. ఇప్పుడు పెట్టుబడి సంచయనం ద్వారా సృష్టించబడిన మిగులు, పెరుగుతున్న మార్కెట్ (చైనాను బహిర్గతం చేయడం మినహా)ను కనుగొనలేక, రెండు మార్గాల్ని అలవంబించింది. మొదటిది, భారీ విలీనాల్నీ, స్వాధీనాల్నీ, ఇదివరకెన్నడూ చూడని రీతిలో సంలీనాల్నీ సృష్టించింది. రెండోది, అత్యధిక స్థాయిలో సట్టా వ్యాపారానికి ఒడిగట్టడం, నిజ ఆర్థిక వ్యవస్థ ద్వారా సృష్టించబడుతూ ఉన్న మిగులను 'ద్రవ్యీకరణ' చేయడం. కంప్యూటర్లు, ఇంటర్నెట్ వగైరాల్లో వచ్చిన సాంకేతిక విజ్ఞాన వికాసం (బూమ్) వల్ల ఇది ప్రోత్సహించబడింది.

ఇంటర్నెట్‌లోని ఒక వ్యాసంలో రేమాండ్ లోట్టా ఇలా పేర్కొన్నారు. పెట్టుబడి సంచయనం గురించి మనం మాట్లాడేటప్పుడు, వేతన శ్రమ దోపిడీ పై ఆధారపడిన మిగులు విలువ (లాభానికి మూలం) పోటీ

ఉత్పత్తిని పేర్కొంటున్నాం. విస్తృతమైన, వ్యయక్షీణమైన, సాంకేతికంగా అధిక ఉత్పాదక పునాదిపై ఆధారపడి లాభం, మదుపు, పునః మదుపులుంటాయి.

మనం 'ద్రవ్యీకరణ' గురించి మాట్లాడేటప్పుడు, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, ఈ దశలో పెట్టుబడి సంచయనపు విస్తృత నిర్మాణానికి చెందిన మూడు ప్రత్యేక అంశాల్ని పేర్కొంటున్నాం. ఎ) పెట్టుబడిదారీ వర్గం ద్రవ్యపొరలకు సంబంధించి పెరుగుతున్న రాజకీయ, ఆర్థిక అధికారం; బి) ద్రవ్య కార్యకలాపాలు, ద్రవ్య సేవల విశాల విస్తరణ, ఉదాహరణకు కార్పొరేట్ స్వాధీనాల్ని సంఘటిత పర్చడం, ఫైనాన్సింగ్ చేయడం, నష్ట భయానికి (రిస్క్) వ్యతిరేకంగా మదుపుల్ని బీమా చేయడం, వగైరాలు – ఈ కార్యకలాపాల్లో లాభార్జన పెడమార్గాన్నీ, కేంద్రీకరణనూ ద్రవ్యపర మార్గాల ద్వారా మిగులు విలువ పునఃమదుపును కలిగి ఉంటుంది; సి) ఉత్పత్తి నుండి ద్రవ్యాన్ని అధికంగా వేరు చేయడం.

ఈ ద్రవ్యీకరణ ప్రక్రియ అమెరికాలో చాలా ముందుకు పోయింది. అంతర్జాతీయ ద్రవ్య మార్కెట్లలో సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని పరిరక్షించడానికీ, విస్తరించడానికీ అమెరికా సామ్రాజ్యవాదానికున్న శక్తిలో ఇది ప్రధానమైన అంశం.

ఉత్పత్తి భౌగోళికంగా ఎంతో ఎక్కువగా విస్తరించబడినప్పటికీ, అది మూడో ప్రపంచ దేశాల్లోని ఉప ఒప్పందపు నెట్‌వర్క్ లోపల కొనసాగినప్పటికీ, ఉత్పాదక శక్తులపై సంపద, సమర్థమంతమైన కంట్రోల్ సామ్రాజ్యవాద దేశాల చేతుల్లో కేంద్రీకరించబడడానికి ద్రవ్యీకరణ ఒక సాధనంగా కూడా ఉంటుంది.

ఇదివరకే సృష్టించబడిన విలువ నుంచి ఎక్కువ 'విలువ'ను పిండుకోడానికి చేసే ప్రయత్నాలు ద్రవ్యీకరణలో ఇమిడి ఉంటాయి. దీనికి సంబంధించిన ఒక చర్య 2006లో విదేశీ మార్కెట్లలోనూ, డెరివేటివ్‌ల (ద్రవ్య సాధనాల)లోనూ రోజువారీ ట్రేడింగ్ పరిమాణం కలిపితే 11.4 ట్రిలియన్ డాలర్లకు చేరుకుంది. (ఇది దాదాపు ఆ సంవత్సరానికి ప్రపంచ వాణిజ్య ఎగుమతుల వార్షిక విలువకు సమానం). అమెరికా ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలో కదలికల దృష్ట్యా, మొత్తం కార్పొరేట్ లాభాల్లో ద్రవ్యరంగం వాటా 1950లో 8 శాతం ఉండగా గత సంవత్సరానికది 31 శాతం పెరిగింది.

ఇక్కడ నిజ ఆర్థిక వ్యవస్థ నుండి సృష్టించబడిన మిగులు విలువ సట్టా రంగంలో ప్రపంచం చుట్టూతా చలామణీ అయ్యింది. పెట్టుబడి యజమానులకు అనూహ్య లాభాల్ని చేకూర్చింది. అయితే ఇది ఒక బుడగే. దానికి స్థిరమైన పునాది లేకపోవడం వల్ల పేలిపోవాల్సి వచ్చింది. వేతనాల్ని పెంచడం ద్వారా కాకుండా మితిమీరిన పరపతి – గృహ తనఖాలు, క్రెడిట్ కార్డులు వగైరాలు – ద్వారా మొత్తం జనసామాన్యాన్ని రుణంలోకి నెట్టడం ద్వారా అమెరికాలో మార్కెట్ విస్తరణ జరిగింది. అత్యంత భారీ వర్తక లోటుతో అమెరికా అత్యంత రుణగ్రస్త దేశంగా మారింది. (2008 అక్టోబర్‌లో బహిర్గత లేదా విదేశీ రుణం 10 ట్రిలియన్ డాలర్ల భారీ స్థాయికి చేరుకుంది.) ఇతర దేశాల (అనేక ప్రభుత్వాలు తమ రిజర్వుల్ని / నిల్వల్ని డాలర్లలో ఉంచుతాయి. ఇందులో అతిపెద్దది చైనాయే) నుంచి తన దేశంలోకి డాలర్లు భారీగా ప్రవహించే విధంగా దాని ఆధిపత్యాన్ని డాలరు కొనసాగించినంతవరకు ఈ బలహీనమైన స్థితి నిలవగలుగుతుంది. అమెరికా ద్రవ్య సంస్థల పతనానికి డాలర్ (దీనికి ప్రత్యర్థిగా ఉంది యూరో ద్రవ్యమే) ఆధిపత్యం పతనం చెందడం తోడైతే, నిల్వలు మరొక దేశానికి తరలి వెళితే అమెరికా ఆర్థిక వ్యవస్థ పెళుసుతనం / బలహీనత మొత్తం పతనానికి దారితీస్తుంది. అయితే దీనితో, ఇది ప్రపంచంలోని ఇతర ఆర్థిక వ్యవస్థలను లాగి కిందకు పడేస్తుంది. అందుకనే, ఇప్పటికీ, తమ డాలరు రిజర్వులను బదిలీ చేయడం ద్వారా ప్రస్తుతమున్న సమతౌల్యాన్ని భంగపరచాలని ఏ ఒక్కరు కోరుకోరు.

సంక్షోభం ఈ రోజు ఎంతో లోతుగా ఉంది. కాబట్టే దీన్ని 1930ల మహా మాంద్యంతో పోల్చడం జరుగుతూ ఉంది. 1990ల వికాస సంవత్సరాల్లో కూడా 1997లో (ఆగ్నేయాసియా, రష్యాలు కేంద్రంగా) సంక్షోభం ఉంది. కనుక అనేక సందర్భాల్లో కృత్రిమంగా సృష్టించబడిన కోశ వ్యవహారాలు, బుడగల ద్వారా కొద్ది కాలం పాటు పురోగమనాలు (రికవరీలు) ఉన్నప్పటికీ, 1970ల నుండి సంక్షోభాలు కొనసాగాయి. ఇప్పుడిది ప్రస్ఫుటంగా సంక్షోభం లోపల అంతర్ విస్ఫోటనం అయింది. సారాంశంలో ఇది అధికోత్పత్తి సంక్షోభం. కోశపర ప్రోత్సహకాలన్నీ వ్యర్థమేనని నిరూపించబడుతూ ఉన్నాయి.

చట్రం లోపల పరిష్కారం లేదు. అయితే ముంచుకొస్తున్న సంక్షోభంలో బతకడానికి, సామ్రాజ్యవాదులు, వారి ఏజెంట్లు ప్రపంచ వ్యాప్తంగా అనూహ్యమైన రీతిలో మారణహోమాలకు పాల్పడతారు. ఇటీవలి కాలంలో వివిధ రకాలైన దోపిడీ వల్ల అనివార్యమైన తిరుగుబాట్లని అణచడానికి యుద్ధాలకు, ఫాసిస్టు సామూహిక హత్యాకాండలకు ఒడిగడతారు. ఇటువంటి ఘోరమైన రోజులే రాబోయేది. ప్రజల పొదుపు మొత్తాల్నీ, అర్జిత సామర్థ్యాన్నీ, కొనుగోలు శక్తినీ విచ్ఛిన్నం చేయడం ద్వారా సృష్టించబడే మహా ఉపద్రవం సంగతి చెప్పాల్సిన పనిలేదు.

యూరప్‌లో మార్క్సు రచనలు బాగా అమ్ముడు పోతున్న రిపోర్టులున్నాయి. పాలకులు కూడా ఈ సంక్షోభ కారణాన్ని అవగాహన చేసుకోడానికి మార్క్సుని ఉదహరిస్తున్నారు. ఇది ఎంతో సహజం. ఎందుకంటే ఆడమ్ స్మిత్, రికార్డో లాంటి వారు ప్రవేశపెట్టిన తొలి అవగాహనా ప్రాతిపదికపై నిర్మించబడిన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను గురించిన శాస్త్రీయ అవగాహనను మార్క్సు ఒక్కడే అందించాడు. ఈ సామ్రాజ్యవాద (లెనిన్ శాస్త్రీయంగా వివరించాడు) యుగంలో నిస్సందేహంగా పెట్టుబడిదారీ విధానం తన రూపాన్ని మార్చుకొంది. అయితే అమలులో ఉన్న దాని నియమాల అవగాహన చెరగకుండా ఉంది. ప్రస్తుత సంక్షోభాన్నే (ద్రవ్యీకరణ దాని నూతన వ్యక్తీకరణలు వగైరాలతో) కాకుండా ప్రస్తుత వ్యవస్థ లోపల దాని పరిష్కారానికి గల పరిమితుల్ని కూడా తెలుసుకునే అవగాహననిస్తుంది.

పెట్టుబడిదారీ విధానాన్ని గురించి మార్క్సు శాస్త్రీయ అవగాహనను అందించడమే కాక, దాన్ని చారిత్రక భావి దర్శనంలో నిలిపాడు. చరిత్రను శాస్త్రీయంగా అవగాహన చేసుకోవడం ద్వారా అతడు భూస్వామ్య విధానం నుంచి దాని పరిణామాన్నీ, అది సోషలిజానికి అనివార్యంగా పరివర్తన చెందడాన్నీ పరిశీలించాడు. ప్రాచీన కాలం నుండి నేటి దాక చరిత్ర పట్ల తన అవగాహన ద్వారా, పెట్టుబడిదారీ విధానంతో ఇది

*భౌతిక పరిస్థితుల్లో వచ్చిన మార్పులు జీవపరిణామ క్రమంలో ఎటువంటి పరిమాణాత్మక, గుణాత్మక మార్పులకు దారితీసాయో వివరిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# జీవపరిణామం లక్షణాలు

మతవిశ్వాసాల బలహీనతలు అర్థం చేసుకోవడానికి జీవపరిణామం గురించిన సరైన అవగాహన ఉండితీరాలి. ఎందుకంటే అది మన భౌతికవాదదృక్పథానికి తోడ్పడుతుంది. జీవపరిణామం గురించిన సరైన అవగాహన భౌతికవాదదృక్పథానికి తోడ్పడుతుంది. అందుచేత అదేదో జీవశాస్త్రం గురించి ఆసక్తి ఉన్నవారికి మాత్రమే పరిమితమైన విషయంకాదు. అందులోని తాత్విక అంశాలు అందరూ తెలుసుకోదగ్గవే. ఇది పంతొమ్మిదో శతాబ్దంలో మొదలైన సిద్ధాంతం.

1835లో డార్విన్ దక్షిణఅమెరికాలోని ఈక్వడార్ దేశానికి వెయ్యి కిలోమీటర్లు పశ్చిమాన పసిఫిక్ మహాసముద్రంలో ఉన్న గలాపగోస్ ద్వీపాలకు వెళ్ళాడు. అక్కడ ఆయనకు కొన్ని జాతులకు చెందిన జంతువులు కనబడ్డాయి. ఒకే ద్వీపసమూహంలో ఉన్నవే అయినా ఒక్కొక్క ద్వీపంలోనూ తక్కిన ద్వీపాలతో సంబంధం లేకుండా ఎదిగిన వాటి లక్షణాల్లో తేడాలు కనిపించాయి. ఒకే కుదుటి నుంచి మొదలైన ప్రాణుల్లో స్థానిక పరిస్థితులనుబట్టి క్రమంగా శరీరాకృతిలోనూ, అలవాట్లలోనూ కాస్త కాస్తగా తేడాలు ఏర్పడ్డాయని అర్థమైంది. జీవపరిణామసిద్ధాంతం ప్రతిపాదనకు ఈ పరిశోధనలు తోడ్పడ్డాయి.

డార్విన్ చెప్పిన జీవపరిణామసిద్ధాంతం ప్రకారం చూస్తే ప్రకృతీ, వాతావరణమూ శక్తివంత మైనవనీ, ప్రాణుల జీవితాలను ఎప్పటికప్పుడు శాసిస్తూ, వాటి ప్రాణాలతో చెలగాటం ఆడుకుంటాయనీ అనిపిస్తుంది. కాని ఇది పూర్తిగా నిజంకాదు. ఎందుకంటే ప్రకృతి భౌతికసూత్రాలకు లోబడి మారుతూ ఉంటుంది. ఈ మార్పులు అప్పుడప్పుడూ ప్రాణుల వల్లకూడా కలుగుతూ ఉంటాయి.

ఆధునిక యుగంలో మనిషి చర్యల వల్ల వాతావరణంలో కలుగుతున్న కాలుష్యం వగైరాలవల్ల ఎన్ని అనర్థాలు వచ్చిపడ్డాయో అందరికీ తెలుసు. కేవలం మనుషులే కాదు, ఇతర కొన్ని ప్రాణులు కూడా కావాలని పరిసరాలని తమకు వీలుగా కొద్దోగొప్పో మార్చుకుంటాయి. చెట్లని తినే బీవర్ జంతువులు కొమ్మలని నరికి తమకూ, పిల్లలకూ పనికొచ్చే చిన్న నీటిగుంటలను ఏర్పాటు చేసుకుంటాయి. ఎటొచ్చీ ఈ మార్పులు నెమ్మదిగా, సహజంగా, 'ఆమోదయోగ్యం'గా జరుగుతాయి గనక వీటి గురించి ఆందోళన కలగదు.

అలాగే రకరకాల ప్రాణులు తమ ఉనికిద్వారా ఒకదాన్నొకటి

---

'చరిత్ర అంతం' కంటే దూరంగా ఉందనీ, చివరిగా సోషలిజం, కమ్యూనిజాలను చేరుకోడానికి చరిత్ర మలుపులు తిరుగుతుందనీ మార్క్స్ చూపాడు. అంతేగాక, ఏ సమాజం కూడా ఒక రకం నుండి మరో రకానికి శాంతియుతంగా పరివర్తన చెందలేదనీ, రక్తపాత యుద్ధాల ద్వారానే ఎల్లప్పుడూ పరివర్తన వచ్చిందనీ, కఠోర పోరాటం లేకుండా పాలకులు స్వచ్ఛందంగా తమ ప్రయోజనాల్ని వదులుకోరనీ మార్క్స్ తెలియజేశాడు. వాళ్లు (పాలకులు) ఎటువంటి ఉద్దేశాలు లేకుండా ప్రపంచ యుద్ధాలు చెయ్యలేదు. వాళ్ల ప్రయోజనాలు దెబ్బతిన్నప్పుడు వాళ్లు మానవజాతి సంహారానికి కూడా ఒడిగట్టారు. చరిత్రలో అనేక ఉదాహరణాలున్నాయి. సమకాలీన ఇరాక్ మరో ఉదాహరణ.

ఈ సంక్షోభ పరిస్థితుల్లో ప్రస్తుత వ్యవస్థను కాదని, ఇంకా మానవీయమైన, హేతుబద్ధమైన సోషలిజాన్ని తిరిగి నెలకొల్పడం ద్వారానే స్థిరచిత్తతనూ, శాంతినీ సాధించగలం. భారతదేశం లాంటి వెనకబడ్డ దేశాల్లో ఇది రెండు దశల గుండా సాగిపోవాలి. అయితే ప్రపంచ దేశాలన్నిటిలో దిశ మాత్రం అదే. సిపిఐ / సిపిఎం రకం రివిజనిస్టుల వల్ల ప్రపంచవ్యాప్తంగా సోషలిస్టు వ్యవస్థల తిరోగమనాల కారణంగా అనేక దూషణలకు గురవడం వల్ల కమ్యూనిజం భ్రష్టుపట్టింది. ఈ 21వ శతాబ్దంలో కమ్యూనిజం గత ప్రతికూల అనుభవాల నుంచి పాఠం నేర్చుకోవాలి. ఈ కలుషిత సమాజాన్ని మనం ఆశించే వాస్తవ స్వర్గధామంగా మార్చడానికి నూతన సృజనాత్మకతతో సానుకూలంగా ఉన్న ప్రతిదాన్ని పొందుపర్చుకోవాలి. ప్రస్తుతానికి ప్రపంచవ్యాప్తంగా ప్రజల జీవన ప్రమాణాలపై పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదులు ప్రారంభించిన విస్తృత దాడుల్ని తిప్పికొట్టాల్సిన ఆవశ్యకత ఎంతో ఉంది. శక్తిమంతమైన కమ్యూనిస్టు పార్టీల్ని సంఘటితపర్చాల్సిన అవసరం తీవ్రంగా ఉంది. వాళ్లు మాత్రమే ముంచుకొస్తున్న ఫాసిస్టు దాడుల్ని ఎదుర్కోగలుగుతారు. మనోహరమైన నూతన భవిష్యత్తుకు వెలుగును చూపుతారు. మార్క్సిజం మరలా నూతన జీవాన్ని పొందుతూ ఉంది. మనం దాని శాస్త్రీయ, విప్లవకర బోధనల్ని విస్తృతంగా వ్యాప్తి చేద్దాం. ఆ విధంగా ప్రజలు సత్యాన్ని తెలుసుకొని కొనసాగుతున్న సంక్షోభాన్ని అవగాహన చేసుకుంటారు.

(అయిపోయింది)

(స్వేచ్ఛానువాదం : సి. పటేల్)

ప్రభావితం చేసుకుంటూ ఉంటాయి. జంతువులవల్ల మొక్కలూ, వృక్ష జాతులలో బలమైన మార్పులు కలుగుతాయనేది తెలిసినదే. మిడతల దండువంటివి వచ్చిపడ్డప్పుడు మొక్కలు విపరీతంగా నాశనం అవుతాయి. పంట పొలాలూ, ఆహారధాన్యమూ నాశనమై మనుష్యులకు హాని కలిగినప్పుడు వీటి గురించి మరింతగా మథనపడతాం కాని ప్రకృతిలో కూడా ఇవి పెద్ద మార్పులే. మొక్కలపై తిన్నగానో, పరోక్షంగానో ఆధారపడే సూక్ష్మజీవాలూ, పశువులూ, పక్షులూ ఇలా ఎన్నో ఇబ్బందులకు గురి అవుతాయి. ప్రకృతి నిశ్చలనమైనది కాదు, మనిషి ప్రమేయం ఉన్నా, లేకపోయినా అందులో రకరకాల మార్పులు తప్పనిసరిగా జరుగుతూనే ఉన్నాయి. అలా జరగకపోయి ఉంటే ఇన్నిరకాల జీవాల పుట్టుకా, మనిషి ఆవిర్భావమూ జరిగి ఉండేవే కావు.

మొత్తంమీద జీవపరిణామమంతా 'గుడ్డి'గా జరిగే వ్యవహారం. దానికి 'ముందుచూపు' ఏమీ ఉండదు. మారుతున్న పరిసరాలనిబట్టి ఎప్పటికప్పుడు కొన్ని మార్పులు బలపడతాయి. సహజంగా జరిగే జన్యుపరమైన మార్పుల కారణంగా కొన్ని జీవాలు చస్తూ, మరికొన్ని బతుకుతూ ఉంటాయి. బతికినవాటి లక్షణాలు వాటి సంతతికి అబ్బుతాయి. వాటి సంఖ్య పెరిగి, పరిస్థితులు తారుమారయేంతదాకా ఆ జాతి కొనసాగుతుంది. జన్యుపరంగా జరిగే మార్పులకు కొంత పరిధి ఉంటుంది. విస్తృతమైన మార్పులకు అవకాశం ఉండదు. కొన్ని మార్పులు అనుకోని పరిణామాలకు దారితీస్తాయి. ఈకలు మొదట్లో చలి కాచుకునేందుకు రూపొందాయి. అవి కాలక్రమేణా ఎగరడానికి రెక్కలకు ఆచ్ఛాదనంగాకూడా పనికొచ్చాయి.

ధ్రువప్రాంతాల్లో ఎక్కువగా ఉండే పెంగ్విన్ పక్షులు ఎగరగలిగిన జాతినుంచి పుట్టుకొచ్చినవే అయినా వాటి రెక్కలు ఎగరడానికి బదులు నీటిలో ఈదడానికి పనికొస్తున్నాయి. ఈనాడు మనకు కనబడుతున్న శరీరనిర్మాణపు కొన్ని లక్షణాల ఆధారంగా మొదట్లో అవి ఏ కారణంచేత పరిణామం చెందాయో ఊహించడం కష్టం.

ఒకప్పుడు ప్రపంచమంతా చిత్తడి నేలలతో, వెచ్చగా, తేమగా ఉండే వాతావరణంతో నిండింది. ఒత్తుగా, ఏపుగా పెరిగిన మొక్కలను తిని బలిసిన రాక్షసిబల్లులు అడ్డూఆపూ లేకుండా భారీ శరీరాలతో పెరుగుతూ పోయాయి. వాటి బరువు వాటి జీవనశైలికి ఏ విధంగానూ ప్రతిబంధకం కాలేదు కనక అవి సన్నబడలేదు. పైగా వాటిని వేటాడి, చంపి తినగలిగిన డైనొసార్లు తయారయాయి. అయినా అవన్నీ ఒక్కపెట్టున అకస్మాత్తుగా అంతరించిపోయాయి. అప్పటికి ఎలుకల సైజులో రాత్రిళ్ళు భయంగా తిరిగే క్షీరదాలు క్రమంగా భూమినంతటినీ ఆక్రమించాయి. ఇలా ఒక జాతి నశించడం, మరో జాతిది పైచెయ్యి కావడం భౌగోళిక, భౌతికమార్పుల వల్లనే జరిగింది, జరుగుతోంది కూడా.

జీవపరిణామం మాట ఎలాఉన్నా ప్రాణులన్నీ తమ జాతికి చెందినవాటితో కూడా నిరంతరం పోటీపడుతూనే ఉంటాయి. అందులో ''నిస్వార్థ'' గుణాలకి తావులేదు. ప్రతిప్రాణీ తన మనుగడకై పాకులాడుతుందేతప్ప తన జాతికి మంచి జరిగే పనులేవీ చెయ్యదు. కొన్ని సందర్భాల్లో సాటి ప్రాణులకు సహాయపడే గుణం కనిపిస్తుంది. ఉదాహరణకు కొన్ని గబ్బిలాలు ఆహారం అందని ఇతర గబ్బిలాలకు తమ నోటనున్న తిండిపెట్టడం జరుగుతుంది. అయినా ఇది నిస్వార్థ చర్య కాదు. ఎందుకంటే గబ్బిలాలు "కలసి ఉంటే కలదు సుఖం" అన్న ప్రాతిపదికమీద కొన్నిటితో జత కడతాయి. తమ సహచర మృగాన్ని ప్రాణాలతో ఉంచితే వాటికే లాభం. గబ్బిలాలు ఎక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు ఒకదానికొకటి తోడ్పడగలవు. అందువల్ల వాటి సహాయం స్వార్థపూరితమైన చర్యే.

తల్లిదండ్రుల క్రోమొసోమ్‌లలో ఒకరిది వ్యాధి కలిగించేదైనా రెండోవారికున్న ఆరోగ్యవంతమైన భాగం బలమైన ప్రభావం చూపుతుంది. తత్ఫలితంగా పిల్లలు ఆరోగ్యంగానే పెరుగుతారు. అయినప్పటికీ వ్యాధి కలిగించగలిగిన జన్యువులు సమసిపోకుండా కొనసాగుతాయి. ఇద్దరికీ ఒకే వ్యాధికి సంబంధించిన బలహీనత ఉన్నప్పుడు పిల్లలు జబ్బుపడే అవకాశం ఎక్కువగా ఉంటుంది. మనుషులు సంతానోత్పత్తికై సామాన్యంగా తమను పోలినవారితోనే జతకడతారు. తెల్లవారు అరబ్ దేశస్థులతోనూ, మంగోలాయిడ్ జాతివారు హిందువులతోనూ పెళ్ళిళ్ళు చేసుకోవడం అరుదు. అందువల్ల జన్యువుల్లో భిన్నత్వం ఏర్పడే అవకాశం తగ్గుతుంది. తక్కిన ప్రాణులుకూడా స్థానికంగా ఉన్నవాటిద్వారా సంతానం పొందుతాయి కనక జన్యుపరమైన లక్షణాల్లో తేడాలుండే అవకాశం తక్కువే. ప్రకృతిలో జరిగే సహజమైన ఏరివేత కార్యక్రమంలో ప్రాణికి హాని కలిగించే జన్యుపరమైన మార్పులన్నీ రానురాను తగ్గిపోతాయి. అయినా జీవపరిణామం కొనసాగుతూనే ఉంటుంది.

జీవపరిణామం గురించి ఇంతగా చర్చించడం అవసరమా? కేవలం సైన్స్ పుస్తకాన్నో, వ్యాసాన్నో చదువుతున్నప్పుడు మాత్రమే ఇలాంటి సిద్ధాంతాల గురించి ఆలోచిస్తూ, తరవాత మరిచిపోవడం జరుగుతుందా? అది నిజమైతే మనం చిన్నప్పుడు చదువుకున్న కొన్ని విషయాలు మళ్ళీ గుర్తు చేసుకోవడం అవసరం. మనకు ఇప్పుడు ప్రపంచంలో కనబడుతున్న రకరకాల ప్రాణులు మొదటినుంచీ లేవనేది వాటిలో ఒకటి. కుక్కలూ, నక్కలూ, తోడేళ్ళూ ఒక జాతివనీ, పిల్లులూ, చిరతపులులూ, పెద్ద పులులూ, సింహాలూ మరొక జాతికి చెందినవనీ, గుర్రాలూ, గాడిదలూ, జీబ్రాలూ ఒకలాంటివేననీ పిల్లలకు కూడా తెలుసు. గతంలో వీటికి తలొక "పూర్వీకుడూ" ఉండి ఉండాలి. ఇంకా వెనక్కెళితే ఈ "ఆదిమ" శునకానికీ, మార్జాలానికీ, అశ్వానికీ జన్మనిచ్చిన మరేదో మృగం ఉండి ఉంటుంది. ఇంకా ప్రాచీన యుగంలో ఈ క్షీరదాలకీ, తక్కిన చేపలూ, తాబేళ్ళూ, జలచరాలూ, పక్షులూ అన్నిటి ఆవిర్భావానికీ దారితీసిన ప్రాణి ఏదో ఉండే ఉంటుంది. వీటిలో కొన్ని శాకాహారులుగానూ, మరికొన్ని మాంసాహారులుగానూ రూపొందడానికి భౌతికప్రేరణలూ, పర్యావరణపరిస్థితులే కారణాలు అయి ఉంటాయి. ఇన్ని రకాల ప్రాణులు "వాటంతట అవే" ఎలా ఉద్భవిస్తాయని అనుమానం కలగడం సహజమే. అయినా ఎంతటి సృష్టికర్తకైనా ఇన్ని రకాల, సైజుల, రంగుల, మచ్చల, చారల జీవాలని తయారుచేస్తూ కూచోవడం కష్టమే.

ఉదాహరణకు ఆఫ్రికాలో పుట్టుకొచ్చిన మానవజాతి క్రమంగా ఉత్తర దిశగానూ, తక్కిన ప్రాంతాలకీ విస్తరించిందని శాస్త్రవేత్తలు ఊహిస్తున్నారు. ఉష్ణోగ్రత దృష్ట్యా తొలి మానవులు నల్లని రంగులో

ఉండి ఉంటారని అనుకోవచ్చు. ఉత్తరాన ఎండపొడ తక్కువగా పడే ప్రాంతాలకు వెళ్ళినవారి చర్మం తెల్లగా మారక తప్పలేదు. పూర్తిగా నల్లరంగులో ఉన్న ఒక మానవసమూహం తెల్లగా మారిపోవడానికి 20 వేల సంవత్సరాలు సరిపోతాయని అంచనా. తక్కిన జంతువుల సంగతి ఎలా ఉన్నా, ఒక్క మనిషిజాతినే తీసుకుంటే, చర్మం రంగూ, ముఖకవళికలూ అన్నీ కాస్తకాస్తగా మారడానికి జీవపరిణామప్రక్రియలే కారణమని రుజువు అవుతోంది. అంచేత జీవపరిణామ సిద్ధాంతాన్ని కాదనేవారు ఈ రోజుల్లో దాదాపుగా ఎవరూ లేరనే అనుకోవచ్చు.

జీవపరిణామం అనేది గురుత్వాకర్షణవంటి "శక్తి" కాదు. అది ప్రాణులను మార్పుల దిశగా "నెట్టుతుందని" అనిపిస్తుంది కాని అటువంటి ప్రత్యక్షమైన ఒత్తిడి ఏమీ ఉండదు. దానికి "నిర్దేశిత గమ్యం" కూడా ఏమీ ఉండదు. జన్యువులలో తనంతట తానుగానో, ఏ కాస్మిక్‌కిరణాల ప్రభావం వల్లనో జరిగే "లాభకరమైన" మార్పులకు అది సహాయపడుతుంది. అంతేతప్ప అది స్వయంగా జన్యువులను మార్చదు, మార్చలేదు. జీవకణాల విభజన జరిగినప్పుడు డిఎన్‌ఏల కాపీలు తయారవడంలో లోపాలు కలగడం, తప్పులు దొర్లడంవల్ల ఆకస్మికపరివర్తన (మ్యుటేషన్) జరుగుతుంది. అవి అనియతంగా (రేండమ్) జరుగుతాయి కనక వాటి ఫలితంగా శరీరలక్షణాల్లో కలిగే మార్పులన్నీ కాకతాళీయమే.

జంతువులకూ, పక్షులకూ పుట్టిన పిల్లల్లో కొన్ని పుట్టుకతోనే బలహీనంగా ఉండడం చూస్తాం. ఆ కారణంగా అవి ఎక్కువ కాలం బతకవు. తిండి సంపాదించుకోలేకనో, ఇతర మృగాల వాతపడడం వల్లనో అవి చావగా, బలహీనతను కలిగించే వాటి జన్యువులు త్వరగా అంతరించిపోతాయి. పంటలకు సంబంధించకుండా ప్రకృతిలో పెరిగే మొక్కలూ, ధాన్యమూ, కాయగూరలవంటి వాటిలో గిడసబారినవీ, చేదుగా ఉండేవీ, తినడానికి పనికిరానివీ ఉంటాయి. ఈ ప్రక్రియలో మనిషి జోక్యం కలిగించుకుని, తనకు పనికొచ్చేవాటిని మాత్రమే ఏరుకుని పండించుకుంటాడు. అలాగే పొగరుబోతు గొడ్లనూ, కుక్కలనూ కాకుండా మచ్చికగా ఉండే జంతువులనే పెంచుకుంటాడు. ఇక్కడ గమనించవలసిన దేమిటంటే ప్రకృతిలో అన్నిరకాలూ ఉత్పత్తి అవుతూ ఉంటాయి. జన్యువుల్లో, విస్తృతంగా కాకపోయినా చిన్నచిన్న మార్పులు యాదృచ్ఛికంగా జరుగుతూ ఉండడంవల్ల ప్రాణుల సంతతిలో ఎప్పటికప్పుడు తదనుగుణంగా తేడాలు తలెత్తుతాయి.

ఇలాటి తేడాలు శరీరలక్షణాలలోనే కాదు, ప్రవర్తనలోనూ, అలవాట్లలోనూ, సామర్థ్యంలోనూ కూడా మార్పులు కలిగిస్తాయి. సామర్థ్యం అంటే కేవలం ఎక్కువ బలమో, వేగమో, పెద్ద శరీరమో ఉండడమే కాకపోవచ్చు. జీవపరిణామం కేవలం మనుగడ కొనసాగించడానికే (సర్వైవల్) అని అంటారు. కాని, ఆయుర్దాయం సరిసమానంగా ఉండే ప్రాణుల్లో సైతం సంతానోత్పత్తిని సాధించడంలో తేడాలుండవచ్చు. తన జోడీని ఆకర్షించి, సంపర్కంద్వారా ఎక్కువ సంతానం కలిగిన ప్రాణియొక్క జన్యువులు మాత్రమే కొనసాగుతాయి. జీవపరిణామం కొన్ని సందర్భాల్లో విపరీతమైన మార్పులు కూడా కలిగిస్తుంది. వీటిలో కొన్ని అత్యాశ్చర్యం కలిగించేట్టుగా ఉంటాయి. నీటిమీద నడిచే పిట్టలూ, నీటి బొట్టును తుపాకీ గుండులాగా కొట్టి కీటకాలను చంపే చేపలూ, ఎన్ని మైళ్ళు ఎగిరినా దారి తప్పకుండా గూటికి చేరే తేనెటీగలూ, ధ్వనిని రేడార్‌లాగా ఉపయోగించే గబ్బిలాలూ మొదలైనవన్నీ జీవపరిణామం వల్లనే తమ "శక్తులను" సాధించాయి.

ఇవేవీ "కావాలని" జరిగిన మార్పులు కావు. ఉదాహరణకు నల్లని మనుషులకు చర్మంలో మెలనిన్ అనే పదార్థం తగ్గడంవల్ల తెలికరంగులో ఒకరో, ఇద్దరో పిల్లలు పుట్టడం అసాధారణం కాదు. మెలనిన్ సూర్యకాంతిలోని అల్ట్రావయొలెట్ కిరణాలవల్ల చర్మరక్షణకై ఉత్పత్తి అవుతుంది. ఎండద్వారా అటువంటి ప్రేరణ లభించని పరిస్థితిలో చర్మం నల్లబడదు. నలుపు తగ్గిన సంతతి ఎండ లేని ప్రాంతాల్లో మరింత బాగా మనుగడ సాగించగలగడంతో క్రమంగా వారి సంఖ్య బలపడి కొన్ని వేలతరాల అనంతరం తెల్లవారి జాతి తయారౌతుంది. అలాగే చెట్ల నీడల్లో దాగి ఉండేందుకు అనువైనరీతిలో మచ్చలూ, చారలూ కలిగిన పులులు ఆవిర్భవించాయి. అవి మరింత బాగా వేటాడి తమ సంతతిని వృద్ధి చేసుకోగలిగాయి. సాలెపురుగు అద్భుతంగా గూడుకట్టగలిగినా, పిల్లలకు నిశ్శబ్దంగా నడిచేందుకు అనువైన పాదాలున్నాయన్నా అవన్నీ సహజమైన ఏరివేత కార్యక్రమంలో వాటికి దక్కిన సదుపాయాలే. పరిణామం ఒక దిశలో విజయం పొందాక ఆ ప్రాణి మనుగడకు మరింతగా దోహదపడే శరీరాకృతి ఏర్పడడంలో ఆశ్చర్యం లేదు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా చెప్పుకోవచ్చు. ప్రకృతిలోని వింతలకు కారణాలు పరలోకంలో వెతకనివారికి జీవపరిణామం గురించిన భౌతికఆధారాలు ఎన్నో లభిస్తాయనేది మాత్రం నిజం. వీ

*గుజరాత్‌లో ముస్లింలపై జరిగిన మారణకాండకు నిరసనగా, మానవీయ స్పందనగా వచ్చిన సినిమాలను, సాహిత్యాన్ని పరిచయం చేస్తున్నారు* **పి.వి. రమణ**

# రెండు సినిమాలు - ఒక నవల

*(గత సంచిక తరువాయి)*

## ఫిరాఖ్

ఇది ఒక విధంగా ఫర్జానియాకు కొనసాగింపుగా చూడవచ్చు. ఆ సినిమాలో విధ్వంసాన్ని రికార్డు చేసి చివరలో విధ్వంస ఫలితంగా కుటుంబాల్లో వస్తున్న మార్పులు గురించి షెహనాజ్ ఆవేదన పొందు తుంది. ఆ మార్పుల గురించి మరింత వివరంగా సామాజిక జీవితాల్లో ఏర్పడిన అనుమానం, అపనమ్మకం, అభద్రతాభావాలు ఎలాంటి ప్రభావాన్ని కలగజేస్తున్నాయో విశ్లేషించిన సినిమాగా కూడా దీన్ని చూడవచ్చు.

'ఇది ఎవ్వరినీ వేలెత్తి చూపడానికి తీసిన సినిమా కాదు. మనం మర్చిపోతున్న మానవత్వాన్ని తిరిగి రేకెత్తించాలన్నదే నా ప్రయత్నం. మన ముందు కనపడుతున్న రెండు మార్గాలలో ఒకటి, వేరు చేయబడి విడివిడిగా ఉండడమా? లేక ఒక న్యాయమైన శాంతితో కూడిన సమాజం కొరకు అన్వేషణ కొనసాగించడమా? అనే వాటిపై సమాజం ఆలోచించాలనే ధ్యేయంతోనే ఈ సినిమా తీసానని' దర్శకురాలు నందితా దాస్ తను తీసిన మొదటి సినిమా గురించి వివరించింది. అంతే కాకుండా 'ఒక కవిత్వంలాగా, పెయింటింగ్ లాగా వ్యక్తులు విడిగా అనుభూతి చెందేది కాదు సినిమా. అది మన చుట్టూ ఉన్న సమూహంతో పాలుపంచుకొని, వారిని కూడా ఆలోచించేటట్లు, సంభాషించేటట్లు చేస్తుంది' అనే సినిమా పట్ల ఆమె స్థిరమైన అభిప్రాయాన్ని మనం సీరియస్‌గా తీసుకోవాల్సిన అవసరం ఉంది.

ఈ సినిమాలో అనేక కుటుంబాలు, వ్యక్తుల కథలు గుజరాత్ ఘటనలు జరిగిన నెల రోజుల తర్వాత నుంచీ మొదలవుతాయి. ఘటనల్లో తమ ఇల్లు పూర్తిగా విధ్వంసం కాబడిన ఆటోడ్రైవర్ 'హనీఫ్', అతని భార్య 'మునారా' ఘటనల్లో పాల్గొన్న ఆరతి భర్త, మరిది, ఆపదలో ఉన్న ముస్లిం యువతిని రక్షించలేకపోయామనే అని తనని తానే హింసించుకోనే ఆరతి, ఇక అక్కడ జీవించలేమని ఢిల్లీకి వెళ్లిపోవాలని నిర్ణయించుకొన్న వ్యాపారస్తుడు సమీర్‌షేఖ్, అతని హిందూ భార్య అనురాధా దేశాయి, సంగీత సాధకుడు జాగిర్‌ఖాన్ సాబ్, అతని అనుచరుడు కరీంలతో పాటు స్నేహానికి నిదర్శనంగా నిలబడిన మునారా స్నేహితురాలు జ్యోతి, తనవారినందరినీ కోల్పోయి క్యాంపులో ఒంటరిగా మిగిలిన చిన్నారి బాలుడు 'మోషిన్' లాంటి వారి జీవితాల్లో, ఆలోచనల్లో జరిగిన విధ్వంసం ఎంత మార్పు తెచ్చిందో కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది.

ఖబర్‌స్థాన్‌లో గుట్టలు గుట్టలు ఉన్న శవాల కోసం తవ్విన పెద్ద గోతిలో ఇద్దరు ముస్లింల శవాలను పూడుస్తుండగా సినిమా ప్రారంభమవుతుంది. ఇంతలో ఇంకో లారీ లోడ్‌తో వచ్చిన శవాల్ని కుప్పలు పోస్తారు. అందులో ఒక హిందూ స్త్రీ శవం కూడా వస్తుంది. ముస్లిం పెద్దాయన ఆమె శవాన్ని చూసి విపరీతమైన కోపంతో పార తీసుకొని దాడి చేయబోతాడు. రెండో అతను చనిపోయిన వారిని మళ్లీ ఎలా చంపగలవు అంటూ అతన్ని ఆపుతాడు. ఇది జరిగిన నెల రోజుల తర్వాత నుండి ఏం జరిగిందో తెలుసుకొందాం.

## హనీఫ్, మునారా, జ్యోతి

ఘటనలకు ముందే బంధువుల ఇంటికి వెళ్లిపోయి తిరిగివచ్చి, ఇల్లంతా పూర్తిగా ధ్వంసం కావటాన్ని చూసిన మునారా భర్తతో 'నీకు తాళాలు అన్నీ మార్చేయమన్నాను కదా' అంటుంది. అంటే జరిగిన విధ్వంసం ఏదో మామూలు సంఘటగానే చూస్తున్నట్టు అర్థమవుతుంది. తర్వాత ఇల్లంతా ఏం మిగిలాయో వెతుకుతుంటే హనిఫ్‌కు ఒక చిన్న హిందూ దేవుడి బొమ్మతో లాకెట్ దొరుకుతుంది. అంటే హిందువులు ఇందులో పాల్గొన్నారని రుజువయింది. కాని ఎవరు దాడి చేసారో? మునారా స్నేహితురాలు 'జ్యోతిని అడుగు, ఆమెకు తెలుస్తుంది' అంటాడు. ఆమె ప్రాణ స్నేహితురాల్ని అనుమానించడం తనని అవమానించడం లాగే భావించి నిరసనగా చూస్తుంది. తర్వాత జ్యోతి వచ్చి మునారాను కలుస్తుంది. ఎవరు దాడి చేసారో తెలుసుకోవాలని మునారా పదే పదే జ్యోతినే ప్రశ్నిస్తుంది. జరిగిన దానికి అపరాధ భావంతో ఉన్న జ్యోతి సూటిగా జవాబు చెప్పకుండా తప్పించుకొని మాట్లాడుతుంది.

హిందువుల ఇంటిలో జరుగుతున్న పెళ్లి వాళ్లకు హెన్నా పెట్టడానికి జ్యోతి మునారాను తీసుకెళుతుంది. అక్కడ వాళ్లు ఆమెను ముస్లింగా గుర్తించకుండా ఉండడానికి తన బొట్టు తీసి ఆమెకు పెడుతుంది. వీళ్లా పనిలో ఉండగా, పక్కనే పెళ్లికొచ్చిన ఆడాళ్ల బృందంలో ఒకామె 'నాకు ఒక ఫ్రెండ్ నుండి ఇ-మెయిల్ వచ్చింది. ముస్లిం రిక్షాడ్రైవర్ల లిస్టు తయారు చేసారు. వారితో జాగ్రత్తగా ఉండాలి' అంటుంది. దానికి ఇంకొకామె 'వీళ్లంటే భయం వేస్తుంది. మనల్ని

చంపేస్తారేమో' అని అనడం అనుమానమనే విషం సామాజిక జీవితంలోకి ఎలా ఇంకిపోయేలా చేసారో అర్థమవుతుంది.

### సమీర్ షేఖ్, అనురాధా దేశాయి

సమీర్ షేఖ్, హిందువైన కేట్కీ భర్త ఇద్దరూ భాగస్వాములుగా వ్యాపారం చేస్తుంటారు. ముస్లిం వ్యాపారస్తుల షాపుల ధ్వంసంలో భాగంగా వీరి షాపు కూడా ధ్వంసం అవుతుంది. ఇక అక్కడ ఉండడం సాధ్యం కాదని సమీర్ భార్యతో ఢిల్లీ వెళ్లిపోవాలని నిర్ణయించుకొంటాడు. దానికి కేట్కీ భర్త 'అయితే ఢిల్లీలో ఇంతకన్నా వేరుగా ఉంటుందను కుంటున్నావా? నా సోదరుడు అమెరికాలో ఉన్నాడు. అక్కడ కూడా ఇదే పరిస్థితి కదా?' అని ప్రశ్నిస్తాడు. దానికి సమీర్ 'అయితే ఏం చేయమంటావు?' అని కోపంగా అడుగుతాడు. 'ఇది నీ జీవితం. ఇదేమీ పిక్నిక్ కాదు. నీ స్వవిషయం' అని జవాబు. దానికి సమీర్ 'నీకు ఇలా చెప్పడం చాలా సులువు. ఈ దేశంలో ఎవరైనా ఒక హిందువు ఇంకొకర్ని చంపితే హిందువులెవ్వరూ తలదించుకోనక్కర్లేదు. కాని అదే ఒక జిహాదీ ఎక్కడో బాంబు పేలిస్తే మేమంతా అవమానంతో తలదించుకోవాల్సి వస్తుంది' అని ఎంతో ఉద్రేకంగా మాట్లాడతాడు. ఇంకో సందర్భంలో 'నీకు ఎప్పుడైనా భయంతో నీ పేరు మార్చుకోవలసిన అవసరం వచ్చిందా? పాకిస్తాన్ ఎప్పుడైనా క్రికెట్‌లో గెలిస్తే వారిని అభినందించడానికి వెనకాడవలసిన అవసరం వచ్చిందా' అని ఆవేశంగా ప్రతి స్పందించడం వెనక దేశవ్యాపితంగా ఈనాటి ముస్లిం సమాజపు ఆవేదన కనపడుతుంది.

### ఆరతి, భర్త సంజయ్, మరిది, ముస్లిం కుర్రాడు మోసిన్

సంఘటనలు జరిగినపుడు ఒక ముస్లిం స్త్రీ సహాయం కోసం తలుపులు బాదుతుంటే భయంతో తలుపులు తియ్యదు ఆరతి. తరువాత ఆ సంఘటన పదే పదే గుర్తుకు వచ్చి ఆమె అపరాధ భావంతో కుంగిపోతూ వంటగదిలో కాలుతున్న నూనె చెయ్యి మీద వేసుకుని తనని తాను హింసించుకుంటుంది.

భర్త, మరిది ఇద్దరూ దాడుల్లో పాల్గొంటారు. ఆమెకు ఆ సంగతి తెలుసు. ఒకరోజు టి.వి.లో జరిగిన హింసాకాండపై వార్తలు వస్తుంటే మరిది 'ఈ ఇంగ్లిష్ ఛానల్ వారివన్నీ అబద్ధాలే. హిందువులు చంప బడ్డప్పుడు వీళ్ల నోళ్లు మూసుకుపోతాయి. చూస్తుండగానే మొత్తం ప్రపంచం అంతా ముస్లింలతో నిండిపోతుంది' అంటాడు. ఇంతలో పోలీసుల కేసులో తన పేరు ఉందని తెలుస్తుంది. దానికి అన్న సంజయ్ 'దానికేముందిలే ఒకరిద్దరిని మూసేసి మిగతా వారందరినీ వదిలేస్తారు' అంటాడు. 'నాకు దాడిలో పాల్గొన్నవారి పేర్లన్నీ తెలుసు' అని తమ్ముడంటే, 'అయితే నువ్వసలు సాక్షిగా ఉండకూడదు. రేప్ కేసుల్లో కనీసం ఏడు సంవత్సరాల జైలు శిక్ష పడుతుంది. నీ వలన నేనిరుక్కు పోయాను' అని అంటూ అన్న చిన్న నవ్వు నవ్వుతూ 'బాగా అనుభవించావు. ఎలా మజా చేసావు?' అని తమ్ముడ్నడిగితే, వాడు 'నేనొక్కడినే కాదులే' అని నవ్వుతూ చెప్పడం, దానికి అన్న మొహంలో సంతోషం చూస్తుంటే జరిగిన దుర్మార్గానికి వారిలో నేటికీ ఎటువంటి పశ్చాత్తాపం లేకపోవడం స్పష్టమవుతుంది.

కేంపు నుంచి పారిపోయి వస్తూ రోడ్డుమీద పడిపోయిన ముస్లిం కుర్రాన్ని ఇంటికి తీసుకు వస్తుంది ఆరతి. పేరడిగితే మోసిన్ అని చెపుతాడు. అతని మెడలో తాబీజు లోపలికి పెట్టేసి అతన్ని 'మోహన్'గా మామగారికి పరిచయం చేస్తుంది. తరువాత వివరాలు అడిగితే 'వాళ్లంతా అరుస్తున్నారు. మొదట మా అమ్మను, ఆ తరువాత అన్నను నిప్పుల్లో కాల్చేసారు. మొత్తం మా కుటుంబాన్ని చంపేసారు. మా నాన్న కనబడలేదు' అని మోసిన్ చెపుతాడు. ఆరతి 'ఇదంతా నువ్వు చూశావా?' అని అడిగితే, 'చూశాను. మా అత్తను బట్టలూడదీసి చంపారు. ఆడవాళ్లందరివీ బట్టలూడదీశారు. కానీ మగాళ్ల బట్టలూడదీయలేదు' అని చెబుతుంటే ఆరతి అవమాన భారంతో తలదించుకుంటుంది. ఆమెతో పాటు మనం కూడా సిగ్గుతో తలదించుకొంటాం.

### జాగీర్ ఖాన్

ఖాన్‌సాబ్ సంగీత్ కచేరీలకు హిందువులు, ముస్లింలు వస్తూ ఉండేవారు. ఘటనల తరువాత ఒక హిందూ డాక్టరు తప్ప మిగతా ఎవరూ రారు. అతని సహాయకుడు కరీం 'ముస్లింలను కిరాతకంగా చంపారు కదా. దాని గురించి మీకు బాధేమీ లేదా?' అని అడుగుతాడు. 'ఏ మతం వారు ఏ మతం వారిని చంపారన్నది కాకుండా మనిషి మనిషిని చంపడం జరిగింది. దానికి నాకు బాధ కలుగుతుంది' అంటాడు.

ఒకరోజు ఆటోలో తిరిగి వస్తూ దారిలో ఆటో ఆపమని రోడ్డు పక్కన ఉండాల్సిన 'వలీ గుజరాతీ' దర్గా గురించి వెతుకుతాడు. అక్కడ అసలు దాని ఆనవాలే లేకుండా మొత్తం తవ్వేసి రోడ్లో కలిపేసి ఉంటుంది. దాదాపు మూడు వందల సంవత్సరాల క్రితం ఉర్దూ కవితా పితామహునిగా పేరుగాంచిన కవి 'వలీ గుజరాతీ'. ఆయన స్మారక చిహ్నంగా నిర్మించినదే ఆ దర్గా. ఆయన సూఫీ కవి. అన్ని మతాల, వర్గాల ప్రజలు ఆయన కవిత్వాన్ని ప్రేమిస్తారు. ఆయనంటే గుజరాతి ప్రజలకు అమితమైన గౌరవం. చారిత్రక చిహ్నమయిన ఆయన దర్గాను ధ్వంసం చేసిన వారెంత సాంస్కృతిక విధ్వంసకులో అర్థమవుతుంది.

ఖాన్‌సాబ్ టి.వి.లో వస్తున్న విధ్వంస దృశ్యాలను చూసి, విషాదంతో 'కరీం, నువ్వే కరెక్ట్. నేనే తప్పు' అంటాడు. అంటే ద్వేషం అంత స్థాయిలో ఉంటుందని ఆయన ఊహించ లేకపోవడం కనిపిస్తుంది. ఆయనంత నిరాశలో కూరుకుపోవడం భరించలేని కరీం 'మీలాంటి వారే ఆశను వదులుకుంటే మాలాంటి వారి గతి ఏమవుతుంది?' అని ఆవేదనగా అంటాడు. దానికి 'కేవలం సంగీతానికి కూడా ఇటువంటి ద్వేషాన్ని భరించే శక్తి లేదు' అని ఖాన్‌సాబ్ జవాబిస్తాడు.

'ఫర్జానియా'లో కథలో భాగంగా జరిగిన భయంకరమైన హింసను చూపించవలసి వచ్చినా అసలు విధ్వంసాన్ని, ఏమాత్రం తెరపై చూపకుండానే, దాని ప్రభావం సామాజిక జీవితాన్ని ఎంతలా మార్చుకు గురిచేసిందో వివరిస్తుంది సినిమా 'ఫిరాక్'. సినిమా కథకు అనుగుణంగా అత్యంత సహజంగా నసీరుద్దీన్ షా, దీప్తి నావల్, సంజయ్ సూరి, టిస్కో ఛోప్రా, షహన్ గోస్వామి, రఘువీర్ యాదవ్ నటించారు.

(ఇంకా ఉంది) వీ

*యూనివర్సిటీ ఆఫ్ మిషిగాన్ – డియర్ బార్న్‌లో తత్వశాస్త్ర ఆచార్యులుగా పనిచేస్తున్న* **డానియెల్ లిటిల్** *'ది సైంటిఫిక్ మార్క్స్', 'అండర్‌స్టాండింగ్ పీజంట్ చైనా', 'వెరైటీస్ ఆఫ్ సోషల్ ఎక్స్‌ప్లనేషన్', 'ఆన్ ది రిలయబిలిటీ ఆఫ్ ఎకనమిక్ మాడల్స్', 'ది పారడాక్స్ ఆఫ్ వెల్త్ అండ్ పావర్టీ' వంటి పుస్తకాలు రచించారు. మార్క్సిజం గురించి కొన్ని వివాదాస్పద వ్యాఖ్యలు ఉన్నప్పటికీ ఆలోచనాస్ఫోరకమైన ఈ వ్యాసాన్ని చర్చ కోసం ప్రచురిస్తున్నాం.*

# మార్క్సిజం - పరిశోధనా పద్ధతి

## ఉపోద్ఘాతం

ఈ వ్యాసం ఇరవయో శతాబ్దంలో మార్క్సిస్ట్ పరిశోధనా పద్ధతి ఎలా ఉండిందో చర్చిస్తుంది. అయితే ఇంకా ముందుకు కదలకముందే మనను మనం ఒక ప్రశ్న అడుక్కోవలసింది. అసలు మన దృష్టిలో పరిశోధనా పద్ధతి అంటే ఏమిటి? కళా, చరిత్ర, సాహిత్యం, సాంస్కృతిక అధ్యయనాలు, తత్వశాస్త్రం, చరిత్ర రచన, మొత్తంగా సామాజిక శాస్త్రాలు వంటి అనేక రంగాలలో పరిశోధనా చట్రాలకు మార్క్సిస్ట్ ఆలోచన ప్రేరణగా నిలిచిందనేది ఒక వాస్తవం. ఈ ప్రభావాలు మార్క్సిస్ట్ ఆలోచనలోని విభిన్న పాయలగుండా ముందుకు సాగాయి. ఆ విభిన్న పాయలను పరాయీకరణ సిద్ధాంతం, తప్పుడు చైతన్య భావన, శ్రమ విలువ సిద్ధాంతం, వర్గ ఘర్షణ, దోపిడీ సిద్ధాంతాలు, ఉత్పత్తి శక్తుల సంబంధాల సిద్ధాంతం లేదా ఉత్పత్తి విధాన సిద్ధాంతం అనే వేరు వేరు అంశాలలో చూడవచ్చు. అందువల్ల మార్క్సిస్ట్ పరిశోధనా పద్ధతి అనేది అనేక మార్గాలలో సంక్లిష్టంగా ఉంటుంది. మార్క్సిస్ట్ పరిశోధనా పద్ధతులను ఉపయోగించిన రంగాలెన్నో ఉన్నాయి. ఈ వేరువేరు వైఖరులకు దారితీసిన భిన్నమైన ధోరణులు మార్క్స్ ఆలోచనలోనే ఉన్నాయి.

సామాజిక శాస్త్రాల (చరిత్ర పరిశోధన కూడా నేను ఇందులో భాగంగానే చూస్తాను) పరిశోధనా సంవిధానం (మెథడ్) పైననే నేను కేంద్రీకరించ దలిచాను. ఇది మన పరిశీలనకు రెండు ప్రమాణాలను నిర్ణయిస్తుంది. గత శతాబ్దంలో సామాజిక ప్రపంచం గురించి మన అవగాహనను తీర్చిదిద్దడంలో మార్క్సిస్ట్ పద్ధతులు ఎలా ఉపయోగ పడ్డాయో చర్చిస్తుంది. అలాగే సాహిత్య, తాత్విక, నైతిక పరిశోధనలకు భిన్నంగా వాస్తవ జీవిత అనుభవ పరిశోధనా రంగంలో మార్క్సిస్ట్ పద్ధతి ప్రభావాలు ఎలా ఉన్నాయో కూడా మనం చర్చిస్తాం.

ఆధునిక సామాజిక శాస్త్రాల నిర్మాతలలో మార్క్స్ నిస్సందేహంగా ఒకరు. తన జీవిత కాలమంతా సాగించిన పరిశోధనతో, రచనతో ఆధునిక ఆర్థిక జీవనం పై శాస్త్రీయ విశ్లేషణ సాగించాలని ఆయన ఆశించారు. పెట్టుబడిదారీ విధానాన్ని ఒక వ్యవస్థగా శాస్త్రీయ విశ్లేషణకు గురిచేయవలసిన అవసరం ఎంత ముఖ్యమైనదో ఆయన తన జీవిత పర్యంతం చూపారు. అలాగే వాస్తవాలను అనుభవపూర్వకంగా పరిశీలించడంలో ఎంత చిత్తశుద్ధితో, నిజాయితీతో, పటుత్వంతో వ్యవహరించాలో కూడా ఆయన నిరంతరం చూపారు. అంటే, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం గురించి శాస్త్రీయ విశ్లేషణను రూపొందించాలనే కోరికకు అనుగుణంగానే ఆయన పరిశోధనా లక్ష్యాలు రూపొందాయి. ఇవాళ్టికీ సామాజిక శాస్త్ర పరిశోధనా, సిద్ధాంతం మార్క్స్ ఆలోచనల చేతనే బలంగా ప్రభావితం అయి ఉన్నాయి. ఇది సామాజిక చరిత్ర, సామాజిక శాస్త్రం, రాజకీయార్థిక శాస్త్రం వంటి రంగాలలో ప్రత్యేకంగా కనబడుతుంది. ఇక్కడ ఇరవయో శతాబ్ది సామాజిక శాస్త్రాల అభివృద్ధి క్రమంలో మార్క్సిస్ట్ వైఖరులు ఏ మార్గాల గుండా ప్రయాణించాయో సర్వేక్షణ చేయడం నా పని. సామాజిక శాస్త్ర పరిశోధనను నిర్వహించడంలో మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రం ఏ నిలిచిపోయే కానుకలను అందించిందో వివరించడం కూడా నా లక్ష్యం.

ఇరవయో శతాబ్ది సామాజిక శాస్త్రాలపై మార్క్స్ ఆలోచనల ప్రభావం ఎక్కడ చూస్తే అక్కడ కనబడుతుంది. సామాజిక చరిత్ర, శ్రామిక ప్రజల చరిత్ర, పెట్టుబడిదారీ వ్యవస్థ లోపల వివిధ నిర్మాణాలు, విప్లవం–వర్గంలతో కూడిన రాజకీయ చరిత్ర, కార్మిక వర్గపు నిత్య జీవితానుభవం, పరాయీకరణ, సామాజిక ప్రమేయాలు తారుమారుగా కనబడడం, వాస్తవ సామాజిక దృగ్గోచర అంశాలు, అవి రూపొందే తీరు, సంస్కృతి, రాజకీయార్థ శాస్త్రం, విద్యారంగపు సామాజికత, పెట్టుబడిదారీ సమాజాలలో రాజ్యాంగ యంత్రం వంటి ఎన్నో అంశాల మీద మార్క్సిస్ట్ దృష్టితో పరిశోధన జరిగింది. సామాజిక క్రమాలను, సామాజిక చరిత్రను మనం ఎలా విశ్లేషిస్తాం, ఎలా భావనీకరిస్తాం, ఎలా వివరిస్తాం అనే విషయాలు అర్థం చేసుకోవడానికి మార్క్స్ రచనలు ఎంతగానో తోడ్పడ్డాయి.

అయినప్పటికీ 'మార్క్సిస్ట్ సామాజిక శాస్త్ర పరిశోధనా పద్ధతి ఏమిటి' అనే ప్రశ్నకు ఒకే ఒక్క జవాబు లేదు. అందుకు భిన్నంగా ఇరవయో శతాబ్దిలో మార్క్సిస్ట్ సామాజిక పరిశోధనా అనేది ఎన్నో గళాలు, ఎన్నో ఆలోచనలు కలగలసిన బృందగానం. అందులో చాలా వాటికి ఒకదానితో మరొకదానికి పొంతన కుదరదు. ఇరవయో శతాబ్దిలో మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రం అనేది ఒకే కేంద్ర దృక్పథం ఉన్న, నిర్దిష్టమైన పద్ధతులకూ, సైద్ధాంతిక ప్రాతిపదికలకూ కట్టుబడిన ఒక క్రమబద్ధమైన పరిశోధనా సమూహం కాదు. దానిలో విపరీతమైన వైవిధ్యం ఉంది. ఒక్కొక్కరూ ఒక్కొక్క అంశాన్ని నొక్కి చెప్పారు. మార్క్సియన్ సామాజిక శాస్త్రం అనే సాధారణ వర్గీకరణ కిందికి వచ్చే విభిన్న ఆలోచనాపరుల వైవిధ్యం ఒక్కసారి చూడండి. ఇ.పి. థాంప్సన్, లూయి ఆల్తుజర్, జుర్గెన్ హేబర్‌మాస్, గెరాల్డ్ కొహెన్, రాబర్ట్ బ్రెన్నర్, నికోస్ పౌలంట్జాస్, రాల్ఫ్ మిలిబాండ్, నికోలాయ్ బుఖారిన్, జార్జ్ లూకాస్, మిచెల్ ఫూకో – అందరూ ఆ వర్గీకరణలోకే వస్తారు. ఈ రచయితలందరూ మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రానికి తమ కానుకలు అందించారు. కానీ, ఆ కానుకలేవి

సామాజిక శాస్త్రాలకు ఒకే ఒక్క క్రమబద్ధమైన, కేంద్రీకృతమైన సంవిధానాన్ని అందించవు. ఒక పరిశోధనా చట్రం అని చెప్పడానికి వీలైన నిర్ధారణల సమూహమేదీ లేదు. దానికి బదులుగా విభిన్న సంప్రదాయాల నుంచి విషయ పరిజ్ఞానం నిండిన, సంవిధానపు పూర్వకమైన రచనలు, సూచనలు ఎన్నో ఉన్నాయి. అవి కొన్ని చోట్ల గొప్ప లోతైన విశ్లేషణలు ఇస్తాయి. భవిష్యత్తులో పరిశోధించవలసిన అంశాలను సూచిస్తాయి. అందువల్ల ఒక సామాజిక శాస్త్రాల విద్యార్థి ఎవరైనా 'మార్క్సిస్ట్ సిద్ధాంతం' అనే దానిలో నైపుణ్యం సంపాదించాలంటే ఒక విజ్ఞానశాస్త్ర విద్యార్థిలా ఉండగూడదు. ఒక సాహిత్య విద్యార్థిలా ఉండాలి. విజ్ఞానశాస్త్ర విద్యార్థి అయితే, నిర్దిష్టమైన, క్రమబద్ధమైన పరిశోధనా క్రమశిక్షణను పాటించవలసి ఉంటుంది. సాహిత్య విద్యార్థి అయితే ఆలోచనలకు తలుపులు బార్లా తెరుచుకొని, అనేక అద్భుత గ్రంథాలను అధ్యయనం చేయవలసి ఉంటుంది.

## 'సామాజిక శాస్త్ర పరిశోధనా సంవిధానం?'

అసలు సామాజిక శాస్త్రాలకు ఒక సంవిధానం ఎందుకు అవసరం అవుతుంది? ఎందుకంటే సామాజిక ప్రపంచం అనంతమైన సంక్లిష్టతతో అనేక పాయలుగా ఉంది. దాన్ని సాదా పరిశీలనతో వివరించడం సాధ్యం కాదు. సామాజిక ప్రపంచం అనేది మౌలికంగానే భౌతిక ప్రపంచంతో వేరైన పద్ధతిలో ఉంటుంది. భౌతిక ప్రపంచం ఏ విధంగా 'నియమ బద్ధంగా' ఉంటుందో అదే స్థాయిలో సామాజిక ప్రపంచం నియమ బద్ధంగా ఉండదు. అందువల్ల సామాజిక ప్రపంచంలో నెలకొని ఉన్న నిర్మాణాలను, వ్యవస్థలను, కార్యకారణ సంబంధాలను మామూలు లోకజ్ఞానపు పద్ధతుల ద్వారా గానీ, లేదా ప్రకృతి శాస్త్రాలకు ఉపయోగ పడే పద్ధతుల ద్వారా గానీ అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. సామాజిక ప్రపంచం అనేది వందల కోట్ల పురుషులూ, స్త్రీలూ సాగించే కార్యకలాపాలతో ముందుకు సాగుతుంది. వారి వ్యక్తిగత ఆచరణలను ప్రేరేపించే, ఆటంకపరిచే అనేక సంస్థలు, నిర్మాణాలు, వ్యవస్థలు ఈ సామాజిక ప్రపంచంలో ఉంటాయి. ఆ మనుషుల సామాజిక అస్తిత్వాలు ఏ క్రమాలకు దారితీస్తాయో ఆ క్రమాలు నియమబద్ధమైనవీ కావు, ఇష్టారాజ్యంగా జరిగేవీ కావు. సామాజిక ప్రపంచం అధికారం, ఆధిపత్యం, దోపిడీ, ప్రతిఘటన సంబంధాలకు దారితీస్తుంది. ఈ సంబంధాల వల్ల కొందరు మనుషులకు అవకాశాలు కలుగుతాయి. మరికొందరు మనుషులకు అవకాశాలు నిరాకరించబడతాయి. ఆయా ఆచరణలు చేసే మనుషులకు, ఆయా వ్యవస్థలకు మధ్య ఉండే సంక్లిష్ట వినిమయ ఫలితంగా ఇది జరుగుతుంది. ఈ సంబంధాలలో ప్రతి ధృవమూ అవతలి ధృవాన్ని ప్రభావితం చేస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే సామాజిక ప్రపంచం అనేది సంక్లిష్టమైన చిక్కుముడి. అందువల్లనే సామాజిక పరిణామాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం ఏకకాలంలో అత్యవసరమూ, అతి కష్టమూ కూడా. ఇది ఈ మాట చెబుతున్న రెండు వేల సంవత్సరంలో ఎంత కష్టమో, 1830లలో కూడా అంతే కష్టం. ఆ సంవత్సరం ఎంగెల్స్ బర్మింగ్‌హామ్ పట్టణంలో నివసిస్తూ, ఆ పట్టణంలోని కార్ఖానాలు, మురికివాడలు, మహాభవనాలు, ఆకలి, సంక్షోభం నిండిన గందరగోళాన్ని అర్థం చేసుకోవడానికి, వివరించడానికి ప్రయత్నం మొదలుపెట్టాడు. తత్ఫలితంగా 'ది కండిషన్స్ ఆఫ్ ది వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లండ్' అనే పుస్తకం రాశాడు. ఆ ఫలితంగానే మార్క్స్ 'కాపిటల్' రాశాడు.

'సామాజిక శాస్త్రాల తాత్విక దృక్పథాన్ని, సంవిధానాన్ని' కలిగి ఉండడం అంటే ఏమిటి? అంటే ఏమిటంటే, ఈ కింద చెప్పే విభిన్న రంగాల ప్రశ్నలకు జవాబులు చెప్పగలగడం –

- పరిశీలన – అనేక రకాల పరిశోధనా పరికరాలను వాడుకోవడం ఎలా? వాటిని వాడుకొని దృగ్గోచరాంశాల సమూహం గురించి కొన్ని ప్రతిపాదనలకూ, కొన్ని సిద్ధాంతాలకూ రావడం ఎలా?
- జ్ఞాన సిద్ధాంతం – మనం లేవనెత్తే ప్రతిపాదనలకు, సిద్ధాంతాలకు సమర్థన చేకూర్చే అనుభవవాద సైద్ధాంతిక పరిగణనలను ఎలా ఉపయోగించాలి?
- అధిభౌతిక పద్ధతి – దృగ్గోచరాంశాల సమూహంలో మిళితమైన ఉన్న అస్తిత్వాల, క్రమాల నమూనాలను ఎలా వివరించాలి?
- సామాజిక శాస్త్ర జ్ఞాన వ్యవస్థ గురించిన సిద్ధాంతం – సామాజిక శాస్త్ర పరిశోధన ప్రయోజనం ఏమిటనే భావన. సామాజిక శాస్త్ర ఫలితాలు ఎలా ఉండాలనే దాని గురించి క్రమబద్ధమైన అవగాహన. (వీటిని సిద్ధాంతాలు అందమా? భౌతిక ప్రపంచంలో గుర్తించిన నిర్ధారణల సమూహం అందామా? గణాంక సూత్రాలు అందామా, ముఖ్యమైన సామాజిక క్రమాల గురించి వ్యాఖ్యాన కథనాలు అందామా, కార్యకారణ సంబంధాల ప్రతిపాదనల సమూహాలు అందామా?)

సంవిధానానికి సంబంధించినంతవరకు మార్క్స్ ఆలోచనలు గానీ, చాలా మంది మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రవేత్తల ఆలోచనలు గానీ ఈ ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి ప్రయత్నిస్తాయి. అయితే, ఈ జవాబులు అన్నిటినీ కలుపుకున్నప్పుడే మనకు దాదాపు సంపూర్ణమైన, సంబద్ధమైన సంవిధానం తయారవుతుంది.

## మార్క్సిజానికి చెందిన సామాజిక శాస్త్ర లక్ష్యం

సామాజిక శాస్త్రానికి స్వయంగా మార్క్స్ అందజేసిన కానుకల దగ్గరే ప్రారంభిద్దాం. ఒక సామాజిక శాస్త్రవేత్తగా మార్క్స్ పెట్టుకున్న ప్రధాన లక్ష్యాలు ఏమిటి? అని ప్రశ్నించుకోవడం అర్థవంతంగా ఉంటుంది. ఆయన ప్రధాన సైద్ధాంతిక కానుక ఎక్కడ ఉంది. ఆయన కృషి గానీ, ఆ కృషికి కొనసాగింపుగా సాగిన రచనలు గానీ, పెట్టుబడిదారీ విధానానికి, చరిత్రకు సంబంధించిన సిద్ధాంతాన్ని అందిస్తాయా? ఆయన కృషిలో అనుభవం నుంచి పరిశోధించగలిగిన, నిర్దిష్ట అనుభవానికి సంబంధించిన పరికల్పనలు ఉన్నాయా? ఆయన కృషి ఒక పరిశోధనా చట్రాన్ని గానీ, పరిశోధనా కార్యక్రమాన్ని గానీ ఇస్తుందా? ఇటీవలి కాలంలో కూన్, లకటోస్ ఇచ్చినటువంటి పరిశోధనా చట్రాన్ని ఆయన ఇచ్చాడా? అసలు మార్క్స్‌కు సామాజిక శాస్త్ర పరిశోధనా అనే స్పష్టంగా గుర్తించగలిగిన భావన – గతితార్కిక వాదనా సిద్ధాంతం – ఏదైనా ఉందా?

మార్క్స్ ఆలోచనల్లోని ప్రధాన శాస్త్రీయ లక్ష్యాలను కనీసంగా చెప్పాలంటే, మార్కెట్ ఆధారిత, ఆస్తి పునాదిగా గల ఆర్థిక వ్యవస్థలో ప్రధాన వ్యవస్థాగత లక్షణాలు ఏమిటో అనుభవం నుంచి వివరించి

చూపడం ఆయన లక్ష్యం. అలాగే, అనేక పెట్టుబడిదారీ సామాజిక, ఆర్థిక వ్యవస్థలలో ఈ వ్యవస్థాగత లక్షణాలు ఏ చారిత్రక క్రమాలలో రూపొందాయో తెలియజెప్పడం కూడా ఆయన లక్ష్యం. ఆయన ప్రధానమైన సామాజిక శాస్త్ర కానుక 'కాపిటల్'. ఆ గ్రంథం చారిత్రక వివరణ, సూక్ష్మమైన సామాజిక వివరాలు, వ్యవస్థల గురించి, వాటి పర్యవసనాల గురించి వాదనలు, గణిత శాస్త్రంతో కూడిన రాజకీయార్థ శాస్త్రం మొదలైనవెన్నో కలగలసిపోయిన సాంద్రమయిన సమ్మేళన రచన అది. పెట్టుబడిదారీ విధానపు వ్యవస్థలు ఒక నిర్దిష్టమైన ఉత్పత్తి విధానాన్ని కలిగి ఉన్నాయని, ఈ ఉత్పత్తి విధానానికి ఒక స్పష్టమైన చారిత్రక తర్కం ఉన్నదని మార్క్స్ నమ్మాడు. పెట్టుబడిదారీ విధానపు వ్యవస్థాగత సందర్భానికి లోబడి తమ జీవితాలు గడిపే సాధారణ పురుషులూ, స్త్రీలూ తమ వ్యక్తిగత జీవితంలోనూ, ఉత్పత్తి జీవితంలోనూ సంస్థలూ, సంఘాలూ, పార్టీలూ వంటి వివిధ సంస్థలలోనూ విభిన్నమైన పాత్రలు పోషిస్తాయి. అవన్నీ కలిసి సామూహికంగా ఒక విశాల స్థాయి మార్పుల క్రమాలకు దారితీస్తాయి. పెట్టుబడిదారీ అభివృద్ధిలో వ్యవస్థాగత దృశ్యానికి ఊహించదగిన పరిణామాలేవంటే, పెట్టుబడి సంచయనపు క్రమాలు. సాంకేతిక మార్పుల త్వరితాభివృద్ధి. సమాజం వర్గాలుగా విభజించబడడం. సామాజిక రూపొందే వ్యక్తులు ఆయా నిర్దిష్ట వ్యవస్థల లోపల ఊహించగలిగిన పద్ధతులలోనే ప్రవరిస్తారు. అందువల్ల జరగబోయే సామాజిక పరివర్తనా క్రమాన్ని అర్థం చేసుకోవడం, వివరించడం సాధ్యమవుతుంది. అంటే, ఉత్పత్తి సాధనాల మీద వ్యక్తిగత యాజమాన్యం, వేతన శ్రమ ఉండే వ్యవస్థల తర్కాన్ని అర్థం చేసుకోవచ్చునని, ఈ తర్కం ఏ పరిణామాలకు దారితీస్తుందో అన్వేషించ వచ్చునని అనుకోవడమే మార్క్స్ లక్ష్యాలో ఒకటి. అంటే, మార్క్స్ సామాజిక శాస్త్ర రచనలను సరిగ్గా అర్థం చేసుకోవాలంటే వాటిలో విభిన్న ఆలోచనా ధోరణులున్నాయనీ, వివరణా నమూనాలున్నాయనీ, చారిత్రక వ్యాఖ్యానాలున్నాయనీ, అవన్నీ స్థూలంగా ఒక చారిత్రక, సామాజిక పరివర్తన అనే మార్గదర్శక సూత్రం కింద పనిచేస్తాయనీ అర్థం చేసుకోవాలి.

ఇలా వ్యాఖ్యానించినప్పుడు సామాజిక శాస్త్రాలకు మార్క్స్ చేసిన దోహదం పెట్టుబడిదారీ విధానపు సంబద్ధమైన, సులభమైన సిద్ధాంతం అనే దానికన్న భిన్నమైన అర్థం వస్తుంది. ఆయన పెట్టుబడిదారీ విధానం అనేది ఒక సామాజిక ధర్మం అని గుర్తించి దాని గురించిన అవగాహన ఇస్తాడు. కాని, ఆ అవగాహనను ఏవో నాలుగైదు ప్రాతిపదికల మీద వివరించగలిగిన లాంఛనప్రాయమైన, గణిత శాస్త్రపూర్వకమైన సిద్ధాంతంగా వివరించడానికి కుదరదు. అందుకు భిన్నంగా ఆ అవగాహనలో వ్యవస్థల గురించి, ఆర్థిక సంబంధాల గురించి కుదించ డానికి వీలులేని పద్ధతిలో సామాజిక వివరణ, చారిత్రక వ్యాఖ్యానం, అంత లాంఛనప్రాయం కాని వాదనా పద్ధతి ఇమిడి ఉన్నాయి.

మరి మార్క్స్ రచనల్లో కనీసం సామాజిక శాస్త్ర పరిశోధన గురించి సంబద్ధమైన సిద్ధాంతమైనా ఉందా? కచ్చితంగా మార్క్స్ ఇతర చారిత్రక, సామాజిక పరిశోధకులకు పరికల్పనల కోసం ఎక్కడ వెతకాలనే విషయంలో మార్గదర్శకంగా ఉంటాడు. అంటే, మార్క్స్ స్వయంగా సాగించిన పరిశోధనలోనే మార్క్సిస్ట్ 'పరిశోధనా పద్ధతి' కి నిర్దిష్ట మూలాలు ఉన్నాయి. ఈ పరిశోధనా పద్ధతిలో అనేక అంశాలున్నాయి. మొట్టమొదట అది భౌతికవాదంతో కూడినది. అంటే, అది ఉత్పత్తి శక్తుల మీద, ఉత్పత్తి సంబంధాల మీద కేంద్రీకరిస్తుంది. అలాగే సాహిత్యం, సంస్కృతి, న్యాయశాస్త్రం వంటి సామాజిక నిర్మాణాల కన్న సాంకేతిక పరిజ్ఞానం, అధికారం అనేవి మౌలికమైనవని చెబుతుంది. ఈ పద్ధతి చారిత్రక పరివర్తనలో వర్గం, వర్గపోరాటం అత్యంత ముఖ్యమైనవని చెబుతుంది. అలాగే మనం నివసిస్తున్న సామాజిక వ్యవస్థల గురించి మన అవగాహనలో భావజాలం, తప్పుడు చైతన్యం వహించే పాత్ర గురించి అది జాగ్రత్త వహిస్తుంది. చివరిగా చరిత్రలో ఏ సమయంలోనైనా అట్టడుగున ఉన్న వర్గాల దృక్పథం పట్ల అది ప్రత్యేక శ్రద్ధ వహిస్తుంది.

మరి గతితర్కం సంగతి, హెగెల్ ఉపయోగించిన గతితర్కాన్ని తలకిందులు చేసానని మార్క్స్ చెప్పిన సుప్రసిద్ధ వ్యాఖ్య సంగతి ఏమిటి? మార్క్స్ గురించి వ్యాఖ్యానించిన అనేక మంది మేధావులకు భిన్నంగా ఆయన ఆలోచనల్లో గతితార్కిక సూత్రాలు అతి తక్కువ పాత్ర వహించాయని నేననుకుంటాను. ఆయన పరిశోధనా పద్ధతిలో గతి తార్కిక సూత్రాలకు అసలు పాత్రే లేదని నేననుకుంటాను. వ్యవస్థాత్మక మార్పుల గురించి చేసిన ఉన్నత స్థాయి పరికల్పనలో మాత్రమే గతి తార్కిక సూత్రాల పాత్ర ఉంది. వ్యవస్థలకు ఊహించని, ఉద్దేశించని పర్యవసానాలు కూడా ఉండవచ్చునని, ఒక్కోసారి మార్పుల క్రమాలను నిర్దేశించే వ్యవస్థల పునాదులను కూడా కదల్చగల శక్తి ఆ మార్పుల క్రమాలకు ఉండవచ్చునని, చారిత్రక క్రమాలలో 'వైరుధ్యాలు' ఉంటాయని ఈ గతితార్కిక సూత్రాలు చెబుతాయి. అయితే ఈ సూత్రాలు ఇతర మేధావులు చెప్పిన వాటికన్న నిగూఢమైనవేమీ కావు. ఉదాహరణకు, వ్యక్తిగత ప్రయోజనాలకూ, సామూహిక ప్రయోజనాలకూ మధ్య వైరుధ్యం ఉంటుందని మాంకర్ ఓల్సెన్ కనిపెట్టాడు. క్రమబద్ధంగా ఎంపిక ప్రక్రియ ఉండడం అసాధ్యమని కెనెత్ ఆరో రుజువు చేశాడు. పోటీ నిండిన మార్కెట్‌లలో సమాచార అసమతుల్యత వల్ల ఎంత దారుణమైన పర్యవసానాలు ఉంటాయో జార్జ్ ఆకర్ లోఫ్ విశ్లేషించాడు. అనుద్దేశ పూర్వక పర్యవసానాల గురించి, వ్యతిరేక ఫలితాల గురించి సామాజిక శాస్త్ర పరిశోధన ఎన్నో కీలకమైన విశ్లేషణలు చేసింది. మార్క్స్ రచనల్లో కూడా గతితార్కిక సూత్రాలు నిర్వహించే పాత్ర ఇదే.

గత ఇరవై సంవత్సరాలలో మార్క్సియన్ సామాజిక శాస్త్రంలో నిర్మాణాత్మకమైన కృషి అంతా 'రేషనల్ చాయిస్ మార్క్సిజం' (హేతుబద్ధ ఎంపిక ప్రధానమైనదని చెప్పే మార్క్సిజం శాఖ) చట్రం లోపలే జరిగింది. ఎల్‌స్టర్, రోమర్, బ్రెన్నర్, ప్రెజ్‌వోర్స్కీ వంటి రచయితలు మార్క్సిస్ట్ చారిత్రక విశ్లేషణలను, అర్థశాస్త్రంలోని రేషనల్ చాయిస్ సిద్ధాంతాన్ని, నూతన వ్యవస్థా వాదాన్ని కలగలపడానికి ప్రయత్నించారు. పెట్టుబడిదారీ విధానం అనే నిర్దిష్ట వ్యవస్థా నేపథ్యంలోనే ప్రతి మనిషి హేతుబద్ధంగా వ్యవహరిస్తారనే ప్రాతిపదికపైననే, దోపిడీ గురించి, వర్గం గురించి, పెట్టుబడిదారీ ధోరణుల గురించి మార్క్సిస్ట్ నిర్ధారణలకు రావడం సాధ్యమని ఈ రచయితలు చూపారు. దాన్ని బట్టి మార్క్సియన్ విశ్లేషణల కానుకలలోని సారాంశం విషయపరమైనదే తప్ప సంవిధానానికి సంబంధించినది కాదని తేలుతుంది. అంటే, మార్క్సిజం సామాజిక ప్రపంచం గురించిన కొన్ని నిర్ధారణల సమూహమే తప్ప, ఒక ప్రత్యేక పరిశోధనా భావనకు సూచిక కాదు.

(ఇంకా ఉంది) వీ

## ప్రజల కంటే సెల్‌ఫోన్లే అధికం

సెల్‌ఫోన్ కాల్‌రేట్ల తగ్గింపు, సెల్‌ఫోన్ హ్యాండ్ సెట్లు అందుబాటు ధరల్లో ఉండడంతో దేశంలోని నాలుగు మెట్రో నగరాలు ఢిల్లీ, ముంబయి, కొల్‌కత, చెన్నయిలలో నగరాలలోని జనాభా కంటే సెల్‌ఫోన్ కనెక్షన్లు అధికంగా ఉన్నాయి. ఇది గత పన్నెండు నెలల గణాంకాలను బట్టి తెలుస్తోంది. ప్రపంచంలోని పెద్ద నగరాలైన న్యూయార్క్, లండన్, పారిస్, టోక్యో, హాంగ్‌కాంగ్ వంటి వాటి సరసన ఈ నాలుగు నగరాలు చేరాయి. దేశంలో అత్యధికంగా చెన్నయి 143 శాతంతో మొదటిస్థానంలో ఉండగా, ఆ తరువాతి స్థానాల్లో ఢిల్లీ 138 శాతం, ముంబయి 112 శాతం, కొల్‌కత 102.4 శాతంగా ఉన్నాయి..

## మణిపూర్‌లో భద్రతా దళాలు

మణిపూర్‌లో సాయుధ దళాల అకృత్యాలను వ్యతిరేకిస్తూ ఐరామ్ షర్మిళా చాను చేపట్టిన నిరాహార దీక్షకు నవంబర్ 2తో తొమ్మిదేళ్లు పూర్తయ్యాయి. మణిపూర్‌లో సాయుధ బలగాలకు ప్రత్యేక అధికారాలను కల్పిస్తూ భద్రతా దళాల ప్రత్యేక అధికారాల చట్టం (ఏఎఫ్ఎస్‌పీఏ) జారీ చేశారు. దీని ప్రకారం ఎలాంటి అనుమతి లేకుండా భద్రతా దళాలు సోదాలు చేపట్టవచ్చు, అరెస్టు చేయవచ్చు, అవసరమైతే కాల్చేయవచ్చు. ఆ క్రమంలో ఇంఫాల్‌లోని షర్మిళ నివసించే ప్రాంతంలో అసోం రైఫిల్స్ బలగాలు 10 మందిని కాల్చిచంపాయి. దీంతో ఈ చట్టాన్ని రద్దు చేయాలంటూ షర్మిళ నిరసనకు దిగారు.

## బేషరతు చర్చలకు సిఐపి విజ్ఞప్తి

నక్సల్స్ ప్రాభావిత రాష్ట్రాల్లో గ్రీన్‌హంట్ పేరుతో కేంద్ర ప్రభుత్వం చేస్తున్న దాడిని పౌరహక్కుల కార్యకర్తలు, విద్యావేత్తలతో కూడిన సిటిజన్స్ ఇనీషియేటివ్ ఫర్ పీస్ (సిఐపి) అనే హక్కుల సంస్థ తప్పుబట్టింది. నక్సల్స్ ప్రాంతాల్లోని ప్రజల సమస్యలకు శాంతియుత పరిష్కారం కనుగొనాలంటే ప్రభుత్వం వెంటనే దాడులకు స్వస్తిపలికి నక్సల్స్‌తో బేషరతు చర్చలు జరపాలని సూచించింది.

## మత ఘర్షణ నిందితులకు జైలుశిక్ష

ఒరిస్సాలోని కొంధమాల్ జిల్లాలో స్వామి లక్ష్మణానంద హత్యానంతరం జరిగిన మతఘర్షణల్లో మోటుమహా గ్రామంలో మైనారిటీ వర్గానికి చెందినవారి ఇళ్లకు ఆందోళనకారులు నిప్పుపెట్టారు. గృహదహనాల కేసును విచారించిన ఫాస్ట్‌ట్రాక్ కోర్టు న్యాయమూర్తి జస్టిస్ సిఆర్ దాస్ ఈ కేసును విచారించింది. ఈ కేసులోని 14 మంది నిందితుల్లో బిజెపి ఎంఎల్ఎతో సహా మరో ఆరుగురిపై సాక్ష్యాలు లేని కారణంగా వారిని విడుదల చేస్తూ మిగతా ఎనిమిది మందికి నాలుగేళ్ల కఠిన కారాగార శిక్ష విధిస్తూ స్థానిక కోర్టు తీర్పు చెప్పింది.

## బాధితురాలి సాక్ష్యం చాలు

అత్యాచారం కేసులో నిందితుడిని శిక్షించడానికి బాధితురాలి సాక్ష్యం సరిపోతుందని, అందుకు మరిన్ని సాక్ష్యాధారాలను సమర్పించాల్సిన అవసరం లేదని ఢిల్లీ హైకోర్టు పేర్కొంది. ఐదేళ్ల బాలికపై అత్యాచారం కేసులో నిందితుడు రాజుకు జిల్లా సెషెన్స్ జడ్జ్ పి.ఎస్. తేజి సుప్రీం కోర్టు ఇచ్చిన వివిధ కేసులను ఉటంకిస్తూ 'బాధితురాలిని మరిన్ని సాక్ష్యాలు కోరడం ఆమెను అవమానించడమేన'ని అన్నారు. ఈ కేసులో రాజుకు కోర్టు కఠిన జీవిత ఖైదు విధించింది.

## మూడు రాష్ట్రాల్లోని ఎన్నికల ఫలితాలు

మహారాష్ట్ర, హర్యానా, అరుణాచల్ ప్రదేశ్ రాష్ట్రాల శాసన సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ గెలిచింది. ప్రభుత్వాలను ఏర్పాటు చేసింది. మహారాష్ట్రలో కాంగ్రెస్-ఎన్‌సిపిల కూటమి వరుసగా మూడోసారి అధికారంలోకి వచ్చింది. మొత్తం 288 స్థానాలకుగాను కాంగ్రెస్ 82, ఎన్‌సిపి 62 సీట్లు గెలుచుకున్నాయి. బిజెపి-శివసేన కూటమికి 90 స్థానాలు లభించాయి. హర్యానా ముఖ్యమంత్రిగా భూపిందర్‌సింగ్ హుడా రెండోసారి ఎన్నికయ్యారు. హర్యానాలో మొత్తం 90 శాసనసభ స్థానాలకు జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ 40 సీట్లను సాధించిన పెద్దపార్టీగా ఉంది. ఐఎన్ఎల్‌డి 31, బిజెపి 4 చోట్ల గెలుపొందాయి. అరుణాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రిగా దోర్జీ ఖండూ రెండోసారి ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. మొత్తం 60 స్థానాలకు జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ 42 సీట్లను సాధించింది.

## గ్రీన్‌హంట్ విఫలం కాకతప్పదు

కేంద్ర హోంశాఖ తలపెట్టిన ఆపరేషన్ గ్రీన్‌హంట్ విఫలం కాక తప్పదని పంజాబ్ మాజీ డిజిపి కె.పి.ఎస్. గిల్ తెహల్కా పత్రికతో ఒక ఇంటర్వ్యూలో వెల్లడించారు. ఈ పోరులో ఆదివాసులే ఎక్కువే నష్టపోతారని పేర్కొన్నారు. ప్రభుత్వాలు ఆదివాసులకు అడవి పై యాజమాన్య హక్కు ఇచ్చేందుకు మార్గాలు అన్వేషించడం లేదన్నారు. అదే విధంగా మావోయిస్టులపై సైనిక చర్య చేపట్టాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని లోక్‌సభ మాజీ స్పీకర్ రబీరే కూడా ఒక ప్రకటనలో తప్పుబట్టారు.

## మన ఆరోగ్య భద్రత దారుణం

నోబెల్ బహుమతి గ్రహీత, ఆర్థికవేత్త అమార్త్యసేన్ ముంబయిలో అక్టోబర్ 23న ఒక కార్యక్రమంలో మాట్లాడుతూ, 'మనదేశంలో ప్రాథమిక స్థాయిలో ఆరోగ్య భద్రతా చర్యలు చాలా దారుణంగా ఉన్నాయనీ, ప్రజలకు ఇప్పుడు అందిస్తున్న వైద్యసేవలు సరిపోవనీ అన్నారు. ప్రాథమిక స్థాయిలో వైద్య సేవలు అందించే విషయంలో మన దేశం అధమస్థానంలోనే ఉందన్నారు.

## మధుకోడా అక్రమాలు

జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి మధుకోడా గనుల అక్రమాలు, అవినీతి బయటపడ్డాయి. ఒక సామాన్య ఆదివాసీ కుటుంబంలో పుట్టి, రాజకీయాలలోకి ప్రవేశించారు. ముఖ్యమంత్రి అయ్యాక అవినీతి, అక్రమాలకు పాల్పడి నాలుగు వేల కోట్ల రూపాయల మేరకు ఆస్తులు కూడబెట్టారు. మధు కోడా దేశంలోనే కాకుండా, విదేశాలలో అనేక రూపాల్లో పెట్టుబడులు పెట్టారు. ప్రస్తుతం ఈ ఉదంతం పై విచారణ జరుగుతోంది. వీ

## బాగ్దాద్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్ రాజధాని బాద్దాగ్‌లో అక్టోబర్ 25న జరిగిన ఆత్మాహుతి దాడిలో 130 మందికి పైగా చనిపోయారు. ఐదు వందల మందికి పైగా గాయపడ్డారు. బాగ్దాద్ ప్రాంతీయ పాలనా కార్యాలయం దగ్గర ఉన్న మన్సూర్ హోటల్, న్యాయ మంత్రిత్వ శాఖ కార్యాలయం సమీపం పేలుడు పదార్థాలతో నిండిన కార్లతో ఆత్మాహుతికి పాల్పడ్డారు. ముఖ్యంగా ప్రభుత్వ కార్యాలయాను లక్ష్యం చేసుకొని ఈ దాడులకు పాల్పడ్డారు. ఈ దాడిలో ప్రధాని కార్యాలయంతోపాటు అమెరికా దౌత్య కార్యాలయం కూడా మరెన్నో కార్యాలయాలు దెబ్బతిన్నాయి.

## రెండోసారి అధ్యక్షుడిగా కర్జాయ్

అఫ్ఘానిస్థాన్ అధ్యక్షుడిగా హమీద్ కర్జాయ్ రెండోసారి అధికారాలు చేపట్టారు. నవంబర్ 19న కాబూల్‌లోని అధ్యక్ష భవనంలో కర్జాయ్ అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేశారు. ఆయనతోపాటు ఉపాధ్యక్షులుగా మహమ్మద్ ఫాహిమ్, అబ్దుల్ కరీం ఖలీలీలు కూడా ప్రమాణ స్వీకారం చేశారు. ఈ సందర్భంగా జాతీయ సమైక్యతతో నడిచే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తానని కర్జాయ్ అన్నారు. వచ్చే అయిదేళ్లలో దేశ భద్రతా బాధ్యతలను ఉత్తర అట్లాంటిక్ దేశాల కూటమి (నాటో) నుంచి తమ సాయుధ బలగాలు అందుకుంటాయని తెలిపారు. ప్రతిపక్ష అభ్యర్థి అబ్దుల్లా అబ్దుల్లాను ప్రభుత్వంలో చేరాలని పిలుపునిచ్చారు.

## పాకిస్థాన్‌లో మారణహోమం

పాకిస్థాన్ ఆత్మాహుతి దాడులతో భీతిల్లుతోంది. అనేక నగరాలలో జరిగిన ఆత్మాహుతి దాడులు, బాంబు దాడులలో తీవ్రమైన ప్రాణ, ఆస్తి నష్టం సంభవించింది. పాకిస్థాన్ సైన్యాలు చేస్తున్న దాడులకు వ్యతిరేకంగా తాలిబన్‌లు ఇలా భయోత్పాతం సృష్టిస్తున్నారు. ప్రభుత్వ భవనాలు, సైనిక స్థావరాలు, ప్రైవేట్ ఆస్తులు, ప్రార్థనా స్థలాలు, ప్రముఖ హోటల్లు, కూడళ్లు, విద్యా సంస్థలు ఇలా అన్ని ప్రముఖ ప్రాంతాలూ, జనవాస కూడళ్లలో బాంబు దాడులు, ఆత్మాహుతి దాడులతో తీవ్ర ప్రాణ, ఆస్తి నష్టం కలగజేస్తున్నాయి.

## నేపాల్‌లో మావోయిస్టుల నిరసన

నేపాల్‌లోని సంకీర్ణ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మావోయిస్ట్ నిరసనకారులు ర్యాలీ నిర్వహించారు. ఖాట్మండులోని ప్రభుత్వ కార్యకలాపాలకు కేంద్రమైన సింఘ్ దర్బార్‌ను నవంబర్ 12న లక్షలాది మంది మావోయిస్ట్ నిరసనకారులు భారీ ర్యాలీ నిర్వహించారు. ఈ ర్యాలీకి మావోయిస్ట్ అగ్రనేత పుష్పకమాల్ దహల్ ప్రచండ, మరో అగ్రనేత మోహన్ వైద్య కిరన్ నాయకత్వం వహించారు. 'పౌర ఆధిపత్యం కోసం, సంకీర్ణ ప్రభుత్వాన్ని గద్దె దించడానికి తాము ప్రచారం చేస్తున్నామని, మేం నిజమైన ప్రజాపరిపాలన సాధించాలనుకుంటున్నాం' అని వైద్య కిరణం తన మద్దతుదారులతో అన్నారు. ఈ ర్యాలీ ప్రచండ, వైద్య కిరణ్‌లతోపాటు బాబూ రామ్ భట్టారి, నారాయణ కాజి శ్రేష్ఠ, సి.పి. గజుర్ల, కృష్ణబహదూర్ మహర్ వంటి ఇతర సీనియర్ మావోయిస్ట్ నాయకులు నేతృత్వం వహించారు. ప్రభుత్వం సెక్రటేరియట్ చుట్టూ పెద్ద ఎత్తున పోలీసు బలగాలను మోహరించి మావోయిస్టులను అడ్డుకోవడానికి ప్రయత్నించింది.

## మంచులో చైనా

చైనాలో మంచు తుపాను బీభత్సం సృష్టిస్తోంది. ఉత్తర చైనాలో ఈ మంచు తుపాను వల్ల నలభై మందికి పైగా మరణించారు. గత పదేళ్లలో ఇంత భారీగా మంచు కురవడం ఇదే మొదటిసారి. మంచు తుపానుతో జనజీవనం అంతా స్తంభించిపోయింది. మంచు కురవడానికి శాస్త్రవేత్తలు చేసిన మేఘమథనం కారణంగానే ఇంత విపరీతంగా మంచు తుపాను కురుస్తోందని విశ్లేషకులు చెబుతున్నారు. వేల ఇళ్లు నేలమట్టమయ్యాయి. వేల కోట్ల రూపాయల శీతాకాల పంటను నష్టపోయారు. దేశ రాజధాని బీజింగ్, శాంగ్జి, హుబేయ్, హీబెయ్, షాండాంగ్, నింగ్జియాహుయ్ తదితర ప్రాంతాల్లో భారీగా మంచు కురిసింది.

## ముజిబుర్ హంతకులకు ఉరిశిక్ష

బంగ్లాదేశ్ వ్యవస్థాపకుడు షేక్ ముజిబుర్ రెహమాన్ హంతకులకు ఉరిశిక్ష పడింది. 34 సంవత్సరాల కింద 15 ఆగస్ట్ 1974న సైనికులు తిరుగుబాటు జరిపి రెహమాన్‌ను కాల్చి చంపారు. ముజిబుర్ నివాసంలో జరిగిన ఈ హత్యాకాండలో రెహమాన్‌తో పాటు, సైనికాధికారులు, పనిమనుషులు, మొత్తంగా ఇరవై మంది మరణించారు. ఆ సమయంలో ఆయన కుమార్తె, ప్రస్తుత బంగ్లా ప్రధాని షేక్ హసీనా విదేశాల్లో ఉండడంతో ప్రాణాలతో బయటపడింది. ఎంతో సుదీర్ఘకాలం జరిగిన ఈ హత్యా విచారణలో మొత్తం 12 మందిపై ఈ అభియోగాలు నిరూపితమయ్యాయి. ఇందులో ఐదుగురికి బంగ్లాదేశ్ సుప్రీం కోర్టు ఉరిశిక్ష విధించింది. వీరంతా అప్పటి సైనిక అధికారులే. వీ

# వీక్షణం 2009 సూచిక


**జనవరి 2009** — సంచిక 90

❖ **ఫోకస్ : కొత్త సంవత్సరం, కొత్త ప్రభుత్వం – సామాన్యుల ఆశలు, కలలు**

నిందితులను సరే, వ్యవస్థనేం చేద్దాం? (సంపాదకీయం)
ముంబయిలో జన హననం; ఐదు రాష్ట్రాల ఎన్నికలు;
బుష్‌కు బూట్ల సత్కారం (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
కోస్తా ప్రజలకు కారిడార్ కార్చిచ్చు – ఎం. శ్రీనివాసరావు
వరంగల్ 'ఎన్‌కౌంటర్' గురించి – కె.జి. కన్నబిరాన్
నిందితుల ఎన్‌కౌంటర్ – అమ్మాయిల భద్రత? – పి. కృష్ణారావు
సంస్మరణ – స్మైల్
ముంబయి దాడులు – అద్దంలో రాకాసి – అరుంధతీ రాయ్
సంస్మరణ – జ్వాలాముఖి
టాటాగారూ, బిల్లు కట్టి కదలండి! – డి. బంద్యోపాధ్యాయ
ఎవరిది ప్రజాస్వామ్యం? – కె. విజయకుమార్
కేంద్ర – రాష్ట్ర సంబంధాలు – వి. హనుమంతరావు
మళ్లీ ఉద్యోగాలు ఎన్నేళ్లకో? – ఇ.ఎస్. బ్రహ్మాచారి
ఆర్థిక మాంద్యం తాకిడికి తట్టుకోగలమా? – వి. చలపతిరావు
ఛిద్రమౌతున్న జీవితఖైదీల బతుకులు – ఎ. కొండయ్య
ప్రత్యేక ఆర్థిక మండలాల్లో మహిళలు – రాజేష్ సాదు
అహింసాజ్యోతి లోహియా – నిరంజన్ రామకృష్ణన్
అగ్నిగుండంగా పశ్చిమాసియా – డా. మానేపల్లి
ప్రశ్నించాల్సిన బొగ్గుగనుల విధ్వంసం – పిట్టల రవీందర్
మార్క్సిజం అంటే ఏమిటి? – బెర్టెల్ ఓల్‌మన్
అటవీ ప్రాంతాలలో ప్రభుత్వేతర సంస్థలు – పల్లెర్ల కల్పన, పసుల యాకస్వామి
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**ఫిబ్రవరి 2009** — సంచిక 91

❖ **ఫోకస్ : మతోన్మాదం – కొత్త రంగులు, కొత్త హింసా రూపాలు**

కార్పొరేట్ మోసాలకు ఒక సూచిక (సంపాదకీయం)
మహాకూటమి ప్రత్యామ్నాయమా?; కాశ్మీర్ ఎన్నికలు;
లిబరేషన్ టైగర్స్ పతనం?(సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
స్విస్ బ్యాంకుల్లో భారతీయుల సంపద – బిజన్ ఘోష్
'సత్యమే' అబద్ధం – పెద్దల సహకారం నిజం – కె.వి. కూర్మనాథ్
ధరలెందుకు పెరుగుతున్నాయి? – వి. చలపతిరావు
జ్యోతిష్యంతో తెలంగాణ వచ్చేనా? – కె. ప్రభాకర్
వివక్షకు గురవుతున్న రాయలసీమ – ఎ. రంగారెడ్డి
ప్రత్యేక రాయలసీమ ఏర్పాటు – మహమ్మద్ షఫీయొద్దీన్, దేవాత్ సురేష్
ఆదాయ వ్యయాలు సరిగా చూపలేని ప్రభుత్వాలు – వి. హనుమంతరావు
ఆకలి చావుల చిరునామా – అంతర్గామ – పిట్టల రవీందర్
❖ మతతత్వం – చారిత్రక మూలాలు – వకుళాభరణం రామకృష్ణ
❖ ఆచరణలో ఎదుర్కోవలసిన మతోన్మాదం – సి.ఎస్.ఆర్. ప్రసాద్
❖ భారతదేశపు హిట్లర్ ఆవాహన – రాం పునియానీ
❖ 'మతతత్వ' హింస – ఇటీవలి పోకడలు – ఎన్. వేణుగోపాల్
ఆత్మరక్షణా, రాజ్య ఉగ్రవాదమా? – సాజీగోపాల్
'అభివృద్ధి'ని ప్రశ్నిస్తున్న బాధితులు – శివలక్ష్మి
పడుపు వృత్తి నివారణ – సామాజిక బాధ్యత – ఎ. సుదయ్య, మడికొండ రాజు
వరంగల్ నగరపాలక సంస్థ – మహిళలు – తట్ల సాంబలక్ష్మి, కొత్తపల్లి లలిత
పుస్తక పరిచయం– రాయలసీమ నెత్తుటి బతుకు చిత్రం – దుప్పల రవికుమార్
రైతులను కూలీలుగా మారుస్తున్న సెజ్‌లు – బదుగు సదానందం, బేతమల్ల సుధాకర్
ఆర్య – ద్రావిడ సమ్మేళనం – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
విద్యా సూత్రపు అన్వేషణలో... – ఆంటోనియో గ్రాంసీ
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**మార్చ్ 2009** — సంచిక 92

❖ **ఫోకస్ : డాక్టర్ రామ మనోహర్ లోహియా – భావాలు, సమకాలీనత**

ఎందుకూ కొరగాని ఆపద్ధర్మ బడ్జెట్లు(సంపాదకీయం)
జీవిత ఖైదీల విడుదల; ఎన్‌కౌంటర్లు హత్యలే;
ఉపఖండం నిండా దుర్వార్తలు (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
కేంద్ర బడ్జెట్ ఎవరి ప్రయోజనాల కొరకు? – వి. హనుమంతరావు
ఎన్‌కౌంటర్లపై హైకోర్టు చరిత్రాత్మక తీర్పు – డి. సురేష్ కుమార్
ప్రభుత్వ బాధ్యత – కార్పొరేట్ ద్వంద్వ నీతి – కె. వి. కూర్మనాథ్
కొత్త చట్టం – హక్కుల నేతపై దాడి – ఎ. స్నేహలత
కోస్తా కారిడార్ – పర్యావరణ సమస్యలు – ఎం. శ్రీనివాసరావు
సల్వాజుడుం కాదది, సర్కారీ జులుం – గుంటి రవి
❖ రామమనోహర్ లోహియా – వ్యక్తి, వ్యక్తిత్వం – డా. వెల్చాల కొండలరావు
❖ మహా మేధావులు – మార్క్స్, లోహియా – డా. జె.వి. రాఘవేంద్ర రావు
❖ బి.సి.ల సాధికారికత రామ్‌మనోహర్ లోహియా – బి.ఎస్. రాములు
❖ లోహియా జ్ఞాపకాలు – వరవరరావు
ఎన్నికల చక్రబంధంలో తెలంగాణ – డా. జి. లచ్చయ్య
హామీలు చేనేతకు – నిధులు టెక్స్‌టైల్‌కు – బండారు జ్వాలా నరసింహం
గ్రామీణ దళిత మహిళ – జీవన స్థితిగతులు – కె. పుణ్యవతి యాదవ్
అశ్వ సంప్రదాయం – సంకర్షణలు, సంఘర్షణలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
శాస్త్రంగా రాజకీయార్థిక దృక్పథం – హజిమె కవాకామి
ధర్నాచౌక్ – ---
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**ఏప్రిల్ 2009** — సంచిక 93

ϖ **ఫోకస్ : ఎన్నికల వేళ కొన్ని విస్మృత విషయాలు**

ఎన్నికలు ఏం సాధిస్తాయి? (సంపాదకీయం)
అధికారులు ఎవరి సేవకులు?; హిట్లర్ దారిలో...;
పాకిస్తాన్ ప్రజల విజయం (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
❖ ఎన్నికల వేళ సామాన్యుల అభిప్రాయాలు
❖ ఈ ఎన్నికలు ఎవరి కోసం? – కిరణ్
❖ సమస్యలు నక్సలైట్లవా? ప్రజలవా? – వరవరరావు
❖ ఎన్నికలు – గని కార్మికుల భవిష్యత్తు – పిట్టల రవీందర్
సంస్మరణ – కైఎన్‌వై పతంజలి
❖ ప్రజాస్వామ్యమంటే ఎన్నికలు మాత్రమేనా? – ఎన్. వేణుగోపాల్
ఎక్కుపెట్టిన తుపాకుల మధ్య మణిపూర్ – సి. వనజ
నేటి నినాదం 'అసత్యమేవజయతే' – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి

చరిత్ర సృష్టించిన షికాగో కార్మికులు – పి.వి. రమణ
తమిళనాడులో ఏం జరుగుతోంది? – డా. జి. లచ్చయ్య
తిరోగమనంలో పురోగమనం – వి. హనుమంతరావు
ఖైదీల హక్కులను కాలరాస్తున్న చెరసాలలు – ఎ. స్నేహలత
చేనేత చచ్చిపోతుందా? – పులుగుజ్జు సురేష్
మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు – సాంబయ్య గుండిమెడ
పంట పొలాల్లో పరిశ్రమలా? – లింగబత్తిని మల్లేష్, పిట్ట నర్సింగం
రాష్ట్ర వ్యవసాయాభివృద్ధి – ఒక పరిశీలన – దాసరి సత్యనారాయణ
మురికివాడల ముఖచిత్రం – దొమ్మట రాజయ్య, మాదరాజు అంజయ్య, గంధమల్ల రామయ్య
చరిత్ర కూడా విజ్ఞాన శాస్త్రమా? – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా? – కృష్ణా భరద్వాజ్
ధర్నాచౌక్ – ---
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**మే 2009** **సంచిక 94**

**❖ ఫోకస్ : నలభై సంవత్సరాల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం**

ఎన్నికలు ఏం చెపుతున్నాయి? (సంపాదకీయం)
ప్రాంతీయ విద్వేషాలు; ప్రత్యామ్నాయ రాజకీయాలు;
శ్రీలంక దారుణ మారణకాండ (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
రాష్ట్రంలో ఎన్నికలు ఎలా జరిగాయి? – రాజవరం పార్థసారథి
చీడపట్టిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం – వి. హనుమంతరావు
సంస్మరణ – బొర్రా వెంకటేశ్వర్లు
రిజర్వేషన్ల వర్గీకరణ – ప్రభుత్వాల మోసపూరిత వైఖరి – ఎం. శ్రీనివాస్
ప్రపంచ ఆర్థిక మాంద్యం – కె. నరేంద్రమోహన్
కొనసాగుతున్న బినాయక్ సేన్ నిర్బంధం – డి.వి. రామకృష్ణారావు
❖ నలభై ఏళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – వరవరరావు
❖ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – ఒక పరిశీలన – ఆకుల భూమయ్య
❖ తెలంగాణ ఉద్యమాన్ని ఎట్లా చూడాలి? – ఎం. కోదండరామ్
❖ 'ప్రత్యేక తెలంగాణ'కు నలభై ఏళ్లు – ఎన్. వేణుగోపాల్
❖ అవును, తెలంగాణలో మీరు విదేశీయులే! – పిట్టల రవీందర్
స్త్రీలపై జరుగుతున్న హత్యలు – అత్యాచారాలు – సంకినేని వెంకటయ్య, సంకినేని మంజుల
ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాలు – ఆహార భద్రత – కె. అనురాధ
మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు – సాంబయ్య గుండిమెడ
భూంపల్లి దాసరుల బతుకులు – తిరునగరి మనోహరస్వామి, తాళ్లపల్లి సదయ్య, ఎం. రాజేందర్‌రెడ్డి
హిమయుగాలు, చరిత్ర – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా? – కృష్ణా భరద్వాజ్
వీక్షణం రచయితల సమావేశం – ---
పుస్తక పరిచయం- 'భాష-సంస్కృతి-సమాజ దర్శనం' – వి. చలపతిరావు
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి సేకర్తల సమావేశం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**జూన్ 2009** **సంచిక 95**

**❖ ఫోకస్ : కొత్త ప్రభుత్వం – సొంత ఎజెండా – ప్రజల ఆకాంక్షలు**

రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలు (సంపాదకీయం)
కేంద్రంలోనూ అంతే;
ప్రభాకరన్ యుగం ముగిసిందా?(సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
❖ రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలు – తీరు తెన్నులు – ప్రొ. జి. హరగోపాల్
❖ ఈ నాటకాన్ని చూద్దామా? ఆపుదామా? – కె. రవి
❖ ఓడింది తెలంగాణ కాదు, తెరాస వ్యూహం! – ఎం. కోదండరాం
పాలకుల వైఫల్యం భోలక్‌పూర్ – డి.వి. రామకృష్ణారావు
శ్రీలంక తమిళజాతిపై హత్యాకాండ – ఎం. శ్రీనివాసరావు
ప్రైవేటీకరణ పడగ నీడలో సింగరేణి – సిఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి
తెలంగాణ రైతు కరెంట్ కష్టాలు – పిట్టల రవీందర్
పష్తూన్ జాతీయ విమోచనోద్యమం – పి. ప్రసాద్
గ్రామాభివృద్ధి – గ్రామీణ ఉపాధి పథకం – ముదునూరి భారతి
వాతావరణ సంక్షోభ మూలాలు – కె. నరేంద్రమోహన్
సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా? – కృష్ణా భరద్వాజ్
చిన్నా, పెద్ద హిమయుగాలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
ఇవి కూడా గమనంలో ఉండాలి! – శ్రీధర్ దేశ్‌పాండే, పిట్టల రవీందర్
మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు – సాంబయ్య గుండిమెడ
పుస్తక పరిచయం- పరిశోధకులకు ఉపయోగపడే వ్యాసాలు – ఆకుల భూమయ్య
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**జూలై 2009** **సంచిక 96**

**❖ ఫోకస్ : జూలై 2009 మన పాఠశాల విద్యారంగం**

రాజకీయ పక్షాలలో అసమ్మతి వెల్లువ (సంపాదకీయం)
లాల్ ఘడ్ ఆదివాసుల ఆందోళన;
ఇరాన్ ఎన్నికల ఫలితాలు (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
ఆకలి చావులు – అసలు కారణాలు – రమా ఎస్. మెల్కోటే
వ్యవసాయ సంరక్షణ – ఆహార భద్రత – వి. హనుమంతరావు
ప్రపంచబ్యాంక్ నివేదిక – విమర్శనాత్మక సమీక్ష – ముదునూరి భారతి
మహిళా రిజర్వేషన్లు – అన్నివర్గాల ప్రాతినిధ్యం ? – పవన
శ్రీలంక తమిళుల పోరాటం – ఎం. శ్రీనివాస్
❖ ఆంధ్రప్రదేశ్‌లో ప్రాథమిక విద్య – ఎం. గంగాధర్
❖ విద్యారంగంలో తిరోగమన విధానాలు – ఎ. నరసింహారెడ్డి
❖ సంక్షోభంలో పాఠశాల విద్య – కె. వేణుగోపాల్
❖ చిక్కి శల్యమౌతున్న ప్రభుత్వ పాఠశాలలు – పి. కృష్ణారావు
❖ పరిమిత లక్ష్య దిశలో పాఠశాల విద్య – విద్యాభూషణ్
❖ ఇంటర్ విద్య రద్దు ఎందుకోసం? – కె. శ్యామ్‌రావు
పష్తూన్ జాతీయ విమోచనోద్యమం – పి. ప్రసాద్
మార్క్స్ 'కాపిటల్' ఎలా చదవాలి? – లూయీ ఆల్తూసర్
అమెరికా వలసలకు తొలి ప్రయత్నాలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
బౌద్ధం – మనుధర్మం – మచ్చ ప్రభాకర్
జాతీయ ఉపాధి హామీ పథకం – అమలు – బుర్ర శ్రీధర్, కేతిరెడ్డి వాసు
ప్రత్యేక పంథాలో క్యూబా ప్రగతి – రిచర్డ్ లెవిన్స్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**ఆగస్ట్ 2009** **సంచిక 97**

**❖ ఫోకస్ : సింగరేణి బొగ్గు గనులు – నిన్నా, నేడూ, రేపూ**

ధరలెందుకు పెరుగుతున్నాయి? (సంపాదకీయం)
ఎట్టకేలకు లిబర్హాన్ నివేదిక;
హంతకముఠాగా సి ఐ ఎ (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---

ప్రాంతీయం – ---
కేంద్ర బడ్జెట్ ఎవరికోసం? – వి. హనుమంతరావు
కేంద్ర బడ్జెట్ 2009-10 – ఎం.సి. స్వామినాథన్
ఆశించిన వృద్ధిరేటు సాధ్యమేనా? – వి. చలపతిరావు
ఆర్.ఒ. మిషన్ల అసలు ఉద్దేశాలు – సి. రామచంద్రయ్య
ప్రైవేటీకరణే యశ్‌పాల్ సిఫార్సుల ఎజెండా – కె. వేణుగోపాల్
సంస్మరణ – గొర్రెపాటి నరేంద్రనాథ్
యశ్‌పాల్ సిఫారసులు – మార్కెట్ శక్తులు – ఎం. శ్రీనివాస్
లాల్‌ఘడ్ – ఆశావహమైన నిప్పురవ్వ – శామ్ షెల్
❖ సింగరేణి బొగ్గు గనులు – నాటి స్థితి – ఎస్. సోమరాజు
❖ సింగరేణి – పరిణామాలు, పర్యవసానాలు – పిట్టల రవీందర్
❖ సింగరేణి – స్థానికుల అస్తిత్వ పోరాటం – పి. చంద్
❖ ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమ కీలకాంశాలు – ఎం. కోదండరాం
❖ 'కాల్మొక్త, మా ఊరుని తీపియ్యండి!' – సి. వనజ
ప్రపంచబ్యాంక్ నివేదిక – విమర్శనాత్మక సమీక్ష – ముదునూరి భారతి
క్షేత్రపరిశోధన అనుభవం – పునస్సమీక్ష – పి.సి. జోషి
పర్యావరణం, జాతుల వైవిధ్యం – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
పుస్తక పరిచయం- నిజాయితీ నిండిన కీర్తి – కాకరాల
2009 సాధారణ ఎన్నికలు – కడియాల సుబ్బనాచారి
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**సెప్టెంబర్ 2009** **సంచిక 98**
**❖ ఫోకస్ : మహిళా ఉద్యోగుల సమస్యలు**
ఎవరికోసం సహకార వ్యవసాయం? (సంపాదకీయం)
కరువు నివారణ అసాధ్యమా?;
బలోచిస్తాన్‌లో ఏం జరుగుతోంది?(సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
సహకార సేద్యం ప్రతిపాదనలు – విశ్లేషణ – డా. జి.వి. రామాంజనేయులు
ఖైదు – విడుదల దాగుడుమూతలాట – వరవరరావు
కరువుకు కరువు రావాలి – వి. హనుమంతరావు
మాతృభాష – గుమస్తా ఉద్యోగం? – డా. జి. లచ్చయ్య
ఓపెన్‌కాస్ట్ ఉద్యమం, ఫూల్‌బరీ అనుభవం – పిట్టల రవీందర్
❖ మహిళను యంత్రంగా మార్చిన ఉద్యోగం – పి. జయ
❖ టెలికం వ్యవస్థ – ఉద్యోగినులు – పి. శివలక్ష్మి
❖ సంఘటిత రంగంలో మహిళా ఉద్యోగులు – నెల్లుట్ల అరుణ
❖ మహిళల పై దాడుల్ని ఎదుర్కోవాలి – ఎస్. నీలాదేవి
❖ దిగజారుతున్న ఉద్యోగినుల పరిస్థితి – అనంతలక్ష్మి
❖ మారిన ఉద్యోగాలు – కొత్త సమస్యలు – కె. సుభాషిణి
❖ మహిళా ఉద్యోగుల సమస్యలు – టి.ఎన్.జి.ఒ. మహిళలు
❖ మహిళలకు ఆఫీసుల్లో వేధింపులు – డి.ఆర్. మంజుల
పేదరిక నిర్మూలన, ప్రపంచబ్యాంక్ అవగాహన – ముదునూరి భారతి
క్షేత్రపరిశోధన అనుభవం – పునస్సమీక్ష – పి.సి. జోషి
నిర్బంధంలోనే నిర్భయ పోరాటం – చిర్ర కుమారస్వామి, ఎన్. వెంకన్న
మనుషుల్లో జాతులు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
వాస్తవిక సినిమాకు పునాదులేసిన బిమల్‌రాయ్ – పి.వి. రమణ
పుస్తక పరిచయం- సంస్కరణకు ఆచరణాత్మక ప్రతీక – విద్యాభూషణ్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**అక్టోబర్ 2009** **సంచిక 99**
**❖ ఫోకస్ : చైనా విముక్తికి అరవై ఏళ్లు – పాఠాలూ, గుణపాఠాలూ**
విధానాల మీద పోరాడవలసిందే (సంపాదకీయం)
న్యాయమూర్తుల అక్రమ ఆస్తుల వివాదం; సరిహద్దులలో
సంచలనం వెనుక నిజాలు (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
రాష్ట్రాల నిలువు దోపిడీ – వి. హనుమంతరావు
భాషా మాధ్యమం – ప్రభుత్వ విధానాలు – ఎన్. సోమశేఖర శర్మ
మాంద్యం నుంచి తేరుకోవడం నిజమేనా? – ఇ.ఎస్. బ్రహ్మాచారి
దళితులను దగా చేస్తున్న కాకినాడ సెజ్ – నక్కా హేమా వెంకట్రావ్
❖ చైనా విప్లవం – విహంగ వీక్షణం – వరవరరావు
❖ చైనా ఆర్థికాభివృద్ధి నమూనా – ఎం. కోదండరాం
❖ చైనా తొలి సెజ్‌లో కార్మికుల దుస్థితి – డయానా బిమోన్‌ట్
❖ చైనాలో విద్య – మొన్న, నిన్న, నేడు – సి.ఎస్.ఆర్. ప్రసాద్
❖ చైనాలో ఏం జరిగింది? – ఘంటా చక్రపాణి
❖ చైనా బొగ్గు గనులు మృత్యు లోగిళ్లు – పిట్టల రవీందర్
విద్యా హక్కు బిల్లు – 2008 – ఎ. నర్సింహారెడ్డి
జాతీయ గుర్తింపు కార్డు పథకం – కొండోజు ప్రసన్నకుమార్, తాళ్లపల్లి సదయ్య
సంస్మరణ – సుబ్రహ్మణ్యం మరో హేమెన్‌డార్ఫ్ – సి.ఎచ్. శ్రీనివాస్
క్షేత్రపరిశోధన అనుభవం – పునస్సమీక్ష – పి.సి. జోషి
సంచార జీవితం, జన్యువుల మార్పులు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
ఆర్థికరంగ అంతరార్థాలకు దర్పణం – విద్యాభూషణ్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

**నవంబర్ 2009** **సంచిక 100**
**❖ ఫోకస్ : ప్రజా జీవన స్థితిగతులు – రావలసిన మార్పులు**
పాలకుల రంగు బయటపెడుతున్న వరద (సంపాదకీయం)
ఆదివాసుల మీద పాలకుల ప్రత్యక్ష యుద్ధం; అమెరికా అధ్యక్షుడికి
నోబెల్ శాంతి బహుమానం (సంపాదకీయ వ్యాఖ్యలు) – ---
కొత్త పుస్తకాలు/సిడిలు – ---
పాఠకుల వీక్షణం – ---
ప్రాంతీయం – ---
సంస్మరణ – బాలగోపాల్ కు జోహార్లు!!
వరదలు – పాలకుల వైఫల్యం – పులుగుజ్జు సురేష్
మాణిక్యాపురం మట్టి మనుషుల వ్యథ – ఎం. కోదండరాం, పిట్టల రవీందర్
ప్రాజెక్టులు – రాజకీయ ప్రయోజనాలు – నాగోబా
చీకటి నుంచి మరింత చీకట్లోకి – వి. హనుమంతరావు
సంస్మరణ – జోగారావు
ఎవరి ప్రయోజనాలకీ గ్రీన్‌హంట్ ? – ప్రజాసంఘాలు, ప్రజాస్వామిక వాదులు
ముంచుకొస్తున్న మహామాంద్యం – అరవింద్
వాతావరణం – క్యోటో ఒప్పంద రాజకీయాలు – కె. నరేంద్రమోహన్
'జన తెలంగాణ' రాష్ట్రం ఏర్పాటు – టి. శ్రీరామమూర్తి
నయా ఉదారవాదం – సంక్షోభంలో ఆర్థికరంగం – ఆర్.వి. రమణమూర్తి
మాంద్యం నుంచి తేరుకోవడం నిజమేనా? – ఇ.ఎస్. బ్రహ్మాచారి
భారతదేశంలో సహకార సేద్య విధానం – వి. చలపతిరావు
దళితులను దగా చేస్తున్న కాకినాడ సెజ్ – నక్కా హేమా వెంకట్రావ్
నేటి సమాజంలో యువతీ, యువకులు – కడియాల సుబ్బనాచారి
ఆంధ్రప్రదేశ్‌లో మానవాభివృద్ధి – గుండేటి రమేశ్
రెండు సినిమాలు – ఒక నవల – పి.వి. రమణ
ఆలోచనలు, అవగాహన – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
చారిత్రక దృక్పథం – కె. బాలగోపాల్
దేశీయం – ---
అంతర్దేశీయం – ---
అసహజ మరణాల సూచి – రాంకి, వై. రామచంద్రం

